*Issued on 27—8—1956*







# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY

## DEBATES

# OFFICIAL REPORT

*THURSDAY, 22nd SEPTEMBER, 1955.*

VOLUME VIII — No. 1.

CONTENTS



PRINTED BY DALTON & COMPANY, KURNOOL
FOR THE SUPERINTENDENT, GOVERNMENT PRESS,
ANDHRA STATE, KURNOOL.

1956

PRICE *6 annas.*

# THE ANDHRA LEGISLATIVE ASSEMBLY.

*Thursday, the 22nd September* 1955.

The House met in the Assembly Hall, Kurnool, at eleven of the clock, Mr. Speaker (The Hon. Sri R. Lakshminarasimham Dora) in the Chair.

## I. SYMPATHY FOR GOA SATYAGRAHIS.

THE HON. SRI B. GOPALA REDDI :—Mr. Speaker Sir, I move:

"This House pays its homage to the Goans in their struggle for the liberation of Goa from Portugese Imperialism and to the Indians, who were the victims of the uncivilized acts perpetrated by the Portugese Government, while offering peaceful Satyagraha."

MR. SPEAKER : The question is :

"This House pays its homage to the Goans in their struggle for the liberation of Goa from Portugese Imperialism and to the Indians, who were the victims of the uncivilized acts perpetrated by the Portugese Government, while offering peaceful Satyagraha."

The motion was carried *nem con*, all members standing for two minutes.

## II. QUESTIONS AND ANSWERS.

### Starred Questions.

*Retiring age-limit of teachers.*

378—

*577 Q.—SRI P. GOPALU REDDI :—Will the Hon the Chief Minister be pleased to state—

(a) whether the retiring age-limit for teachers has been enhanced to 60 years in Local Boards, as it was done for private managements in the State ;

(b) if so, whether the Headmasters of Board Schools will be continued as such or whether they will be re-appointed ; and

(c) whether it is a fact that the Government propose to abolish the Higher Elementary Grade Training Schools for teachers in the State ?

THE HON. SRI B. GOPALA REDDI :

(a) The answer is in the negative.

(b) They may be reappointed under certain conditions.

(c) Yes—gradually.

SRI P. GOPALU REDDI :—అధ్యక్షా ! ఆ ప్రకారంగా వారిని re-employ చేసేటప్పుడు, వారు పూర్వము తీసుకొన్నటువంటి scale లోనే వారిని ఉంచుతారా, లేక, వారిని fresh గా తీసుకొంటారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అంతకు ముందు వారికి ఇస్తున్నటువంటి జీతము ఇవ్వరు. Minimum of the time scale ఇవ్వాలనే ఒక G. O. issue చేయబడింది. కనుక ఆ scale లో minimum ఎంత ఉంటుందో అంత మాత్రం ఇస్తారు.

SRI P. NARASIMHAPPA RAO :—Reappointment చేయడంలో అందరికి సమానంగా చేయడంలేదు. కొంతమందిని reappoint చేస్తున్నారు, కొంతమందిని చేయడంలేదు. ఈ Local Boards లో, గతములో ప్రెశిడెంటు ఉన్నప్పుడు వారు కొంతమంది ఉపాధ్యాయులను reappoint చేస్తూ ఉండినారు ; కొంతమందిని చేయడంలేదు. ఇప్పుడు Special Officers ఉన్నారు. వారుకూడ కొంతమందిని reappoint చేస్తున్నారు, కొంతమందిని చేయడంలేదు. దీనికి కారణమేమిటో ప్రభుత్వము ఆలోచించారా !

THE HON. SRI B. GOPALA REDDI:—మనిషికి మనిషికి తేడా ఉన్నట్లు, teacher కు, teacher కు కూడా తేడా ఉంటుంది. అందులో ఉపాధ్యాయులలో, సరిగా చదువు చెప్పేవాళ్లు ఉంటారు, చెప్పనివాళ్లు ఉంటారు. ఇంకా ఆనేక కారణాలు గుర్తించి re-appointment చేస్తూ ఉంటారు. ఒక్కొక్కసారి సరియైన తర్ఫీదు పొందిన ఉపాధ్యాయులు లేనప్పుడు, ఆ కొరత వల్లకూడ ఇదివరకు ఉన్నవారినే reappoint చేస్తూ ఉంటారు. కనుక ఆనేక పరిస్థితులు గమనించి ఇది చేస్తూ ఉంటారు.

SRI K. SUBBA RAO :—Secondary schools లో head masters గా ఉండి retire అయినటువంటి వారిని, మళ్ళీ headmasters గానే వేస్తారా, లేక assistants గా వేస్తారా ?

THE HON. Sri B. GOPALA REDDI :—Secondary schools లో ఒక్కొక్కసారి headmasters panel అనేది లేనప్పుడు వారిని headmasters గానే వేస్తారు, panel ఉన్నప్పుడు retire అయిన headmasters ను, L. T. assistants గా మాత్రమే వేస్తారు.

SRI K. VIJAYA BHASKARA REDDI :—అధ్యక్షా ! Higher Elementary Schools ను gradual గా close చేస్తామని చెప్పారు. ఆ విధంగా నిర్ణయించుటకు కారణము లేమిటో తెలియ జేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—VIII Standard pass అయి, training అయినటువంటి వారు సరియైన ఉపాధ్యాయులుగా లేరని, కుప్పుస్వామి కమిటీవారు గాని, ఇతర కమిటీవారుగాని చేసిన సిఫార్సు ప్రకారం ఇకముందు School Final పాస్ అయి, Secondary Grade Training అయినవారే teachers గా ఉంటే మంచిదని, standards ను improve చేసే ఉద్దేశంతో ఈవిధంగా చేయదలచాము.

SRI P. SUNDARAYYA :—యాభైయైదేళ్లు దాటిన తరువాత తిరిగి ఉద్యోగం ఇచ్చేటప్పుడు, వారికి అందరికన్న తక్కువ జీతము, minimum of the time scale ఇవ్వవలసిందని G.O. పాస్ చేశామని చెప్పారు. అయితే, వారు 25 సంవత్సరములనుంచి 55 ఏళ్లవరకు అనేక increments పొంది ఉన్నప్పటికీ కూడాముసలి తనములో వారిని మీరే పిలిపించి ఉద్యోగం ఇచ్చినప్పటికి కూడ, వారికి అంత తక్కువ జీతము ఇవ్వడం ఏవిధంగా న్యాయమో తెలియ జేస్తారా ?

THE HON. Sri B. GOPALA REDDI :—ఇరవైయైదు సంవత్సరముల నుంచివారికి వచ్చిన increments తో దీనికి సంబంధంలేదు. వారికి headmaster గా ఏదో రెండు, మూడు increments వచ్చి ఉంటాయనుకోండి, అప్పుడు ఆ scale లో minimum ఇవ్వాలని ఉన్నది. కాబట్టి 25 ఏళ్లనుంచి వచ్చిన increments విషయం కాదిది. వారికి headmaster గా ఎన్ని increments వచ్చి ఉంటారో, అవి వారికి ఇవ్వక పోవచ్చును. Minimum of that time scale ఇస్తారు.

Sri L. LAKSHMANA DAS :—అధ్యక్షా, higher elementary trainings chools ను gradual గా abolish చేస్తామని చెప్పారు. దానికి

ఒక fixed గా five years అనో లేక ten years అనో time చూపించి, ఈలోపల వారు దానికి adjust అవడానికి అవకాశము ఇవ్వవలసిన అవసరమున్నది కనుక, దానికి ఒక time limit నిర్ణయం చేస్తారా?

MR. SPEAKER :—That is entirely a different question. We are not concerned with that question. Re-employment of the retired teachers is now the question.

Several hon. Members :—No, No, Sir. It is in the third part of the question.

THE HON. SRI B. GOPALA REDDI :—Higher Grade Training Schools ను అన్నిటినీ Secondary Grade schools గా మార్చడానికి ప్రయత్నం జరుగుతున్నది. ఒకటి, రెండు సంవత్సరాలలో ఈపని అంతా పూర్తి అవుతుందని ఆశిస్తున్నాను.

SRI P. SUNDARAYYA :—Headmasters ను గాని, ఇతర teachers గాని, reappoint చేసేటప్పుడు వారు retire అయ్యేటప్పుడు వారికి ఏ జీతాలు ఇస్తూ ఉండినారో, ఆ జీతాలే యిస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—బహుశా ఆ జీతాలే ఇస్తారనుకొంటాను. వివరాలు నేను చూడవలసియుంటుంది.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, retire అవుతున్నటువంటి headmaster ను మళ్ళీ headmaster గా వేయడంవల్ల, దిగువ ఉన్నటువంటి assistants కు promotion chances పోతున్నాయి కాబట్టి అలాంటి చిక్కులను overcome కావడానికి ప్రభుత్వము ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఒకొక్కొక్కసారి head masters panel సరిగా ఉండదు. పది సంవత్సరముల సర్వీసు చేసినటువంటి వారు వుండరు. అటువంటప్పుడు retire అయిన headmasters ను headmasters గానే వేయవలసి వస్తుంది. కాని ఈ విధంగా వేయడంలో క్రిందివారికి promotion block అవుతుందనే విషయం తెలుసుకొనే సాధ్యమైనంతవరకు retire అయినటువంటి headmasters కు మరల ఉద్యోగం ఇవ్వడం లేదు.

SRI S. VEMAYYA :—ఈ higher grade training ను క్రమేపి తీసివేసే సందర్భంలో, కనీసం స్త్రీలకైనా ఈ higher grade training ఉండేటట్లుగా ప్రభుత్వం ఏదైనా మినహాయింపు చేయడానికి ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—మంచి టీచర్లు ఉండవలెననే ఉద్దేశ్యంతో అందరుకూడ school final pass అయి secondary grade training అయినవారే ఉండవలెనని పెట్టినప్పుడు స్త్రీలకు, పురుషులకు వ్యత్యాసం చూపకుంటే బాగుంటుంది.

SRI M. NAGESWARA RAO :—అధ్యక్షా, higher grade training తీసివేస్తారని చెప్పారు. కొన్ని schools లో VIII standard వరకే ఉన్నది. ఆ standardsను తీసివేస్తారా, లేక అలాగే continue చేస్తారా, లేక వారికేమైనా సదుపాయం ఉన్నదా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆలోచిస్తాము.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, higher grade training తీసివేస్తారని చెప్పారు. కాని secondary grade pass అయి స్కూళ్ళలో పనిచేస్తున్నవారికి కొంతమందికి higher grade జీతాలు మాత్రము యివ్వడం జరుగుతూంది. కనుక ఆ పద్ధతిని ఇప్పటికయినా మార్పుచేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అది యింకొక విషయము. Higher grade లేనప్పుడు, higher grade scales అని, secondary grade scales అని వుండవు. అప్పుడు lower classesలో ఉన్నవాళ్లకు ఒకవిధమైన scale న్నూ, higher classes లో ఉన్నవాళ్ళకు ఒకవిధమైన scale న్నూ, ఉంటుంది. అది దీర్ఘంగా ఆలోచించవలసి ఉంటుంది.

SRI A. C. SUBBA REDDI :—Headmasters panel ఉండినప్పటికిన్ని కొంతమంది headmasters కు extension ఇస్తున్నారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఒక్కొక్కప్పుడు ఆ panel లో ఉన్నవారు పది సంవత్సరముల సర్వీసు లేకుండా ఉంటారు. అటువంటప్పుడు retire అయినవారినే మరల headmasters గా వేయవలసి వస్తుంది.

MR. SPEAKER :—Questions Nos. 379 and 380 will be taken together.

*Selection of Stationary Sub-Magistrates.*

379—

*518-c Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the number of applications received by the Andhra Public Service Commission this year for the selection of Stationary Sub-Magistrates from among the members of (1) bar, and (2) services ;

(b) the number of them belonging to (1) Scheduled Castes, (2) Backward Classes—Christians separately, and (3) others ; and

(c) the number finally selected in each category ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) No selection has so far been made by the Andhra Public Service Commission in 1955 for the recruitment of Sub-Magistrates,

(b) and (c) Do not arise.

*Selection of Judicial Sub-Magistrates.*

380—

* 907 Q.—SRI M. RAJESWARA RAO : Will the Hon. the Deputy Chief Minister be pleased to state—

(a) the number of Judicial Sub-Magistrates selected by the Andhra Public Service Commission during 1955 ; and

(b) the communities to which they belong ?

THE HON. SRI N. SANJEEVA REDDI :—

(a) Nil.

(b) Does not arise.

Sri PILLALAMARRI VENKATESWARLU:—గత సంవత్సరము ఈ selection ఉన్నదా?

THE HON. SRI N. SANJEEVA REDDI :—లేదని అనుకుంటాను. కాని, వేరే ప్రశ్న వేస్తే చెబుతాను.

*Taking over of Gotlapalem village under the Estates Abolition Act.*

381—

*840 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether the Government have taken over Gotlapalem village in Kovur taluk, Nellore district under the

Madras Estates (Abolition and Conversion into Ryotwari) Act 1948 ; and

(b) if the answer is in the negative, the reasons for the delay in the matter ?

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) The answer is in the negative.

(b) Under Section 9(1) of the Madras Estates (Abolition and Conversion into Ryotwari) Act, 1948 the Settlement Officer, Vijayawada declared that Gotlapalem village is not an Inam estate. The Sub-court, Nellore also declared that Rent Reduction Notification published by the Government in respect of this village was without jurisdiction, illegal and void. The question of taking over the village under the Estates Abolition Act does not, therefore, arise.

SRI S. VEMAYYA:—ఇది ప్రత్యేకమైన గ్రామంగావుండి ప్రత్యేకంగా గ్రామాధికార్లు ప్రత్యేకమైన village accounts వున్నప్పుడు, అది మరొక గ్రామంగా ఎలాగు పరగణింపబడుతున్నదో తెలియజేస్తారా?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఇది బిల్లువచ్చినతరువాత ఆలోచించవలసిన విషయమే కాని, ప్రస్తుతపు Estate Abolition Act ప్రకారము, యీ గ్రామము Inam Estate క్రిందకు రాదు.

*Doctors on reserve duty in the Government Hospitals.*

382—

*165 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) whether there are doctors on reserve duty to each Head-quarters Government Hospital ; and

(b) if so, what are such Hospitals in which reserve doctors are placed ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Assistant Surgeons are not placed on reserve duty in each Headquarters (District as well as Taluk) Government Hospital. In certain District Headquarters Hospitals, where the work is very heavy and the sanctioned staff of

Assistant Surgeons are unable to cope with the work, Assistant Surgeons from out of the quota for leave and epidemic reserve are placed on reserve duty according to the exigencies of the situation.

(b) There are doctors on reserve duty in the following Government Hospitals in the State :—

1. King George Hospital, Visakhapatnam.
2. Government General Hospital, Guntur.
3. Government General Hospital, Kurnool.
4. Government Headquarters Hospital, Eluru.
5. Government Headquarters Hospital, Cuddapah.

SRI S. VEMAYYA :—ఇప్పుడు అనేకమంది patients బాధపడుతు న్నందువల్ల మిగతా జిల్లా headquarters hospitals లో కూడా ఈ reserve doctors ను వుంచటానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు నేను చదివిన answer ను బట్టి reserve doctors ను ఎక్కడ పెట్టుతారని అంటే, అంటు వ్యాధులు యెక్కువగావున్న జిల్లాలలో వారియొక్క వినియోగముకోసమే ఏర్పాటు చేయబడుతున్నారని అంటున్నాను. అంటువ్యాధులు రావాలనే కోరిక ఎవ్వరికినీ వుండదు. కాబట్టి, యితర జిల్లాలలో epidemics లేనికారణంచేత వారిని వుంచ వలసిన అవసరము వుండదని నేను అనుకుంటున్నాను.

*Additional posts of Deputy Directors of Public Instruction.*

383—

*802 Q.—SRI S. RANGANATHA MUDALIAR : (Put by SRI B. P. SESHA REDDI): Will the Hon. the Chief Minister be pleased to state—

(a) whether any additional posts of Deputy Directors under the Director of Public Instruction were sanctioned after the formation of our State ; and

(b) if so, the reasons therefor ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) The answer is in the affirmative. One post of Deputy Director of Public Instruction was sanctioned in November, 1954.

(b) At the instance of the Government of India, a Special Officer's Post of the Grade of a Deputy Director was created in the Office of the Director of Public Instruction to attend to matters relating to planning work. A moiety of the officer's salary and allowances is met by the Central Government.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇప్పుడు డిప్యూటీ డైరక్టర్లను అదనంగా వేశామని అంటున్నారు. ఇంతవరకు యెంతమంది వున్నారు? అదనంగా వేసినవారితో కలుపుకుని యిప్పటికి యెంతమంది అవుతారు? వారియొక్క duties ఏ విధంగా విభజించారు?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇప్పుడు బహుశః వీరు అందరూకూడా చేరి ముగ్గురు వున్నారని అనుకుంటాను. వారిలో ఒకరు elementary education కు, ఒకరు secondary education కు ఒకరు collegiate education కు, యీ విధంగా వారిలో వారు విభజించుకుని ఉంటారు. ఇంకా వివరాలు కావాలంటే, వేరే ప్రశ్న వేయండి.

SRI PILLALAMARRI VENKATESWARLU :— ప్లానింగు చూడడానికి కేంద్రప్రభుత్వంవారు ప్రత్యేకంగా ఒక Deputy Director ను వేయమని అన్నారా? లేకపోతే యీ ప్లానింగుమాత్రము చూడడానికి ఎవరైనను ప్రభుత్వమే ఒక Deputy Director ను depute చేయమన్నారా?

THE HON. Sri B. GOPALA REDDI :—ఒకరిని వేయమనిఅన్నారు. ఈ ప్లానింగులో యింకా ఎన్నో schools రావలసినవి ఉన్నవి. ఇంకను bifur-cated courses ఎన్నో వున్నవి. ఇవన్నీ చూడడానికి ఒకరు ప్రత్యేకముగా వుంటే మంచిదని వారు సిఫార్సు చేశారు. అందువల్ల ఆ విధంగా వేశాము.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— Library Special Officer అనేవారు provincial cadre లో వున్నారు. వారు ఏ cadre లో వున్నారు? అంటే వారు Deputy Director హోదాలో వున్నారా?

THE HON. SRI B. GOPALA REDDI:—వేరే ప్రశ్న వేయండి. బహుశ అట్లాగే వున్నారని అనుకుంటాను.

SRI P. SUNDARAYYA :—డిప్యూటీ డైరెక్టరు కేవలము educationకు సంబంధించిన ప్రణాళికలు చూచేదానికోసమా? లేకపోతే Government of India వారి ప్లానింగు అంతా ప్రచారము చేయటానికోసము వీరిని వేశారా?

THE HON. SRI B. GOPALA REDDI :—ఈయన కేవలము Director of Public Instruction క్రిందవున్న ఆయన. కనుక వీరు ప్లానింగుకు సంబంధించినవారు కాదు. ప్లానింగులో education క్రింద జరుగుతున్న ప్రణాళికలకు సంబంధించినవి చూడ డానికే వీరిని వేశాము.

SRI S. VEMAYYA :—కేంద్ర ప్రభుత్వమువారి ఆదేశము ప్రకారము వేసిన డిప్యూటీ డైరెక్టరుకు కేంద్రప్రభుత్వము యేదైనా జీతము యిస్తున్నదా?

THE HON SRI B. GOPALA REDDI :—ప్రశ్నకు జవాబులో నే చెప్పాను. "A moiety of officer's salary and allowance is met by the Central Government" అని చెప్పాను.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా! Deputy Director post sanction అయిందని అన్నారు. ఈ post లో ఎవరినైనా వేశారా? వేస్తే, వారి పేరు ఏమిటి? అయితే, ప్లానింగుశాఖకు, వారికి ఏ విధమైన సంబంధం వుంటుంది?

THE HON. Sri B. GOPALA REDDI :—వేసినవారి పేరు భాష్య కార్యాచార్యులు అనే నాకు జ్ఞాపకము. Planning లో Education Department కు సంబంధించిన విషయాలు యింకా single teacher schools, అవన్నీ వారు చూస్తారు.

*Opening of a Sub-Registrar's Office at Kollipara.*

384—

* 1550-A Q.—SRI P. SREERAMULU :—(Put by SRI N. C. SESHADRI) :—Will the Hon. the Minister for Revenue be pleased to state—

(a) whether there are proposals to open a Sub-Registrar's Office at Kollipara ; and

(b) if so, the stage at which the matter stands ?

22nd September 1955]

THE HON. SRI K. CHANDRAMOULI :—

(a) Yes.

(b) The proposal will be considered as Part II Scheme for 1956-57.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ Sub-registrars ఆఫీసులను కొత్తగా ఏర్పాటుచేసే సందర్భములో ప్రభుత్వము అవలంబిస్తున్న principle ఏమిటి ?

THE HON. SRI K. CHANDRAMOULI :—సామాన్యంగా, ఆ ప్రదేశములో ఎక్కువగా documents వుండాలి. ప్రభుత్వానికి దానిమీద డబ్బు కొంతవరకు వచ్చేచోటుగా కూడా వుండాలి. వచ్చే డబ్బు అయినా అక్కడ establishment వగైరా ఖర్చులకు సరిపోయేటట్లుగానైనా వుంటుందా కాదా అనేది primaryగా చూస్తారు. అయితేకొన్ని కొన్ని చోట్ల కేవలము ఎక్కువగా డబ్బు రావాలనేది ప్రధాన విషయముగా కాకుండా ఆ యా ప్రదేశముల పరిస్థితులను బట్టి, యింకా ఏమైనా backward areas గా వుంటే, అటువంటి వాటి విషయము కూడా ప్రభుత్వము దృష్టిలో పెట్టుకొని ఆయా చోట్లలోగూడా ఏర్పాటు చేస్తారు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—కొన్నికొన్ని చోట్లలో registration కొరకు నలభైమైళ్లు, యాభైమైళ్ల దూరము పోవలసిందిగా కూడ వున్నది. ఇటువంటి పరిస్థితిగూడా ప్రభుత్వము దృష్టిలోపెట్టుకుని, ప్రజలకు అందుబాటులోవుండేటట్టుగా ఏర్పాటుచేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—ఈవిషయమే నేను యిదివరకు చెప్పాను. Backward areas, ఎక్కువగా దూరముగావున్న ప్రాంతాలు కొన్నికొన్ని ఆలోచించబడతాయి. కాని యీవిషయము కొల్లి వరకు సంబంధించిన ప్రశ్న. సభ్యులు చెప్పేవిషయములో రాబోయే బడ్జటులో provide చేస్తాము.

Sri L. LAKSHMANA DAS :—అధ్యక్షా, Sub-registrar's office ప్రతిచోటులోనూ పెట్టడము కష్టముగనుక, కనీసము ప్రతితాలూకాలోనైనా వారానికి రెండుమూడు దినములు regular గా registration జరిగేటట్లు చేస్తే బాగుంటుంది. కాబట్టి అటువంటి ఏర్పాటుఅయినా చేస్తారా ?

THE HON. SRI K. CHANDRAMOULI :—కొన్నికొన్ని చోట్ల itinery officer ను వేసి, వారానికి ఒకసారి, రెండుసార్లువెళ్లి ఆ గ్రామాలలో

చేయడము యిదివరకే వుంటున్నది. అదికూడా అక్కడక్కడ extend చేసి పనులు జరిగేటట్లు ఏర్పాటుచేస్తాము.

*Drug Inspectors in the State.*

385—

*551 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Planning and Industries be pleased to state—

(a) the number of Drug Inspectors in the State now ;

(b) their scale of pay ; and

(c) the qualification ?

THE HON. SRI K. VENKATA RAO :—

(a) Four

(b) Rs. 125-10-225.

(c) A degree in Pharmacy or Pharmaceutical Chemistry or a Post-graduate in Chemistry with Pharmaceutics as a special subject of a University recognised for this purpose by the appointing authority ; or

(ii) A Pharmaceutical Chemists Diploma granted by the Pharmaceutical Society of Great Britain ; or

(iii) A graduate in Medicine or science of a University recognised for this purpose by the appointing authority having at least one year's Post-graduate training in a laboratory under (1) Government Analyst appointed under the Act, or (2) a Chemical Examiner, or (3) a Fellow of the Royal Institute of Chemistry of Great Britain (Branch E), or (4) the Head of an institution specially approved for the purpose by the appointing authority.

SRI S. VEMAYYA :—ఈ నలుగురు Drug Inspectors ఎక్కడెక్కడ పనిచేస్తున్నారు ? పనిచేస్తూవుంటే, వారియొక్క functions ఏమిటి ?

THE HON. SRI K. VENKATA RAO :—ఈ ప్రశ్నకోసము శ్రీ వేమయ్యగారు యింత శ్రద్ధతీసుకొని వ్రాసినప్పుడు, యీ సప్లిమెంటరీ ప్రశ్నకుకూడా సమాధానమురావటానికి యింకొంచెము శ్రద్ధతీసుకొని వ్రాసియున్నట్లయితే, ఆ

సమాధానముకూడా చెప్పియుండేవాడిని. కాని యిప్పుడు దీనికి హటాత్తుగా సమాధానముచెప్పటానికి నావద్ద వివరాలు లేవు.

SRI S. VEMAYYA :—ఈ Drug Inspectors కు ప్రమోషను ఏదైనా వున్నదా ? అయితే వారిని యిప్పుడు ఏ grade కు promote చేస్తారు ?

THE HON. SRI K. VENKATA RAO :—అసలు యిప్పుడు ప్రస్తుతము వారికివున్న ఉద్యోగము వుంచేచాలునని తెలుసుకోవాలి.

*Lock-outs in the State for* 1954.

386—

*287 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the number of lock-outs in the State for the year 1954 ; and

(b) how they were settled between the workers and the managements ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) 8.

(b) A statement* furnishing information how the lock-outs were lifted, is placed on the table of the House.

SRI S. VEMAYYA :— ఇప్పుడు యీ lock-outs సందర్భములో, conciliation అయినప్పటికిఏకూడా, అది implement చేయబడకుండా ఆలస్యము జరుగుచున్నదని ప్రభుత్వానికి తెలుసునా ? ఆవిధంగా ఆలస్యము జరగకుండా expedite చేయటానికి ప్రభుత్వము తగుచర్య తీసుకుంటుందా ?

THE HON. SRI G. LATCHANNA :—అలాంటి సందర్భాలు ఏవైనా వున్నప్పుడు, complaints ఏవైనా ప్రభుత్వముదృష్టికివస్తే, తప్పకుండా ప్రభుత్వము చర్యలు తీసుకుంటుంది.

*Co-operative crop loan and sale societies and marketing societies.*

387—

* 192 Q.—SRI S. VEMAYYA: Will the Hon. the Minister for Co-operation and Commercial Taxes be pleased to state—

(a) the number of crop loan and sale societies and marketing societies in the State now ;

* Vide appendix I on page 277 infra.

[22nd September 1955

(b) where they are ;

(c) the number of marketing panchayatdars now ; and

(d) the amount of commission paid to them for the year ending 1954 ?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) There are 173 co-operative crop loan and sale societies and marketing societies in the State.

(b) A list* of such societies in each of a Co-operative Deputy Registrar's circle is placed on the table of the House.

(c) 41 marketing panchayatdars were working as on 31st December 1954.

(d) No commission was paid to them as they did not handle any produce.

SRI S. VEMAYYA :—ప్రభుత్వమువారు కమీషనును ఎందువల్ల ఇవ్వకుండా చాలించుకున్నారో తెలుసుకోవచ్చునా ?

THE HON. SRI D. SANJIVAYYA :—వాళ్లు ఏమైనా produce తెచ్చి సొసైటీద్వారా అమ్మితే వాళ్లకు సొసైటీ కొంత ఇస్తుంది. క్రెడిటుసొసైటీ కూడా కొంత ఇస్తుంది. వాళ్లు produce ను handle చేయనప్పుడు కమీషను ఎట్లావస్తుంది?

SRI P. GOPALU REDDI :—అధ్యక్షా, మార్కెటింగ్ సొసైటీలు చాలాచోట్ల ఆర్థికంగా దెబ్బతిని ఉన్నాయి. వాటికి అట్టే ఆదాయము లేకుండా ఉండే పరిస్థితులలో గవర్నమెంటు ఏదైనా సబ్సిడీ ఇచ్చేదానికి పూను కుంటుందా ?

THE HON. SRI D. SANJIVAYYA :—ఇప్పుడు సబ్సిడీ ఇవ్వడానికి ఎలాంటి అవకాశము లేదు.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, ఇక్కడ ఒక list ప్రకటించారు. వాటిలో ఎన్ని liquidate చేయడానికి సిద్ధంగా ఉన్నవి? ఏ నెలలో ఎన్నెన్ని చేయాలో ప్రణాళికకూడా ఏమైనా తయారుచేశారా ?

* Vide appendix II on page 278 infra.

THE HON. Sri D. SANJIVAYYA :—మీరు ప్రత్యేకంగా ప్రశ్నవేస్తే, ఏ సొసైటీల్లో ఏ defect వున్నది, ఏది liquidate చేయలేదు, చేయవలసివస్తే ఎప్పుడుచేయాలి. అంతా చెబుతాను.

Sri VAVILALA GOPALAKRISHNAYYA:—ప్రభుత్వము ఇతర రాష్ట్రాలకు ధాన్యము పంపేదానికోసం కొంటున్నారు. వాటితోపాటు ఇతరవస్తువులుకూడా పంపుతున్నారు.అందువల్ల వీటిద్వారా చాలామంది బ్రతకడానికి అవకాశం ఉంటుంది. ఆవిధమైన సౌకర్యాలు ఇచ్చినప్పుడు అవి బాగా నడుస్తాయికాబట్టి ఆవిధముగా చేయడానికి ప్రయత్నిస్తారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—అవకాశము ఉంటే ఆలోచిస్తాము.

Sri V. VISWESWARA RAO :—అధ్యక్షా, మార్కెటింగ్ సొసైటీ amalgamate చేయడము విషయములోగాని, రద్దుచేయడము విషయములోగాని, ఈసొసైటీల ప్రెసిడెంట్సు అందరికి meeting convene చేసి వాటిని discuss చేసేదానికి చర్యలు తీసుకుంటారా ?

THE HON. SRI D. SANJIVAYYA :—చేయడానికి నాకు ఏవిధమైన అభ్యంతరము లేదు. తప్పకుండా చేస్తాము.

*Opium addicts in the State.*

388—

* 195 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) the number of opium addicts in the State now ; and

(b) whether the number increases or decreases year to year ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :—

(a) The number of opium addicts in the Andhra State during the year 1955 is 8,082.

(b) The number of permit holders for opium has decreased from year to year.

Sri S. VEMAYYA :—నల్లమందు తినేవాళ్లు పూర్తిగాలేకుండా చేయడానికి ప్రభుత్వమువారికి ఎంతకాలము పడుతుంది ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :— ఇచ్చేదున్న agreement ప్రకారము ఇది 1959 సం॥మువరకు ఉంటుంది.

*Range Advisory Committees.*

339—

*316 Q.—SRI VAVILALA GOPALAKRISHNAYYA : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the progress of the Range Advisory Committees constituted under G.O. No. 4223, Development, dated 16th September 1953 of Madras Government ; and

(b) how many Committees were constituted and how many are functioning ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) Out of 83 Committees to be constituted under G.O. Ms. No. 4223 Development, dated 16th September 1953, 81 Committees have been formed.

(b) All the 81 Committees except 3 in Visakhapatnam North Division are functioning.

SRI VAVILALA GOPALAKRISHNAIHA :—అధ్యక్షా, ఈకమిటీలు 82 అన్నారు. ఒక్క విశాఖపట్టణములోమాత్రమే పనిచేయడము లేదన్నారు. అసలు తక్కినజిల్లాలలో ఏదైనా పనిచేస్తున్నది వున్నదా అని అడుగుతున్నాను. దానివద్దనుంచి రిపోర్టు ఏదైనా వచ్చిందా? అసలు అది ఎప్పుడు అయినా సమావేశము అయిందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—నేను దానికి అప్పుడే సమాధానము చెప్పినాను. అయితే Non-officials ఆసక్తి రావడములేదనికూడా తెలుస్తున్నది.

SRI M. R. APPA RAO:—పశ్చిమకృష్ణాలో కమిటీఒకటి వేశామన్నారు. అది ఇంతవరకు సమావేశము కాలేదు. అది function చేస్తున్నట్లు తోచడము లేదు. ఆవిధముగా ఏర్పాటుచేయాలి.

THE HON. SRI B. GOPALA REDDI :—Non-official members కూడా దీనిలో ఎక్కువ interest తీసుకుంటే బాగా పనిచేస్తుంది. లేక

పోతే తహశీల్దార్లు, రేంజి ఆఫీసర్లు, డిప్యూటీ కలెక్టర్లు మాత్రమే అక్కడ ఉంటారు. Non-official members కూడా దయచేసి ఎక్కువ శ్రద్ధతీసుకుంటే బాగుంటుంది.

Sri V. VISWESWARA RAO:—అధ్యక్షా, Non-official members కూడా ఎక్కువ శ్రద్ధతీసుకోవాలని చెబుతున్నారు. నా అనుభవములో అది సరిగా సమావేశము కాలేదని నేను చెబుతున్నాను. కొన్ని రిపోర్ట్సులో కూడా అలాగే ఉన్నవి. దానితోపాటు రాష్ట్రానికికూడా ఒక కమిటీ ఏర్పాటుచేసే ఆలోచన వున్నదా ?

THE HON. Sri B. GOPALA REDDI :—ఇది ఆలోచనలో ఉన్నదని ఇంతకుముందే ఇక్కడ మన M.L.As అందరూ Chief Conservator of Forests ను కలుసుకున్నప్పుడు అనుకొన్నాము. ఇంకా క్రమంగా పనిజరగ డానికి కూడా ఉత్తర్వులు జారీచేస్తాము. బహుశ ఇప్పుడు officials మాత్రమే సమావేశము అవుతున్నారు. మీటింగులు జరుగుతున్నాయి. non-officials ఎక్కువ శ్రద్ధతీసుకోవడం లేదు.

Sri PRAGADA KOTAIAH :—అధ్యక్షా, అధికారులు అసలు ఈ non-officials ను పిలువకుండానే సమావేశములు జరుపుతున్నారనే విషయము ముఖ్యమంత్రిగారికి తెలుసునా?

THE HON. Sri B. GOPALA REDDI :—మెంబర్లుగా వున్నవారికి notice లు ఇస్తున్నారు. మెంబర్లు అనేక గ్రామాలు తిరగడమువల్ల అవి miss అవుతుంటాయి.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :— Non-officials కు అవి అందలేదేమోనని మంత్రిగారు అంటున్నారు. మీటింగువున్నదా అని ఉత్తరము వ్రాస్తే జవాబుకూడా ఇవ్వడములేదు. దానికి మీరు ఏమి చెబుతారు ? ఎన్నోపర్యాయములు ఆ విషయము గురించి అడిగాము. దానికి ఏమి చేయాలో దారి చూపిస్తే ఆలోచిస్తాము. అది ఏమిపని చేస్తోందో మేము ఎట్లా అర్థము చేసుకోమంటారు?

THE HON. SRI B. GOPALA REDDI :—అవన్నీ సక్రమంగా జరిగేట్లు వారికి మేము వుత్తర్వులు జారీ చేస్తాము.

SRI B. SANKARAIAH :—సక్రమంగా జరిపేటానికి వాటిని తిరిగి పునర్నిర్మిస్తారా ? కొన్ని లోపాలవల్ల ఇప్పుడు సరిగా జరగడము లేదు. వాటిని సరి చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇప్పుడువున్న మెంబర్లకు రెండు సంవత్సరములు గడుస్తు ఉన్నది. ఈ రెండు సంవత్సరములు అయ్యేదాకా క్రొత్తవారిని వేసుకొనుట అనవసరము అనుకుంటాను. ఉన్నవాళ్ళతోనే ఈ కమిటీలు సక్రమంగా జరిగేట్లు చూస్తాము.

SRI A. KALESWARA RAO :—Non-official members కు నోటీసులు వెళ్లుతున్నాయా, లేదా, అవి వారికి అందుతున్నాయా లేదా, ఎందుకు అందడము లేదు అన్న విషయము ప్రభుత్వమువారు దర్యాప్తు చేసి సభవారికి తెలుపుతారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—Non-officials ఎందుకు రావడము లేదో మేము చెప్పలేము కాని notice లు పోతున్నాయా లేదా అనేది మాత్రము చూడగలము. వచ్చే బాధ్యతవాళ్ళకే వుంటుంది.

SRI L. LAKSHMANA DAS :—ఈ కమిటీలు సక్రమంగా పనిచేస్తున్నాయా, లేదా అని తెలుసుకొనుటకు ఒక expert కమిటీని అపాయింటు చేస్తారా?

THE HON. SRI B. GOPALA REDDI :—వాళ్లుకూడా పనిచేస్తున్నదీ లేనిదీ తెలుసుకోవడానికి ఏమి చేయాలి ?

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా సక్రమంగా పనిచేసేట్లు చూస్తాము అని చెబుతున్నారు. ఇంతవరకు ఆయా ప్రాంతాల M. L. A. లు అందులో లేరు ఇప్పుడు అయినా వారిని అందులో చేర్చుకుంటారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇప్పుడు ఎటువంటివారిని Non-official member లుగా తీసుకుంటున్నారో తెలియదు. కాని అందరి M. L. A. లకు అడవుల ఇబ్బందుల విషయంలో అట్టే చొరవ వుండదేమో ? అడవుల్లో వుండేవాళ్లు, ఏదైనా శ్రద్ధ తీసుకుంటున్నారా అన్న విషయంకూడా గమనించాలి.

SRI MAHAMMAD TAHSEEL :—అడవి ప్రాంతాలకు సంబంధించిన M. L. A. లను కూడా తీసుకోడానికి ప్రయత్నము చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అవి ఇప్పుడు కొత్తగా constitute చేయడము లేదు. ఇంకా రెండు సంవత్సరములు వ్యవధి వున్నది కాబట్టి reconstitute చేసినప్పుడు కావలసినటువంటి ఉత్తర్వులు జారీచేస్తాము.

SRI MAHAMMAD TAHSEEL :—R.D.O. గారు డిశెంబరు నెలతో వ్యవధి పూర్తి అవుతుందని చెప్పారు. అందుచేత కమిటీలు మరల తిరిగి ఏర్పాటు చేసినప్పుడు M.L.A. యొక్క ఉద్దేశ్యములను కూడా తీసుకోవడానికి ప్రయత్నము చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆలోచిస్తాము అని చెప్పాను.

SRI PILLALAMARRI VENKATESWARLU :—ఈ కమిటీలు 2 సం॥ల వరకు వుంటాయి. ఆ రెండు సంవత్సరముల అనంతరము ఆలోచిస్తాము అన్నారు. ఇంతవరకు కమిటీలు ఎక్కడా పని చేయడము లేదని తెలుస్తున్నది. కాబట్టి వెంటనే పనిచేసే విధముగా పునర్నిర్మిస్తారా ?

THE HON. Sri B. GOPALA REDDI :—వాటన్నింటిని పనిచేసేట్లుగా చూస్తాము. Reconstitute చేయకుండానే వున్నవాటిని చురుగ్గా పని చేసేటట్టు చూస్తాము.

*Village Level Workers in Community Project Area in Kurnool.*

390 —

* 1082 Q.—SRI N. K. LINGAM: Will the Hon. the Minister for Planning and Industries be pleased to state the number of Village Level Officers and Village Guides from the Harijan Community that are now working in the Community Project area in Kurnool District ?

THE HON. SRI K. VENKATA RAO :—

There are no Harijans working as Village Level Workers in the Community Project Area in Kurnool District.

SRI N. K. LINGAM :—ఇకముందైనా హరిజనులకు అందులో ఏర్పాటు చేయడానికి ప్రభుత్వము ఏమైనా ప్రయత్నం చేస్తుందా ?

THE HON. SRI K. VENKATA RAO :—ఇప్పుడు క్రొత్తగా 800 మందికి ట్రైయినింగు ఇస్తున్నాము. అందులో 70, 80 మంది హరిజనులు ఉన్నారు.

వారందరినీ ఎక్కడో ఒకచోట వేయాలి. అయితే వారు కోరిన ప్రకారం కడప, కర్నూలులలో వేస్తారో లేదో చెప్పలేము కాని హరిజనులకు దేశము అంతా వేస్తాము.

SRI N. C. SESHADRI :—Village Level Workers ను temporary గా appoint చేశారా లేక permanent గా appoint చేశారా ?

THE HON. SRI K. VENKATA RAO :—అసలు National Extension Service Schemes temporary గా ఉన్నాయి. అందువల్ల అందులో పనిచేసే వారు temporary యే అవుతారు.

*Scholarships granted to the children of Mica Mines Workers in Nellore district.*

391—

*288 Q.—SRI S. VEMAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the number of scholarships granted to the children of Mica Mining Workers in Nellore district in the State for the year ending 1954-55 ; and

(b) the amount paid ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) 20

(b) Rs. 720

SRI S. VEMAYYA :—మైకా మైన్సులో పనిచేసే workers పిల్లలందరికీ scholarships ఇస్తున్నారా ? కొంతమందికే ఇస్తున్నారా ?

THE HON. SRI G. LATCHANNA :—20 మందికి స్కాలరుషిప్పులు ఇచ్చారని చెప్పాను. పిల్లలు చాలామంది ఉంటారు. ఇచ్చినది 20 మందికి మాత్రమే.

SRI S. VEMAYYA .—మైకా మైన్సులో పనిచేసే workers పిల్లలందరికీ స్కాలరుషిప్పులు ఇచ్చే పద్ధతి ప్రభుత్వానికి ఉన్నదా, లేదా ?

THE HON. SRI G. LATCHANNA :— స్కాలరుషిప్పులు చదువు సంధ్యల ఖర్చులు భరించలేని వారికి ఇస్తారు. ప్రతి వారికి ఇవ్వరు. ఎటువంటి హంగులు లేనివారికే ఇస్తారు.

SRI B. SANKARAIAH :—మైకా workers పిల్లల విషయంలో వచ్చిన applications ఎన్ని ? Reject చేసిన applications ఎన్ని ఉన్నాయి ?

THE HON. SRI G. LATCHANNA :—నా దగ్గర ఉన్న information లో ఆ వివరాలు లేవు.

*Vattambedu Co-operative Society, Ltd., Nellore for salvage of dry Cows.*

392—

* 613 Q.—SRI P. GOPALAKRISHNA REDDI : Will the Hon. the Minister for Co operation and Commercial Taxes be pleased to state—

(a) whether the Government have received any representation on 26th April 1955 from the villagers of Vattambedu requesting that "The Vattambedu Co-operative Society, Ltd." No. 637 for the salvage of dry cows and she-buffaloes in Nellore district may be handed over to them ; and

(b) if so, the action taken thereon ?

THE HON. SRI D. SANJIVAYYA :—

(a) Yes, Sir.

(b) It is under examination in consultation with the Registrar of Co-operative Societies.

SRI S. VEMAYYA :—ఎంతకాలంలోపల ప్రభుత్వం ఒక నిర్ణయానికి వస్తుందో తెలుసుకో వచ్చునా ?

THE HON. SRI D. SANJIVAYYA :—కొంతకాలంలోగానే.

*Executive Officers to District Boards.*

393—

* 1543-A Q.—SRI P. PARTHASARATHI : Will the Hon. the Minister for Local Administration and Prohibition be pleased to state—

(a) whether the Government are proposing to have Executive Officers to the District Boards; and

(b) if so, whether the present Personal Assistant to the Special Officers, District Boards will be appointed as Executive Officers ?

THE HON. SRI A. B. NAGESWARA RAO :

(a) The answer is in the negative.

(b) Does not arise.

*Increase of State Revenues*

394—

* 1147 Q.—SRI A. KALESWARA RAO : Will the Hon. the Chief Minister be pleased to state—

(a) the steps taken by the Government to increase State Revenues ; and

(b) whether the Government propose to take up the Bus Services in the state and increase State Revenues ?

THE HON. SRI B. GOPALA REDDI :—

(a) Government have decided to introduce the additional taxation measures which were enumerated in the Budget speech.

(b) No, Sir.

Sri A. KALESWARA RAO :—మన ప్రక్కన ఉన్న హైదరాబాదు, బీహారు, ఒరిస్సారాష్ట్రిల్లోనుకూడా, బస్సుసర్వీసును ప్రభుత్వంక్రిందకు తీసుకుని చాలా డబ్బు సంపాదిస్తున్నసంగతి ప్రభుత్వానికి తెలుసునా? హైదరాబాదురాష్ట్రిం లోనే ప్రతిసంవత్సరం 50 లక్షలరూపాయల నికరాదాయం వస్తున్నదనే సంగతి ప్రభుత్వానికి తెలియునా?

THE HON. SRI B. GOPALA REDDI :—నికరాదాయం ఎంత వస్తున్నదో నాకు తెలియదుకాని కొన్నిరాష్ట్రిల్లో బస్సుసర్వీసు Nationalise చేసినసంగతి నాకు తెలుసును. ఉత్తరప్రదేష్‌లో నష్టంమీద పనిచేస్తున్నట్లు తెలుసును. ఇక్కడ అటువంటి ఆలోచన ఏమిలేదు.

SRI L. LAKSHMANA DAS —బస్సు సర్వీసు చాలా profitable concern అయినందువల్ల ఇతర State Governments ఆ income సంపాదించాలని చూస్తుంటే ఆంధ్రరాష్ట్రంలోకూడా వెంటనే తీసుకోడానికి ఎందుకు ప్రయత్నం చేయకూడదు ?

THE HON. SRI B. GOPALA REDDI:—దానిని తీసుకోవడానికి కావలసినద్రవ్యం ఇరిగేషన్, electricity వగైరాలకు కావలసి ఉన్నది. ఆవిధ

పైన capital expenditure బస్సుసర్వీసులను తీసుకోడానికి వినియోగించడానికి వీలులేకుండా ఉన్నది.

SRI K. VIJAYA BHASKARA REDDI :—డబ్బులేదని అన్నారు. వ్యాపారదృష్టి తో చూస్తున్నాము కనుక loan float చేయడానికి ప్రభుత్వం ఆలోచిస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ప్రతిసంవత్సరం మనం loan float చేయవలసేయున్నది. దానికి interest కూడా pay చేయాలి. దీనినిగురించి ప్రత్యేకంగా ఆలోచించాలి.

SRI E. AYYAPU REDDI :—State Government bus service ను nationalise చేస్తే లాభదాయకంగా ఉంటుందా లేదా అనే విషయంగురించి ఆలోచించడానికి ప్రభుత్వం ఒక కమిటీని ఏర్పాటుచేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ద్రవ్య వసతి ఉన్నప్పుడు కమిటీని ఏర్పాటుచేయవచ్చును. మద్రాసు రాష్ట్రంలో city service ను మాత్రమే nationalise చేశారు. మనకుకూడా ఒక పెద్ద city ఉంటే nationalise చేయడానికి వీలు ఉంటుంది. మనవి అన్నీ mufasil routes. అవి బాగా pay చేయవు. ఏమైనా ప్రస్తుతం ఈ ఆలోచన ప్రభుత్వానికి లేదు.

SRI N. VENKAIAH :—కొన్ని లాభకరమైన routes నైనా నిర్ణయించి వాటిని తీసుకోడానికి ప్రభుత్వం ఆలోచనచేస్తుందా ?

THE HON SRI B. GOPALA REDDI :—ఈసమస్య ఏమి యింత వరకు ఆలోచించలేదని మొదటే చెప్పాను.

SRI M. R. APPA RAO :—ఈవిషయంలో V. V. రామనాథంగారిని Special Officer గా వేశారు. Nationalisation గురించి ఆయన రిపోర్టులో ఏమిచెప్పారో చెబుతారా?

THE HON. SRI B. GOPALA REDDI :—Nationalisation గురించి ఏమిచెప్పారో నాకు తెలియదు. ఇతరవిషయాలలో వారు చెప్పిందినాకు కొంచెం తెలుసును.

SRI D. KONDAIAH CHOWDARY :—బస్సుసర్వీసు తీసుకోడానికి చాలాడబ్బు అవుతుంది అంటున్నారు. వీటిని పొందినవారు transfer

చేసుకుంటూ కొన్ని వేలు లక్షలు సంపాదిస్తున్నారు. ప్రభుత్వం నిర్వహించకపోయినా bus routes వేలంవేసి హెచ్చుపాటదారునికి ఇస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ వేలం విషయం ఇది వరలో చాలాసార్లు పరిశీలించాము. వేలం వేసి ఒకరికే ఏ అయిదు సంవత్సరాలకో మొనాపలిగా ఇవ్వడం కాదని దానిని గురించి ఇంతకుముందే చాలామార్లు వివాదాలు జరిగాయి. అటువంటి ఆలోచన ఇప్పుడు ఏమి లేదు.

SRI T. JALAYYA :—బస్సురూట్లు తీసుకోడానికి డబ్బు లేకపోతే కంపెనీలవాళ్లు అప్పు ఇస్తారు కాబట్టి ఎందుకు తీసుకోకూడదు ? ఒక జిల్లాకయినా పెట్టి ఎందుకు చూడకూడదు ?

THE HON. SRI B. GOPALA REDDI :—మార్వాడీ వడ్డీ రేట్లతో, విజయవాడ, గుంటూరు మొదలైనచోట్ల తీసుకున్నట్లుగా, గవర్నమెంటు తీసుకోవాలనా, మీ సలహా ?

SRI T. JALAYYA:—నూటికి రు. 4 ల వడ్డీకి ఇచ్చే కంపెనీలు ఉన్నాయి. గ్యారంటీ ఇస్తాము. తీసుకుంటారా ?

(NO ANSWER)

SRI K. SUBBA RAO :—ఒకటి రెండు మోటారు కంపెనీలు తప్ప మిగతావారికి విజయవాడ మొదలైన ప్రాంతాల్లో మార్వాడీలదగ్గర అప్పు ఉన్న సంగతి ప్రభుత్వానికి తెలుసా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇది రామనాదన్ గారి రిపోర్టులో కూడా ఉన్నది. నేనూ వింటున్నాను.

SRI C. SUBBARAYUDU :—ఇతర రాష్ట్రాలలో ప్రభుత్వమే బస్సు రూట్లు నడుపుతున్న సంగతి ప్రధానమంత్రిగారు చెప్పారు. ఇది ఏ రాష్ట్రాల్లో ఏ విధంగా పనిచేస్తున్నదో, వాటికి working expenses వివరాలు ప్రభుత్వం సేకరించి మెంబర్లకు అందచేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—సేకరించడానికి ప్రయత్నం చేస్తాము.

SRI P. GUNNAYYA:—బస్సు సర్వీసును అయిదు సంవత్సరాలు లోపుగానైనా ప్రభుత్వం తీసుకోడానికి ఏర్పాటు చేస్తుందా ?

MR SPEAKER :—The next Government will answer you.

Sri S. VEMAYYA :—బస్సురూట్లు వ్యక్తులు చేతులు మారుతున్నాయి. ప్రభుత్వం దానిని అరికట్టడానికి చర్యలు తీసుకుంటుందా ?

THE HON. Sri B. GOPALA REDDI :—Rules ప్రకారం ఆమోదించరు. ఒక్కొక్కసారి R.T.O. లు కొన్ని పరిస్థితులలో ఒప్పుకుంటూరు. మామూలు పరిస్థితుల్లో ఒప్పుకోరు. అవసరం లేనప్పుడు surrender చేయాలనే R. T. O. చెబుతారు.

Sri J. CHANDRAMOULI :—అసెంబ్లీ మెంబర్లలో బస్సురూట్లు ఎంత మందికి ఉన్నాయో చెబుతారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—అవసరం లేదనుకుంటాను ఆ statistics.

SRI M. NAGESWARA RAO :—బస్సురూట్లు వ్యక్తులకు ఇచ్చేదానికంటె ఒకమొత్తంగానైనా Co-operative Societies కు ఇవ్వడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తుందా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆ మాదిరి ఏమీ లేదు. Wholesale co-operative societies కు, ఇవ్వాలనా మీ ఉద్దేశ్యం?

Sri M. NAGESWARA RAO :—ఒక వ్యక్తికే లాభం కలిగేదానికంటె Co-operative Societies కు ఇస్తే 25 మందికో 30 మందికో లాభాలు వుండే అవకాశం ఉంటుంది. దానికి ప్రయత్నం చేస్తారా ?

THE HON. Sri B. GOPALA REDDI :—ఇప్పటికే Ex-service co-operative societies కు transport co-operative societies కు ఇస్తున్నారు. ఆ అవకాశాలు కలిగిస్తునే ఉన్నాము.

Sri N. P. CHENGALARAYA NAIDU :—ట్రాన్స్‌పోర్టు port folio Chief Minister గారిచేతిలోనికి ఎప్పుడు వచ్చిందో చెబుతారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—కాశీశ్వరరావుగారినే అడగండి.

Sri. P. NARASIMHAPPA RAO :—బస్సురూట్లు ఒకొక్కరికి 3,4 ఇస్తున్నారు. వాళ్లకు workers ఉన్నారు. చిన్నవాళ్లకు ఇవ్వకుండా ఉన్నారు. వర్కర్లు పెట్టుకున్నవారికి ఇవ్వకుండా చేస్తారా ?

[22nd September 1955

THE HON. SRI B. GOPALA REDDI :—వెంగలరాయనాయుడుగారు చెప్పినట్లు ట్రాన్సుపోర్టు port folio ను గురించి కాదు ప్రశ్న. గవర్నమెంటుకు ఆదాయం వచ్చే విషయం. దానిని గురించి ప్రత్యేకంగా చెప్పండి.

*Drinking water wells, etc., for ex-criminal Tribes in Cuddapah district.*

395 -

* 451 Q.—SRI P. VENKATASUBBAYYA : Will the Hon. the Minister for Electricity and Social Welfare be pleased to state—

(a) the number of drinking water wells sanctioned during the year 1954-55 and executed by the District Welfare Officer, Cuddapah ; and

(b) the number of latrines sanctioned and completed during the year 1954-55 in Cuddapah district by the Welfare Department, and if they are not yet completed, the reasons therefor ?

THE HON. SRI G. LATCHANNA :—

(a) 8 Wells have been sanctioned and executed by the District Welfare Officer, Cuddapah during 1954-55 for ex-criminal Tribes. Four wells have been completed and the rest four are under progress.

(b) No latrines were sanctioned during 1954-55. One latrine work was taken up in 1953-54 and it was completed in this year. The delay is due to the fact that the type of latrines to be constructed has not been decided upon in the year 1954-55.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, జిల్లాలో 8 బావులు శాంక్షను చేసినాము, అందులో 4 పూర్తి చేసినాము అన్నారు. మొత్తము గ్రామాలలో వెయ్యి బావులకు అవసరం ఉండవచ్చును. అనేక పిటీషనులు వస్తే శాంక్షను చెయ్యకుండా ఆపివేసి నాలుగు కట్టడము చాలాతక్కువ అని మంత్రిగారు గ్రహిస్తున్నారా ?

THE HON. SRI G. LATCHANNA :—సభ్యులు నా సమాధానం వినలేదని మనవిచేస్తున్నాను. నేను చెప్పిన ఎనిమిదిన్నీ, ex-criminal tribes

22nd September 1955]

వారికి హరిజన వెల్ఫేరు డిపార్టుమెంటువారు కట్టినవి. Rural water supply scheme క్రింద రివెన్యూ డిపార్టుమెంటువారు కట్టినవి 67. మొత్తము 75.

Sri N. C. SASHADRI :—మంచి నీటి బావులు ఇన్ని రోజులుగా హరిజనులకు గవర్నమెంటువారే కట్టించి ఇస్తున్నారు. ఇప్పుడు గ్రాంట్లు కంట్రిబ్యూషనులు అడుగుతూ ఉన్నారు. ఇదివరకు లాగే ఫ్రీగా కట్టించి ఇస్తారా లేకపోతే ప్రజలు కంట్రిబ్యూషనులు ఇచ్చుకోవలసి ఉంటుందా ?

THE HON. SRI G. LATCHANNA :—హరిజన వెల్ఫేరు డిపార్టుమెంటు ప్రారంభించినవి కొన్ని, Rural water supply scheme క్రింద రివెన్యూ డిపార్టుమెంటు ప్రారంభించినవి కొన్ని, మిగిలినవన్ని హెల్తు డిపార్టుమెంటు పూర్తిచెయ్యడానికి కార్యక్రమము సాగిస్తున్నారు. వచ్చే రెండవ పంచవర్ష ప్రణాళికలో ప్రజలు కొంతభారము వహించవలెననే సిద్ధాంతము ఉన్నది.

SRI N. K. LINGAM :—ఈ మంచి నీటి బావులు, మురుగు దొడ్ల విషయములో హరిజన వెల్ఫేరు డిపార్టుమెంటువారు చూస్తున్నారు. గాని ఒక జిల్లాకు ఒక ఆఫీసరుగా ఉంటున్నారు. ఆ పనులు సక్రమముగా అయినట్లు తనిఖీ లేక సక్రమమైన రాకపోకలకు అవకాశము లేక పనులు చాలా ఆలస్యముగా జరుగుచున్నవి. సుమారు ఏడు సంవత్సరాలు పనిచేసి 70 బావులు కట్టించినారు. వాటిని లోకలు తాసీల్దార్లకు ఒప్పచెపితే ఆ పనులు త్వరగా జరుగుతవి అన్న విషయం ప్రభుత్వం ఆలోచన చేస్తుందా ?

THE HON. SRI G. LATCHANNA :—హరిజన వెల్ఫేరు డిపార్టుమెంటు మంచి నీటి బావుల కార్యక్రమము ప్రత్యేకము హరిజనులు ఎక్కువగా ఉండి మంచి నీటి వసతులు లేనిచోట సాగిస్తున్నది. అన్నింటి బాధ్యత హరిజన వెల్ఫేరు డిపార్టుమెంటు వహించలేదు. ఇంతవరకు రివెన్యూ డిపార్టుమెంటు వహించుతూ ఉండేది. ఇప్పుడు పబ్లికు హెల్తు డిపార్టుమెంటు నిర్వహిస్తుంది. 75 బావులు త్రవ్వింది ఏడు సంవత్సరాలలో కాదు. 1954-55 సంవత్సరములో కడప జిల్లాలో 75 బావులు త్రవ్వించినది.

SRI N. SRINIVASA RAO :—అధ్యక్షా ! నీరు ప్రాణాధారము అనే ఆరోగ్యశక్తిని ఆలోచించి ప్రభుత్వం వారు ఊరూరా మంచి నీటి వసతులు కల్పిస్తారా ?

THE HON. SRI G. LATCHANNA :—హరిజనులు ఎక్కువగా ఉండి మంచి నీరు లేని చోట్ల ఇప్పుడు పబ్లికు హెల్తు డిపార్టమెంటు చేస్తున్నప్పటికి హరిజన వెల్ఫేరు డిపార్టుమెంటు ప్రత్యేకముగా వ్యవహరిస్తారని నేను మనవి చేస్తున్నాను.

SRI S. VEMAYYA :—1954-55 లో ఎనిమిది బావులు ఎక్స్కవేటు చేసినామని చెప్పారు. ఎంత డబ్బు ఖర్చు చెయ్యబడింది? 1954-55 లో అలాటుమెంటు అయిన డబ్బు పూర్తిగా ఖర్చు చెయ్యబడ్డదా, లేక లాప్సు అయినదా ?

THE HON. SRI G. LATCHANNA :—1954-55 లో ఎక్స్కవేటు అయిన బావులు ex-criminal tribes వారికి 12 వేల రూపాయిలు ఖర్చు అయినవి. మిగతా డబ్బు ఈ ఏడాది ఖర్చు అవుతుంది.

SRI L. LAKSHMANA DAS :—అధ్యక్షా! రెండవ పంచవర్ష ప్రణాళికలో మంచి నీటి బావులకు ఎవరికైనా సరే కొంత కంట్రిబ్యూషను కావలెనని అన్నారు. కాని మంచి నీరు అందరికీ అవసరము. కాబట్టి ప్రభుత్వం బావులు లేని ప్రతి గ్రామము లోనూ ఎటువంటి కంట్రిబ్యూషను లేకుండా ప్రభుత్వమే త్రవ్వించడానికి గట్టి ప్రయత్నము చేస్తుందా అని అడుగుతున్నాను.

THE HON. SRI G. LATCHANNA :—ప్రత్యేక ప్రశ్న వెయ్యండి.

SRI M. NAGESWARA RAO :—అధ్యక్షా! వివిధ జిల్లాలలో త్రవ్వించిన బావులు హరిజనులు, సవర్ణులుకూడా ఉపయోగించుకోవచ్చునా ? హరిజనులకు ప్రత్యేకముగా అని వేరే ఉన్నదా ?

THE HON. SRI G. LATCHANNA :—ప్రత్యేక ప్రశ్న వెయ్యండి. తప్పకుండా మనవిచేస్తాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఇదివరకు రెవెన్యూ డిపార్టుమెంటుద్వారా త్రవ్వబడిన బావులు ఇప్పుడు హెల్తు డిపార్టుమెంటుకు ట్రాన్సఫరుచేసినారు అన్నారు. అదివరకు త్రవ్వకుండా ఉన్నవి. పూర్తిచెయ్యనివాటి గురించి వారిని అడగవచ్చునా ? ఈ సంవత్సరం ఆఖరులోగా పూర్తిచెయ్యమని వారిని అడుగవచ్చునా?

THE HON. SRI G. LATCHANNA :—ప్రత్యేక ప్రశ్న వేస్తే వావిలాల గోపాలక్రిష్ణయ్యగారికి సమాధానము చెబుతాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—ఎక్స్కవేటు కాని వాటిని గురించి ఇప్పుడు హెల్తు డిపార్టుమెంటువారిని అడగమంటారా ?

THE HON. SRI G. LATCHANNA :—హరిజన వెల్ఫేరు డిపార్టుమెంటు ప్రత్యేకముగా హరిజనులు ఎక్కువగా ఉన్నచోట హరిజన వెల్ఫేరు

గ్రాంటులనుంచి కార్యక్రమము సాగిస్తుంది. యధావిధిగా rural water supply scheme ల క్రింద జరిగే పనులు ఇదివరకు రివెన్యూ డిపార్టుమెంటు చేసేది, ఇప్పుడు హెల్తు వారు తీసుకున్నారు అని ఘోట్టగా చెప్పాను.

SRI N. VENKAIAH :—బావుల విషయములో హరిజనులకు ఇచ్చేవి హరిజన క్రిస్టియనులకు ఇస్తున్నారా ?

THE HON. SRI G. LATCHANNA :—మంచి నీరు అంతా తాగుతారు.

Sri P. GUNNAYYA :—అధ్యక్షా, మంత్రిగారు ఎక్కువ హరిజనులు ఉన్న పేటలలో మంచి నీటిబావులు ఉన్నవి అన్నారు. 10, 15 హరిజన ఇళ్లు ఉన్నచోట కూడా ప్రభుత్వం ఏర్పాటు చేస్తారా?

THE HON. Sri G. LATCHANNA :—10, 15 మంది అని కాదు. అందరికీ కలిపి బావుల అవకాశం కలుగచేస్తారు.

SRI S. VEMAYYA :—బావులు త్రవ్వించిన తరువాత ఆ బావులలో నీరు ఉన్నదా లేదా తెలుసుకోనేదానికి ప్రభుత్వం పదే పదే పీరియాడికలుగా చూసే దానికి ఏమైనా ప్రయత్నం చేస్తుందా ?

THE HON. Sri G. LATCHANNA :—బావులు త్రవ్వినతరువాత నీరు పడకపోతే ఇంకా బోరు చెయ్యడము, re-estimate చేసే కార్యక్రమము జరుగుతుంది. ఫిర్యాదులు ఎవరైనాచేస్తే విచారణ చేస్తాము.

[Note : An asterisk * at the commencement of a speech indicates revision by the Member.]

## III. GOVERNMENT MOTION.

### *Motion under Rule 24 of the Assembly Rules.*

THE HON. SRI B. GOPALA REDDI : Mr. Speaker, Sir, I beg to move :—

"That Rule 24 of the Assembly Rules be suspended and the House do resolve to transact official business on Thursday, the 22nd September 1955 and the non-official business, on Saturday, the 24th September 1955."

MR. SPEAKER :—Motion moved :—

"That Rule 24 of the Assembly Rules be suspended and the House do resolve to transact official business on Thursday, the 22nd September 1955; and the non-official businesson Saturday, the 24th September 1955."

SRI K. V. S. PADMANABHA RAJU :—అధ్యక్షా ! ఇప్పుడు మా ముందు circulate చేసిన ఎజెండాలో దగ్గర దగ్గర పదిబిల్లులు introduce చేస్తారని ఉన్నది. గాని గత పదిహేనురోజులక్రిందట సభ్యులకు సర్క్యులేటు చేసినదానిలో ఇనాముల బిల్లుకూడా ఉంది. ఇప్పుడు అదిలేదు. దీనికి కారణము ఏమిటో అధ్యక్షుల వారు తెలియపరుస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ దినము పదిబిల్లులు ఉన్నవి. వాటిని తీసుకొని రెండుదినాల ఎజెండా ఇచ్చారు. 24 వ తేది Non-official day. 25 వ తేది ఆదివారం. 26 వ తేది తరువాత జరగవలసిన కార్యక్రమము ప్రింటు చేస్తారు. మళ్లీ కార్యక్రమము ఇస్తాము.

SRI K. V. S. PADMANABHA RAJU :— ఇనాముల విషయం ఉన్నదా ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఇంకా గవర్నమెంటు ఆఫ్ ఇండియావారి ఆమోదము రాలేదు. మూల లక్ష్యం ఏమీ లేదు.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Non-official days ను అధికార కార్యక్రమాలకి గాను తీసుకోవడం ఇదివరకూ జరిగింది. Non-official Business కు శనివారం కేటాయించడము సంతోషముగనే ఉంది. ఇది వరకు ఇవ్వవలసిన Nonofficial days కు Compensation గా కొన్ని రోజులు కేటాయిస్తే బాగుంటుంది.

THE HON. SRI B. GOPALA REDDI :—పాత బాకీలు తీర్చవలెనని పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు చెప్తూవచ్చారు. కాబట్టి రెండవ Non-official Day కూడా ఇవ్వడానికి ప్రయత్నం చేస్తాము.

MR. SPEAKER :—The question is :

"That rule 24 of the Assembly Rules be suspended and the House do resolve to transact official business on Thursday, the 22nd September 1955, and the non-official business, on Saturday the 24th September 1955."

The motion was put to vote and carried.

## IV. GOVERNMENT BILLS.

### (1) *The Madras Buildings (Lease and Rent Control) Andhra Amendment Bill*, 1955.

THE HON. SRI B. GOPALA REDDI :—Mr. Speaker, Sir, I beg to introduce the Madras Buildings (Lease and Rent Control) Andhra Amendment Bill, 1955, and move.

'That the Bill be taken into consideration'.

1949 నుంచి అమలులోవున్న శాసనం గడువు 30 వ సెప్టెంబరుతో ఐపోతూ యున్నది. కాబట్టి దాన్ని మరల ఇంకొక మూడుసంవత్సరాలు పొడిగించాలని ఈబిల్లు యొక్క ఉద్దేశ్యం. ఈనాడు దీనిని pass చేస్తేనప్ప సెప్టెంబరు 30 వతారీఖులోపల దీనికి ప్రెసిడెంటుగారి ఆమోదం పొందడానికి వీలుండదేమోనని అనుకుంటున్నాను. ఐతే దీంట్లో Chambers of Commons వారులేక Government of India వారు సూచించిన కొన్ని సవరణలుకూడా అక్కడక్కడ ఉన్నాయి. ఈనాడు member లు చెప్పే సవరణలుకూడా ఆలోచించి ఇంకా రెండు, మూడు మాసాలలోనే దీనికి ఒక సవరణబిల్లు తీసుకురావాలనికూడా ఒక ఆలోచన ఉంది. ఇప్పుడు ఈ బిల్లు non-residential houses, అంటే offices వగైరాలున్న houses కు వర్తించాలా, లేకపోతే ఎటువంటి ఇళ్ళకు వర్తించాలి అనే విషయంకూడా ఆలోచించవలసియున్నది. Deputy Collector లు కంట్రోలర్లుగా ఉండాలా, లేక District Munsif లు కంట్రోలర్లుగా ఉండాలా అనేదాని విషయమై కొన్నికొన్ని సవరణలు Government of India వారూకూడా సూచించారు. ఇవన్నీకూడా ఆలోచించి ఇంకా రెండుమూడు మాసాలలో సవరణ తీసుకురావాలనే మా ఉద్దేశ్యం. కాని ప్రస్తుతం ఉన్న శాసనకాలాన్ని మూడు సంవత్సరాలవఱకూ పొడిగించవలసినదని ప్రతిపాదన. ఇది లేకపోయినట్లయితే October 1 వ తేదీ తరువాత అనేకమంది ఇళ్లగలవారు వారి ఇళ్ళలో అద్దెకున్నటువంటివారిని లేవగొట్టడమో లేకపోతే వాళ్ళ ఇష్టంవచ్చినట్లు అద్దెలు పెంచడమో జరుగుతుందనే భయంచేత ఈప్రతిపాదన తీసుకువచ్చాం. మన ఆంధ్రదేశంలో చాలా పట్టణాలలో ఇప్పటికీ ఇంకా గృహవసతివిషయమై ఇబ్బందిగానే యున్నది. అందుకనే మదరాసునుంచి మన offices ను తీసుకుని రాలేకుండా పోతున్నాం. గుంటూరులోకాని, బెజవాడలోగాని, విశాఖపట్టణంలోగాని, ఇంకా ప్రతి town లోకూడా ఇళ్ళకు చాలా ఇబ్బందిగాయున్నది కాబట్టి ఈ చట్టం ఇంకా మరి కొంతకాలం ఉండడం అవసరమని తలచి ఇది సెప్టెంబరు 30 వ తేదీలోపల ప్రెసిడెంటుగారి అమోదం పొందవలసియున్నది కాబట్టి ఈ బిల్లును ఇప్పుడు move చేస్తున్నాను. ఇంకా ఏమైనా విషయాలూ, వివరాలూ మెంబర్లు చెప్పదలచుకుంటే చెప్పవచ్చును. ఈచట్టంవల్ల రెండే రెండులాభాలున్నాయి. తమకు ఇష్టంలేనివారిని లేవగొట్టి ఇంకొకరి కెవరికైనా lease చేయడానికి వీలు

Sri B. Gopala Reddi] [22nd September 1955

లేకుండా ఒకచట్టం ఉన్నది. తరువాత rent control అంటే tenant గాని, ఇల్లుగలాయన గాని Deputy Collector దగ్గరకుపోయి fair rent fix చేయు వలసినదని కోరడానికికూడా వాళ్ళకు అవకాశం ఉన్నది. అది చాలా ఉపయోగకారిగాయున్నది. పోయినసంవత్సరం ఈ Act క్రింద 2122 applications Deputy Collector ల దగ్గరకు వచ్చినవి. వాటిలో 1677 applications ను dispose of చేసినారు. ఈసంవత్సరంకూడా జనవరినుంచి అగస్టువరకూ జిల్లాలలో వచ్చినటువంటి applications ను గురించి లెక్కలుకూడా యున్నవి. అవికూడా dispose of చేస్తున్నారు. మొత్తంమీద ఈ చట్టం కొంతకాలం ఉండడం అవసరమనే ఉద్దేశ్యంతో దీన్ని మూడుసంవత్సరాలవరకూ పొడిగించాలనే ఈ ప్రతిపాదన తీసుకువచ్చాను.

MR. SPEAKER :—Motion moved —

"That the Madras Buildings (Lease and Rent Control) Andhra Amendment Bill, 1955, be taken into consideration."

PILLALAMARRI VENKATESWARULU:—అధ్యక్షా! ఈ బిల్లు అవసరం అనేదానిలో ఏ విధమైన అభిప్రాయభేదం లేదు. అందువల్ల ఈ Act జీవితం పొడిగించవలసినదే. మంత్రిగారు మాట్లాడుతూ 2, 3 నెలలలో మరోచట్టం తీసుకరాబోతున్నాం, అది సమగ్రంగా యుంటుందని తెలియజేశారు. అలాంటప్పుడు ఈ బిల్లు జీవితం 1958 సంవత్సరం సెప్టెంబరు వరకూ ఎందుకు పొడిగిస్తున్నారో దానికి explanation ఏమి చెప్పలేదు. అందువల్ల నేను ఒక amendment సూచించాను. 1956 వ సంవత్సరం సెప్టెంబరువరకూ ఈ బిల్లు జీవితం పొడిగిస్తే సరిపోతుంది. ఎందువల్లనంటే మనకు వేరేచట్టంరాబోతుంది కనుక అప్పుడు అన్ని విషయాలూ సమగ్రంగా చర్చించి ఒక నిర్ణయానికి రావడానికి అవకాశం ఉంటుంది. అందువల్ల నేను ఇచ్చిన సవరణ మంత్రిగారు ఆమోదిస్తారేమోనని ఆశిస్తున్నాను. ఇప్పుడున్నటువంటి Act పూర్తిగా defectsఏమీ లేకుండా ఉందా అంటే ఆ విధంగా లేదనిమాత్రం చెప్ప వలసిన అవసరం ఉంది. చాలా ఎక్కువ డిఫెక్ట్సు దీంట్లో వున్నట్లు అగపడుతోంది. అందువల్లనే దీనివల్లవచ్చే ప్రయోజనం యెక్కువమంది పొందలేకుండా పోతున్నారు. ఎక్కడ చూచినప్పటికీ అద్దెలు ఈబిల్లులో ఉన్న rules ప్రకారంకాకుండా అత్యధికంగా ప్రతివారూ చెల్లిస్తున్నారనే టటువంటి విషయం అద్దెకొంపలలో నివసించే వారందరికీ అనుభవమే. అలాంటప్పుడు ఈ Bill లో fundamental-గా యున్నటువంటి mistakes ఏమిటి? అసలు ఏ mistakes సవరిస్తే ఈ బిల్లు అద్దెకొంపలలో నివసించేవారికి ఉపయోగకరంగా ఉంటుందనే విషయం మనం బాగా ఆలోచించి ఈ బిల్లును recast చేయవలసిన అవసరంమాత్రం ఉన్నది. కొత్త బిల్లు తీసుకువస్తామని

చెబుతున్నారు. అందుకు ఉపయోగపడతాయని నాకు తోచిన కొన్ని సూచనలు నేను చేయదలచుకున్నాను. ఈ బిల్లులోని aims and objects ను గురించి కొన్ని విషయాలు చెప్పబడినవి. దానిలో ఇళ్లలోని accommodation position చాలా క్లిష్టంగాయున్నదనీ, అది ఏమాత్రం సరిపోవడం లేదనీ అంగీకరించారు. నిజమే. ఈ రోజున కేవలం మ్యునిసిపాలిటీలలో మాత్రమే కాదు. పంచాయితీ బోర్డులలో కూడా ఏ Planning Committee కి సంబంధించిన ఆఫీసో, ఏ electricity కి సంబంధించిన ఆఫీసో, మరి ఏ క్రొత్త ఆఫీసు వచ్చినప్పటికీనరే అక్కడ ఇళ్ల అద్దెలు పెరగడం చూస్తున్నాం. అలాంటప్పుడు ఇళ్ల అద్దెలు పెరగడం సర్వసామాన్యమైపోయింది. అందువల్ల ఈ ఆక్ట్‌ను పంచాయితీలకు కూడా extend చేయుటకు అవసరం ఉంటుందేమో? Major పంచాయితీలు, Minor పంచాయితీలు అనే distinction లేకుండా యీ act అన్నింటికీ automatic గా extend చేయవలసిన అవసరం ఉన్నది. ఈ రోజున ఇళ్లలోని accommodation position చాలా క్లిష్టంగా ఉన్నదనే విషయం అందరం గుర్తిస్తున్నాం. కారణం ఏమిటి అనే విషయంకూడా మనం ఆలోచించాలి. ఈ రోజున ప్రభుత్వఆఫీసుల సంఖ్య, ప్రభుత్వ ఉద్యోగుల సంఖ్య అన్నిచోట్ల పెరుగుతోంది, పెరగవలసిన అవసరంకూడా యున్నది. దాంట్లో అనుమానం లేదు. Office లు క్రొత్త క్రొత్తవివచ్చి offices ల సంఖ్య పెరుగుతూయున్నప్పుడు ఎంతకాలమూ private individuals కట్టే ఇళ్ళపై ఆధారపడడమా? లేకపోతే ప్రభుత్వం ఏదైనా పథకం వేసుకుని తన ఉద్యోగస్థులకు ఇళ్ళ వసతి కల్పించుటకు ఆలోచిస్తుందా? ఈ విషయంకూడా తెల్సుకోవాలి. పంచవర్ష ప్రణాళికలు, దశవర్ష ప్రణాళికలు వేసుకుంటున్నాం. కనీసం ఈ పంచవర్ష ప్రణాళికలో ఐనా పట్టణాలలో ఐనా మన ప్రభుత్వం ఉద్యోగస్థులకు ఇన్ని ఇళ్ళు కట్టించి ఈ housing విషయంలో వచ్చినటువంటి క్లిష్ట పరిస్థితిని తొలగించడానికి ఏమైనా చేస్తామా అనే విషయం మంత్రిగారు ఆలోచించి తెలియచేయవలసిన అవసరం మాత్రం ఉన్నది. ఈ Housing Scheme క్రింద డబ్బు ఖర్చు పెట్టేటప్పుడు ప్రభుత్వం తన ఉద్యోగస్థులకు houses provide చెయ్యడానికి ముందు ప్రయారిటీ ఇవ్వవలసిన అవసరం ఉన్నదని మాత్రం నేననుకుంటున్నాను. Municipal areas లో యున్నటువంటి మ్యునిసిపల్ ఉద్యోగస్థులున్నారు. వాళ్ళకుకూడా ఈ ఇళ్ళ సమస్యే వస్తోంది. ఏ ఉద్యోగి వచ్చినా వెంటనే ఇంటికోసం వెతుక్కోవడం జరుగుతోంది. Municipality లు, గవర్నమెంటు Industrial concerns వీరు తమ క్రింద పనిచేసే ఉద్యోగస్థులకు ఇళ్ళ సమస్య పరిష్కారం చేస్తే rents ఇంత ఎక్కువగా పెరగడం అనేది జరగదు. అందువల్ల దీన్ని గురించి శ్రద్ధ తీసుకోవలసిన అవసరం ఉన్నదని ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. మన Nation Building activities లో housing

scheme చాలా ప్రధానమైనటువంటి విషయం. పారిశ్రామికంగా వెనుకబడిన మన ఆంధ్ర దేశం వంటి ప్రాంతాలలో, పారిశ్రామికంగా అభివృద్ధి చేయడానికి కేంద్ర ప్రభుత్వం నిముషనిముషానికీ ఆటంకాలుకల్గిస్తూయున్న మన ఆంధ్ర దేశంలో ఇప్పుడు ఈ Housing Scheme ద్వారా ఐనాసరే కొంత కాకపోతే కొంత వఱకైనా artisans కు వాళ్ళకూ నిరుద్యోగ సమస్య పరిష్కారం చెయ్యడానికి వీలుంటుంది. ఇవన్నీ దృష్టిలో పెట్టుకున్నప్పుడు ఈ housing scheme యొక్క ప్రాధాన్యత ఎంతైనా యున్నది. ప్రభుత్వం తన ఉద్యోగస్థులకు ఇళ్ళ వసతి కల్గించడానికి వెంటనే పూనుకోవాలి.

MR. SPEAKER: You are going, I think, far beyond the scope of the Act.

SRI PILLALAMARRI VENKATESWARLU: I feel we are almost re-enacting the old Act.

MR. SPEAKER: But the Act has nothing to do with the officers.

SRI Pillalamarri VENKATESWARLU: As the Hon. Minister said that he is going to bring in a fresh legislation, I think it is necessary to dwell on officers.

అందువల్ల ఈ విషయం నేను ప్రభుత్వ దృష్టికి తీసుకువస్తున్నాను. అదే విధంగా పోలీసువారి విషయం తీసుకోండి జనరలుగా పోలీసువారికి ప్రభుత్వం ప్రత్యేక quarters కట్టాలని ఉన్నది. ఈ రోజు చాలా మ్యునిసిపల్ areas లో పోలీసువారికైనా పూర్తిగా ఇళ్ళ వసతి కలుగ చెయ్యలేక పోయింది. మన Budget చూచుకున్నప్పటికీ, Budget ఉపన్యాసాలు చూచుకున్నప్పటికీ, మంత్రిగారి statement చూసుకున్నప్పటికీ కనీసం lower categories of Governmental staff కైనాసరే ఇళ్ళ వసతి ఏర్పాటు చేయలేక పోతున్నారు. ఇది ప్రభుత్వ దృష్టిలోని లోటేమోనని నాకు అనిపిస్తోంది. గవర్నమెంటు తన ఉద్యోగస్థులకు housing facilities ఏర్పాటు చేయడానికి మొట్టమొదటి priority ఇవ్వవలసి యుంటుందనిమాత్రం నేను ప్రభుత్వదృష్టికి తీసుకువస్తున్నాను. పంచాయితీ areas లో high schools క్రొత్తగా పెడుతున్నారు. ఇవన్నీ వచ్చినప్పుడే development అనేది మనం చూస్తాం. వీటిని రైతులు వాళ్ళంతట వాళ్ళు కట్టలేని స్థితిలో

యున్నారనే విషయం మనకు తెలుసును. Fair rent fix చేసే విధానం చాలా లోప భూయిష్ఠంగా ఉన్నదనే విషయం మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. 1940 సంవత్సరమునకు పూర్వం కట్టిన ఇళ్ళకైతే $8\frac{1}{3}$% ఎక్కువ చేయడానికి వీలు కలిగించారు. 1945 ప్రాంతాల కట్టిన వాటికి 25% తరువాత 50% అని ఈవిధంగా కొన్ని తీసుకువచ్చారు.

మొత్తంమీద చూచుకొన్నట్లయితే, ఈరోజున ఒకయింటికి, ఇంకొక ఇంటికి వుండే అద్దెలవ్యత్యాసం ఎంతో అగుపడుతుంది. దానిని పోగొట్టవలసిన అవసరం ఎంతో ఉంది. ఈరోజున fair rent ఏలా fix చేస్తున్నాం, ఈనాడు గవర్నమెంటు Act లో fix చేసినట్లుగా, 25 రూపాయలు అద్దె చెల్లించేవాటికి $8\frac{1}{3}$%, 50 వరకు 12%, 50 రూపాయలకుపైగా చెల్లించేవాటికి 25% హెచ్చించవచ్చును. 1945 వ సంవత్సరం అనంతరం కట్టినవాటికి అయితే, 25, 37, 50 వరకు అవకాశం కల్పించబడ్డది. ఇవి అన్నీ చూస్తే ఈ basis correct కాదు అనేటువంటి అభిప్రాయం నాకు ఉంది. అందువల్ల 25 రూపాయలు సరిగా ఉన్నపుడు పెద్ద పెద్ద ఇండ్ల ఆసాములు వాండ్ల total rental value సంపాదించుచున్నారు. చిన్న చిన్న భాగములను 25 రూపాయలకు ఇచ్చివేయడం జరుగుతుంది. అద్దెద్వారా పెట్టుబడిలో ఎంత % వాండ్లకు వస్తుందనే విషయాలు అన్నీ కూడ లెక్కలోకి తీసుకోవచ్చును. ఇప్పుడు fair rent fix చేసేదానిలో ఇంటిచుట్టుప్రక్కల ఎంత చోటుఉందో దానిని దృష్టిలోకి తీసుకొనేటట్లు చూడవలెను. ఈరోజున అనేకమంది కేవలం ఇండ్లను అద్దెకుఇచ్చి తాము గుడిసెలుతీసుకొని, దానిలో జీవనం గడుపుతూవుండే కుటుంబాలు అనేకం ఉన్నాయి. దానిని మనము నిర్లక్ష్యం చేయడానికి వీలులేదు. వాండ్లవిషయంకూడ మనము గమనించవలసియున్నది. వాండ్లకు ఎంత per cent ఇస్తే జీవనము గడుపుటకు, కొంతకాకపోతే, కొంతైనా, వీలు అవుతుందో అది దృష్టిలోపెట్టుకొని ఆలోచించినపుడు మనము సమగ్రముగ పనిచేయగలము. లేకపోతే ఈ Act perfect గా ఉండదు. అదేవిధంగా non-residential buildings విషయంలోకూడచూడండి. బెజవాడలోని ఒకవిషయం మీ దృష్టికి తీసుకొని రాగలను. ఒక కొట్టుఉంది. దానికి యాభైరూపాయలు అద్దె. దానికి ఎదురుగా ఉండేదానికి 150 రూపాయలు వసూలుచేయడం జరుగుతున్నది. ఎందుకు ఇంతవ్యత్యాసం ఉందో, దానిని ప్రభుత్వం పరిశీలనచేయవలసిన అవసరం ఉంది. ఈ Act మామూలుగా అద్దె కొంపలలో ఉండేవాండ్లకు ఉపయోగకరముగ లేదని ఘంటాపథంగా చెప్పగలను. ఎంతచిన్న కొంప అయినాసరే,

Sri Pillalamarri Venkateswarlu] [22nd September 1955

ఎక్కువ అద్దెలు చెల్లించుకోవలసి ఉంది. అద్దెలు ఎక్కువచేయడానికి అవకాశాలు ఉన్నాయి. ఇండ్లనుంచి వెళ్ళిపొమ్మని చెప్పినపుడు, పోయి హెచ్చు అద్దెలు ఇచ్చుకోవలసిన పరిస్థితులు నేడుఉంది. అందువల్ల ఇవిఅన్నీ ఉన్నప్పుడు, ఎక్కువ మంది ప్రజానీకానికి వుపయోగపడేవిధముగా సవరించవలసిన అవసరం ఉంది. ఇది వ్యాపారస్థులకుమాత్రం ఎక్కువగా ఉపయోగపడుతుంది అని ఖచ్చితముగ చెప్పగలను. వాండ్లు ఎప్పుడో ఒకసారి అద్దెకు తీసుకొంటారు. ఎంతవ్యాపారం పెరిగినా, ఎంతలాభం వచ్చినా అద్దెమాత్రం యధాతధంగా ఉంటుంది. దానిలో ఇవ్వబడిన procedure అంతా వాండ్లకు ఎక్కువలాభకరంగా ఉందిగాని మామూలుగా వుండే ఇండ్లలో నివసించేవాండ్లకుమాత్రం కేవలం ఈ Act నిరుపయోగంగాఉంది. అంటే దానిలో ఆశ్చర్యపడవలసిన విషయం ఏమికూడాలేదు. తిరిగి ఈ Act ను వ్రాసేటప్పుడు, మళ్లి క్రొత్త Act తయారుచేసేటప్పుడు ముఖ్యమైన ఈవిషయాలు దృష్టిలోపెట్టుకొని ఈ Act ను సవరించవలసిన అవసరం ఉంది. 1939 లో ఈ Act వచ్చింది అని అనుకొంటాను. దానిని ఆధారం చేసుకొని ఈ Act తయారుచేశాము. దీనిని ఎవరికో ఏకోర్టుకో jurisdication ఇవ్వాలన్న సవరణమాత్రం తీసుకొనివస్తే ఆచట్టం correct గా ఉండదని తెలియచేయాల్సిన అవసరంవుంది. చట్టం తీసుకొనివచ్చినపుడు ఆంధ్రదేశంలో పరిస్థితులు ఏలా ఉన్నవి. housing problem ఎలాఉంది, దానిని దృష్టిలోపెట్టుకొని మేలు సమకూర్చవలసనే విషయాన్ని దృష్టిలో వుంచుకుని చట్టముచేసినపుడే అది సమగ్రంగా ఉంటుంది. కాని ప్రతిరోజూ amendments చేయడంవల్ల, నిరుపయోగంగా ఉండిపోవడం జరుగుతుంది అని మంత్రిగారి దృష్టికి నేను తీసుకొని వస్తున్నాను. అందువల్ల fair rent fix చేసేటప్పుడు కొన్ని ముఖ్యమైనవిషయాలు దృష్టిలో పెట్టుకొనిచేయవలెను. చిన్న చిన్న వాండ్లు కొన్నిచోట్ల ఉన్నారు. అద్దెమీదనే ఆధారపడి జీవించేవాండ్లు ఉన్నారు. వాండ్లవిషయంలో శ్రద్ధవహించి ఎక్కువఅద్దె తెచ్చుకొనే అవకాశం వచ్చేటట్లు చూడవలసిన అవసరం ఉంది. కొన్నిచోట్ల తక్కువ రెంటు ఉన్నపుడు ఈ Act ప్రకారం ఎక్కువ చేసుకోడానికి నిజంగా వీలులేదు. అలాంటి పేదవారు అనేకమంది ఉన్నారు. అలాంటివారికి business community దగ్గరనుంచి రాబట్టడానికి మనము వారికి సహాయపడేటట్లుగా, సవరించవలసిన అవసరం ఉంది. చిన్నచిన్న tenants ఉన్నారు. వాండ్లకుకూడా సదుపాయాలు కలిగించేటట్లుగా తక్కువ rent కు వచ్చేటట్లుగా మనం Act ను సవరించి అలాంటిసూత్రాలు క్రోడీకరించేందుకు departmental staff కు మనము మన policy ని తెలిపి నిర్ణయించినపుడే, departmental staff కూడా అట్లా ఆలోచిస్తుంది. లేకపోతే మీరు ఏదో చట్టం తయారుచేయండి, మేము

చూస్తామంటే వాండ్లు మామూలుగా 1939 వ చట్టాన్నో, ఇంకా దేనినో కాపీ కొట్టి మళ్లా యధాతధంగా పెట్టడం జరుగుతుంది. ఈనాడు ఉండే పరిస్థితులకు అనుగుణ్యంగా చట్టాన్ని తయారుచేయడం జరగలేదనే విషయాన్ని మాత్రం మంత్రిగారి దృష్టికి తీసుకొని వస్తున్నాను. తరువాత eviction of tenants అనే chapter కూడ మనం చూడవలెను. దానిలో ప్రత్యేకం మనకు బోధపడేది ఏమంటే దీనిలోని provisions circumvent చేసేందుకు ఒక నెలరోజులు దానిలో ఉండి ఇంట్లో కాపురం చేసేటట్టయితే, మళ్లీ కాళీచేసినా ఆ landlord ను ప్రభుత్వం ఏమి చేయదు. ఆ విధంగా అద్దె ఎక్కువ చేయడానికి అవకాశాలు ఉన్నాయి. అలాంటివి అన్నీ ఉన్నాయి. వాటికేమి మార్గం? అద్దె ఎక్కువచేయవలెననే ఉద్దేశంతో ఆ విధంగా చేస్తూ ఉండేటప్పుడు దానిని అంతా మనం ఈ Act లో prohibit చేయవలసిన అవసరం ఉంది. అది ఏ విధంగా చేయటం అనేది Act తయారు చేసేటప్పుడు సాకల్యంగా మనము ఆలోచించుకోనవలెనని నేను ప్రభుత్వ దృష్టిలోకి తీసుకొని వస్తున్నాను. మొత్తంమీద చూసుకొనే టట్లయితే, ఇప్పుడు ఉండే ఈచట్టం సమగ్రంగా లేదని, అది సరిపోదని, 1958 వరకు దానిని పొడుగించడం లేదు. 1956 September వరకు పొడుగించితే, ఈ లోపున మళ్లీ taxation measures కో, దేనికో, సమావేశం అవుతున్నాం. ఆ సమావేశంలో పూర్తిగా చర్చించి సమగ్రమమైన చట్టం తీసుకొనిరావడం జరుగుతుంది. దీనిని 1958 వరకు పొడుగిస్తే ఏదో ఒక చట్టం అచరణలో ఉంది కదా, ఇంకా మూడు సంవత్సరాలు మనకు time ఉంది. అని మంత్రివర్గం నిద్రపొయ్యేందుకుకూడా చాలా అవకాశాలున్నాయి. అందులో heavy pressure of work ఉన్నప్పుడు దీనిని వాయిదా వేయడంకూడా జరుగుతుంది. అందువల్ల అలాకాకుండా 1956 September వరకు దీని జీవితము పరిమితిచేసి, ఈ లోపున వెంటనే నేను చెప్పిన సూత్రములను దృష్టిలో పెట్టుకొని చట్టాన్ని తీసుకొని రావలెనని ప్రభుత్వ దృష్టికి తీసుకొని వస్తున్నాను. దీనినిచేసేటప్పుడు మాత్రం, ప్రధానంగా housing scheme పరిష్కారం చేయడానికి మంత్రివర్గం ఏదైనా plan పథకం ఈ పంచవర్ష ప్రణాళికక్రింద ప్రత్యేకంగా తయారుచేసి తమ ఉద్యోగస్థులకు ఇండ్లు వసతులను కలుగచేయవలసిన అవసరం ఉందని మనవిచేస్తున్నాను. తరువాత రెంట్లు చూస్తే చాలా disparity కనబడుతుంది. ప్రభుత్వ ఉద్యోగులకు ఎంత జీతం వచ్చినా సరే, 30, 40 రూపాయలు ఇంటి అద్దె pay చేస్తుంటే, ప్రక్కన ఉండేటటువంటివాడు, ఏవిధమైన జీతం లేకుండా బాధలుపడుతూ 60 రూపాయలు చెల్లించే సందర్భాలు ఉన్నాయి. అది ఇంకా తక్కువ area కే. అలాంటివాటిని తీసుకొని ఎందువల్ల

ఇంత ఎక్కువ అద్దె pay చేయవలెననే విషయాలను సమగ్రంగా పరిశీలన చేయవలసిన అవసరం ఉంది. ఇవి అన్ని చేసినప్పుడే మనము ప్రజలకు ఉపయోగపడే చట్టాన్ని తీసుకొని రాగలము. అప్పుడే మన housing సమస్యకూడ పరిష్కారం అవుతుంది. అందువల్ల నేను ఈ బిల్లు జీవితాన్ని extend చేయాలని అంగీకరిస్తున్నాను. కాని 1956 September వరకే దీని జీవితాన్ని పరిమితం చేయ్యాలని సూచిస్తున్నాను.

SRI P. NARASIMHAPPA RAO :—అధ్యక్షా! మంత్రిగారు ప్రవేశ పెట్టిన ఈ బిల్లును ఆమోదిస్తున్నాను. అయితే అందులో కొన్ని సవరణలు చేయవలె నని కోరుతున్నాను. దానికి కారణాలు చెప్పుతున్నాను. ఇప్పుడు ప్రతివారికికూడ ఇల్లు కట్టుకోడానికి చాలా భయోత్పాదంగా ఉన్నది. ఇల్లు కట్టిస్తే, గవర్నమెంటు తీసుకుంటారు, మళ్లీ మాకు రాదేమో, పెట్టిన సొమ్ముకు వడ్డీకూడ గిట్టదేమో ననే భయంతో ఇళ్లు కట్టకపోవడం జరుగుచున్నది. కనుక ఇళ్లు తీసుకోవడంలోను గవర్నమెంటు ఒక సమయము పెట్టుకోవలసి యుంటుంది. ఇప్పుడు కర్నూలులో చూడండి. సెక్రటరీలకు మంత్రులకు మొదలగువారికి ఇచ్చినటువంటి భవనములకంతా చాలా తక్కువ అద్దె ఇస్తున్నారని చెప్పుకొంటున్నారు. ఇదంతా, ప్రభుత్వము తమ Departments వేసిన అంచనాలమీద, P. W. D. వారువేసిన అంచనాలమీద base అవడమువల్లనే డబ్బవుండి ఇల్లు కట్టదలచుకొన్నవారుకూడా కట్టకుండా ఉన్నారని మనవి చేస్తున్నాను. P. W. D. వారు fix చేసిన ప్రకారం చూస్తే, దానిలో మూడు పూసాల అద్దె, మునిసిపాలిటీవారికి ఇవ్వవలసి ఉంటుంది. ప్రతిసంవత్సరం depreciation క్రింద కొంత పోతుంది. ఈ విధంగా పెట్టిన సొమ్ముకు 4½%కూడ గిట్టుబాటు కాకుండాపోతే, వారు ఇళ్లు ఎందుకు కడతారు? కనుక మీరు P.W.D.వారు మీడిపార్టుమెంటువారు fixచేసిన rent ఇస్తామంటే మట్టుకు డబ్బు ఉన్నవారుకూడ ఇళ్లు కట్టరు. ఈ policyని మీరు మార్చాలి. ముఖ్యంగా ఈవిషయం గురించి ఒక కమిటీనివేసి దీని valuation ఎంత దీనికి ఎంత డబ్బు పెడుతున్నారు, Municipality కి ఎంత పన్ను కడుతున్నారు, అనే విషయాలన్నీ సమగ్రంగా పరిశీలించి, ఆ valuation మీద అద్దె fix చేయవలసి ఉంటుంది. అంతేగాని, department వారు fix చేసినట్లు వేసినట్లయితే, డబ్బు ఉన్నవారుకూడ ఇళ్లు కట్టడం కష్టముగా ఉంటుంది. అందువల్ల ఈ బిల్లు పెట్టవలసిందనే మనవి చేస్తున్నాను.

రెండవది, ఇంకొక బిల్లుకూడ మీరు పెట్టుతున్నారు. ఇప్పుడు చాలమంది ఇళ్లు కట్టడానికి సిద్ధంగా ఉన్నారు. ప్రతి ఊరులోకూడా చాలామంది ఉన్నారు. గవర్నమెంటే ఇళ్లుకట్ట నక్కరలేదు. ప్రజలలోనే చాలామంది కట్టగలవారున్నారు.

22nd September 1955] [Sri P. Narasimhappa Rao

అయితే, గవర్నమెంటు ఇళ్లకు అద్దెలను హెచ్చుచేసి, ఆ విధంగా చూపించి నట్లయితే వారికి నాటిపైన పెట్టినసొమ్ముకు నష్టి గిట్టినట్లయితే, ప్రతివారు కట్టుతారు. అందుకు సిద్ధంగా ఉన్నారు. ఈ ఊరిలో ఒకచోట ఒకమేడ కడుతూ ఉంటే దానికి నోటీసు ఇచ్చారట. అంతటితో ఆయిల్లు కట్టడం ఆపివేశారని నిన్న నేచెప్పారు. ఇప్పుడు కర్నూలులో చాలా buildings కావలసి ఉన్నవి. అవన్నీ గవర్నమెంటు కట్టనవసరం లేకుండా, ప్రజలు కట్టినట్లయితే, వాటికి తగిన అద్దెలు వస్తుంది, డబ్బు వృధాగా నిలువచేసి ఏమిస్తాము, ఇళ్లు కట్టుదామనే ఉద్దేశ్యం వారిలో పుట్టేటట్లుగా దీనికిగాను మరొక కమిటీని వేసి ఇదంతా పరిశీలించేటట్లుగా చేయవలసిందిగా కోరు తున్నాను.

SRI FRAGADA KOTAIAH :—అధ్యక్షా! ఈ బిల్లుయొక్క జీవితాన్ని మరొక మూడు సంవత్సరాలు పొడిగించాలనే ప్రతిపాదనను నేను బలపరుస్తున్నాను. కాని ప్రస్తుతం ఈ బిల్లును అమలు పరచడంలో మాత్రం చాలా సాధక బాధకాలు ఏర్పడుతున్నాయి. ముఖ్యంగా, దేవాలయాలు, ఇతర ధర్మ సంస్థలు, ప్రత్యేకంగా వారి అవసరాలకు కావలసినటువంటి కొన్ని భవనాలు కట్టడం జరిగింది. వాటికి అద్దెకు ఇవ్వడం ద్వారా, ఏదైనా ఆదాయంవస్తే, దానితో ఆ దేవాలయాన్ని లేదా ఆ ధర్మ సంస్థ దానికి సంబంధించినటువంటి కార్యకలాపము నిర్వహించ బడుతున్నాయి. దేవాలయాలకు సంబంధించిన ధర్మ సంస్థలకు సంబంధించిన భవనాలు కూడ ఈ చట్టానికిలోబడి ఉండవలసిన అవసరం ఏర్పడింది. అయితే ప్రభుత్వము ఇష్టపడితే exemption ఇవ్వవచ్చు గనుక ఒకప్పుడు general exemption ఇవ్వడం, తరువాత రద్దు చేయడం జరిగింది. అలా జరగడంవల్ల, చట్టాన్ని ఆధారం చేసుకొని కొంతమంది తమ స్వంతప్రయోజనాలకోసం, ఈ ధర్మ సంస్థల తాలూకు భవ నాలను ఉపయోగించడం జరుగుతున్నది. వ్యక్తులయొక్క ప్రయోజనాలకోసం, ధర్మ సంస్థల భవనాలను లేదా వాటి లాభాన్ని బలిపెట్టడం మంచిదికాదనేది ప్రభుత్వము ప్రత్యేకంగా ఆలోచించవలసిన అవసరమున్నది. ఉదాహరణకు, ఒక మార్కెటు ఉన్నదనుకోండి. ఆ మార్కెటు ఏరియాలోనే దేవాలయాలు ఉంటాయి. అక్కడ నాలుగు కొట్లు కట్టినట్లయితే ఆదాయం వస్తుందని పూర్వీకులు ఆలోచించారు. ఆ నాలుగు కొట్లు Rent Control order కు లోబడినందువల్ల, ఇప్పుడు అద్దెల కున్న వారంతాకూడా fair rent కోసం విపరీతమైనటువంటి litigation లోకి వెళ్ళి దేవాలయాలకు రావలసినటువంటి ఆదాయాన్ని రాకుండాచేసి చాలా చిక్కులు పెడుతున్నారు. అందువల్ల దేవాలయాలకు సంబందించినటువంటి కార్యకలాపాలు కుంటుబడుతున్నాయి. పైగా, litigation కోసమై, డబ్బుకూడ దొంకని

పరిస్థితులు ఏర్పడుతున్నాయి. Act లో ప్రభుత్వము అధికారము పెట్టుకొనికూడా ఎందువల్ల general గా exemption చేసి మరల దానిని ఉపసంహరించుకోవడం జరిగిందో తెలియకుండా ఉన్నది. కనుక వెంటనే దేవాలయాలను 13 వ సెక్షను ప్రకారం exempt చేయడానికి ప్రభుత్వము పూనుకోవాలని నేను ప్రత్యేకంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

తరువాత అన్ని పంచాయతీలకు ఇది వర్తింప చేయాలని మన మిత్రులు వెంకటేశ్వర్లు చెప్పుతున్నారు. అది చాలా పొరబాటని మనవిచేస్తున్నాను. పంచాయితీలకు ఈ చట్టాన్ని వర్తింప చేయుడంవలన బస్తీలలో ఉన్నటువంటి యావత్తు litigitions కూడ మన గ్రామాలకు తెచ్చిపెట్టడం అవుతుంది. అసలు గ్రామాలలో ఉండే ఇళ్ళయొక్క స్వభావం ఎలా ఉంటుంది. అవి ఎంతవరకు అద్దెకు ఇవ్వడానికి యోగ్యంగా ఉంటాయి. ఒకవేళ ఇవ్వవలసివస్తే, ఎలాంటి వారికి ఇస్తుంటారు, అనే విషయాలు ఆలోచించవలసియున్నది. అదేదైనా, పరస్పర సహకారంతోటి సంప్రతింపులతోటి జరుగవలసినట్టి విధానాన్ని గ్రామాలకు పరిమితం చేయాలి. బస్తీలలోని విధానం లాగే, అవసరమైతే డిప్యూటీ కలెక్టరుకు ఒక పిటీషను పెట్టడము, లేక మరొకరికి పిటీషను పెట్టడం, బలవంతంగా ఇంట్లో చేరడం, చేరిన తరువాత, ఎన్ని సంవత్సరాలైనా లేవకుండా ఇల్లు సర్వనాశనం చేయడం, కాపురం ఉంటానని చెప్పి, అందులో లేనిపోని దుమారం లేవదీస్తున్నటువంటి పరిస్థితులుకూడా ఉన్నాయి. బస్తీలలో ఏమిజేసినప్పటికినీకూడ, వారు సర్దుకు పోగలరు గాని గ్రామాలలో చాలాకష్టంగా ఉంటుంది. అక్కడ చిన్నచిన్న ఇళ్లు వుంటాయి. అలా ఉన్నటువంటి వాటిలో లిటిగెంట్స్ అద్దెలకు వచ్చి చాలా చిక్కులు పెడుతున్నారు. అందువల్ల గ్రామాలకు సంబంధించినంతవరకు వాటికి general exemption ఇవ్వవలసిన అవసరమున్నదనేది ప్రభుత్వము చాలా జాగ్రత్తగా ఆలోచించవలసినటువంటి విషయమని నేను ప్రత్యేకంగా వారికి విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ రెండు విషయాలలో ప్రభుత్వము మరి ఒక సవరణ తెచ్చేటట్లు ఆలోచించినా, ఇప్పుడు దేవాదాయాలకు, ధర్మాదాయాలకు సంబంధించినటువంటి వాటిని Rent Control Act నుంచి, వెనువెంటనే తమ అధికారాన్ని పురస్కరించుకొని, తప్పించాలని ఈ సందర్భంలో నేను విజ్ఞప్తి చేస్తూ విరమిస్తున్నాను.

Sri T. V. RAGHAVULU :—అధ్యక్ష మహాశయా! ఈ బిల్లు యొక్క జీవితాన్ని మూడు సంవత్సరములు పొడిగించవలసిందిగా కోరేటటువంటి ప్రతిపాదనను నేను బలపరుస్తున్నాను. ఈ బిల్లు అమలుపర్చడంలో ఉన్నటువంటి ఒకటి, రెండు లోపాలుమాత్రము పేర్కొనడానికి ప్రయత్నం చేస్తున్నాను. ప్రతి

శాసనాన్ని చేసేది మానవమాత్రులే. అందుచేత శాసనాన్ని ఉల్లంఘించడానికి మనుష్యులకు అసాధ్యమని చెప్పడానికి వీలులేదు. ఈ బిల్లు rent ను control చేయడానికి ఉపకరిస్తుందనే ముఖ్యోద్దేశంతో చేయబడిన, ఈ rent control అనేది మాత్రము పెద్ద పెద్ద business కు తీసుకునేటటువంటి buildings విషయంలో పెద్దదిగా చేయడానికి మాత్రము ఉపయోగపడుతుంది. ఎందుచేతనంటే, పెద్దపెద్దవారు ఎక్కువ rent ను ఇచ్చుకుంటూ మునిసిపాలిటీలకు దగా చేయడానికని నామకార్థం వేరే rent deeds ను register చేస్తున్నారు. ముందుగానే డబ్బు వ్యవహారమంతా కూడ లెక్కవేసి deposit చేస్తున్నారు business వారు. House-owners తో collude అయి మునిసిపాలిటీవారిని దగాచేయడము, మునిసిపాలిటీకి రావలసినటువంటి రాబడిని రాకుండా చేయడము, జరుగుతున్నది. అయితే ఈ rent control విషయంలో పైకి ఉండేటటువంటి register అయినటువంటి rent deeds ఒక లాగునఉంటే, వ్యవహారమంతా మరొకలాగున జరుగుతూ ఉంటుంది. తరువాత fair rent ను నిర్ణయించడంలోకూడా, Engineers సలహామీద valuation కట్టాలని శాసనము చెబుతూ ఉన్నది. కాని అది చాలాభాగము జరగడం లేదు. అందుచేతనే కర్నూలులో జరిగేటటువంటి విషయం గురించి గౌరవసభ్యులు ప్రస్తావించడం జరిగిందేమో అనుకొంటాను.

తరువాత పంచాయితీలకు, గ్రామాలకుకూడ ఈ చట్టము వర్తింపచేయాలనేది మాత్రము సబబుగాదని, వాంఛనీయము గాదని కోటయ్యగారు చెప్పినటువంటి వాదనతో నేను పూర్తిగా ఏకీభవిస్తున్నాను. అందుచేతను ఈ శాసనము చేసేటప్పుడు, సమగ్రంగా మరొకసారి పర్యాలోచనచేయడం చాలా ఉత్తమం. అయితే దీని జీవితాన్ని పొడిగించేటటువంటి వ్యవధికూడ చాలా తక్కువగా ఉన్నది. కనుక ముఖ్యమంత్రి కోరినరీతిగా ఇప్పుడు దీని జీవితాన్ని పొడిగించవలసిందని కోరుతూ ఇంతటితో విరమిస్తున్నాను.

Sri D. KONDAIAH CHOWDARY:—అధ్యక్షా, ఈ Rent control Act ను అనుసరించి rent ను control చేసే సందర్భములో ప్రభుత్వమువారు ప్రతిపాదిస్తున్న యీ బిల్లును నేను సమర్థిస్తూ కొన్ని విషయాలు మాత్రమే ప్రభుత్వమువారి దృష్టికి తెస్తూ విరమించదలచాను. అవి యేమిటంటే, యిప్పుడు రాష్ట్రములో చాలామంది కొన్ని యిళ్లను Rent Control Act క్రింద ప్రభుత్వమువారిద్వారా తీసుకుంటున్నారు. కాని, వారు ఏ వుద్దేశ్యముతోనైతే ఆ యిళ్ళను తీసుకుంటున్నారో, ఆ వుద్దేశ్యముతో ఆ యిళ్ళను వుపయోగపరచకుండా, వారు యితరవిధములుగా వుప

యోగిస్తున్నారు. అట్టి సందర్భములలో వారిని ప్రభుత్వము యేమీచేయలేని పరిస్థితిలో వున్నది. ఇటువంటి పరిస్థితి గలది ఒకటి గుడివాడలో వున్నది. దాని విషయము మీకు తెలుసును. ఒక యిల్లు చిన్న చిన్న godown గా వుంటే, దానిని వేరువేరుగా మార్పుచేసి, యితర విధములుగా వుపయోగించుకుంటూ వున్నారు. ఆ విధంగా అధికలాభాలు సంపాదించుకోకుండా ప్రభుత్వము ఏదైనాచేస్తే బాగా వుంటుందేమోనని నా అభిప్రాయము. అందువల్ల అద్దెను తీసుకునేవారు ఏ వుద్దేశ్యముతోనైతే తీసుకుంటున్నారో, ఆ ఉద్దేశ్యమును మినహాయించి యితరత్రా వుపయోగించేటప్పుడు యీ యాక్టును అతనికి వర్తింపచేయకుండా వుండేటట్లు ప్రభుత్వము చేస్తే బాగుంటుందని ప్రభుత్వమువారికి సలహాయిస్తూ యింతటితో విరమిస్తున్నాను.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఈ Rent Control Bill రెండుభాగాలుగావున్నది. మొదటిది యిళ్లను లీజుకుతీసుకోవడము, రెండవది రెంటును కంట్రోలుచేయడము. ఇళ్లను లీజుకు తీసుకున్నప్పుడు ప్రధానంగా జరుగుతున్నది యేమిటో మనవిచేస్తున్నాను. రాష్ట్రములో ఇళ్లు ఖాళీగా వున్నప్పుడు, వాటిని ప్రభుత్వము ఎవరికైనా యివ్వాలనే వుద్దేశ్యముతో ముందుగా నోటిఫైచేసి, అవి ఫలానావారికి అని యిస్తున్నారు. ఆవిధంగా యిచ్చే పరిస్థితులలో దానిని యింకొకరికి sublet చేయకూడదు అని నిబంధనవున్నది. కాని వాస్తవముగా జరుగుతున్నది, ఆవిధంగా లేనేలేదు. ఒకయింటిని rent కు అని తీసుకొని sublet కూడా చేయడము జరుగుతున్నది. ఈవిషయము బయటికి తెలియనివ్వడము లేదు. పెద్ద పెద్దనోరుగలవారు ఒకేసారి అయిదారు యిళ్లు rentకు తనపేరుతో అర్జంటుపనికొరకు అనే సాకుతో తీసుకుంటున్నారు. అధికార్లనుకూడ గట్టుకొని ఆయిళ్లకు తాళమువేయిస్తారు. ఆవిధంగాచేసి, ఆయిళ్లను ఎక్కువ బాడుగలకు sublet చేస్తున్నారు. దానినుంచి ఆయనను కదిలించటానికి ఎవరికినీ వీలులేకుండా వున్నది. Sublet చేసినప్పుడు, ఆధనవంతుడు కోర్టుకుపోవటానికి వున్నదశను, sub-lease కు తీసుకున్న వానికి లేకుండావున్నది. ఎందుకంటే, వారుయిచ్చే అద్దె దానికే సరిపోతుంది. అది కోర్టులో రుజువుచేయటానికి వీలులేని పరిస్థితులు వుంటాయి. పైగా నోరుగలవాడు అద్దె యివ్వడముకూడా చాలా ఆలస్యముగా యిస్తాడు. అందువల్ల యీ Rent Control Act బాగా డబ్బుకలవాడికి, నోరుగలవాడికి ఉపయోగపడుతుందని అంటున్నాను. డబ్బు గలవాడైతే, యిల్లు స్వాధీనము చేసుకోటానికి ఉపయోగపడుతున్నది. తరువాత డబ్బుకలవారు తమయొక్క యిళ్లను, అద్దెకుయివ్వకుండా ఎగకొట్టటానికిగూడా ఉపయోగపడుతున్నది. ఎందుకంటే, అధికార్లను తమవైపుకు వశపరచుకొని వుంటాడు. ఇటువంటి పరిస్థితులు ఎన్నో

22nd September 1955] [Sri Vavilala Gopalakrishnayya

వుంటున్నవి. కాని నేను Rent Control Act వద్దు అని చెప్పడములేదు. Rent ను Control చేయవలసినది అవసరమే. కాని యీ యాక్టును సక్రమంగామాత్రము వినియోగపడేటట్టు చేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. ఆవిధంగా చేయటానికి యీబిల్లులో అవకాశములు చాలా తక్కువగా వున్నవి. కాబట్టి యిటువంటి యాక్టు సక్రమంగా వినియోగపడటానికి తగినవిధంగా మార్చేటంతవరకూ, యీబిల్లు ద్వారా time extend చేయడము న్యాయముకాదనే అభిప్రాయముతో నేను వున్నాను. అయితే యిప్పుడు యీ యాక్టును యీ విధంగా వదిలిపెట్టితే, vacume ఏర్పడుతుందని భయము కలగవచ్చు. రేపు యీ యాక్టును రద్దుచేస్తే, యిప్పటికి అద్దెకు తీసుకొనివున్నవారు చాలమంది వుంటున్నారుగనుక వారినందరినీ, రేపేవెళ్లి పొమ్మంటారనే పరిస్థితి ఏర్పడవచ్చు. కాబట్టి అటువంటి బిల్లును త్వరలో తీసుకొని రావలసిన అవసరము వున్నదని అంటున్నాను. ఈబిల్లు తెచ్చేటప్పుడు, అసలు యీ బిల్లును ఒక ordinance రూపములో తెచ్చి ప్యాసుచేశారు. ఇప్పుడు మనకు రాష్ట్రము కొత్తగా ఏర్పడ్డది. రాబోయే పరిస్థితులు చాలావున్నవి. ఇళ్లవిషయములో చాలా యిబ్బందులు కలగవచ్చు. రాష్ట్రము యేర్పడిన మొదటిరోజులలో యీ బిల్లును ordinance ద్వారా ప్రకటించి, తరువాత యాక్టుచేశారేగాని, మొదలు మొదలు, యీ యాక్టును సక్రమంగా అమలుజరపలేదు. ఇందులో ఏదో కొంచెము సందువున్నదని తెరువాత తరువాత తెలిసింది.

పోతే, రాష్ట్రములో కోఆపరేటివు సంస్థలద్వారా చాలానగరాలు ప్రారంభమవుతున్నాయి. అటువంటివి కట్టవలసినదే. దానికి నేను సంతోషిస్తున్నాను. అయితే యీ నగరాలలో యిళ్లు కట్టుకునేవారు ఎవరో గుర్తించాలి. ఒకవ్యక్తికి అదివరకు ఒక పెద్దయిల్లువుంటే, అదిచాలదని, దాన్ని ఏ ప్లీడరుపేరనో, లేకపోతే తనభార్యమరదిపేరనో అద్దెకు యిచ్చినట్లుగా పూర్వపుతేదీలో ఒకటి నిర్మాణముచేసి వేసి, యీ నగరములో కొత్తగాకట్టే యిళ్ళకోసము వస్తున్నాడు. అది తీసుకునేటప్పుడు అన్నీ book అయిపోయినవని చెబుతూవుంటాడు. అప్పుడు యితరులకు యిల్లుకావలసివస్తే, ఏయిల్లు అయినా ఒకరి స్వాధీనములోవుంటే, ఎవరైనా ఏమిచేయగలరు? అందువల్ల ఆయనను కదిలించటానికి వీలుండదు గనుక యిటువంటి పరిస్థితులు జరుగుచున్నవి. అందువల్ల యీ యాక్టు వున్నప్పటికినీ, యిది abuse కావడముతప్ప దీనివల్ల ప్రయోజనముయేమి కనబడడములేదు. దీన్ని అనేకవిధములుగా abuse చేస్తున్నారు. ప్రస్తుతపు యాక్టు నిరుపయోగముగా వున్నది. ఇటువంటివిధముగా యాక్టు abuse చేయబడకుండా ప్రభుత్వము అరికట్టించాలి. ప్రస్తుతము ప్రభుత్వము తెచ్చిన యీబిల్లుకూడా ఏమీ ప్రయోజనములేదు. ఇదిగూడ అప్రయోజనకరమే అవుతుంది.

Sri Vavilala Gopalakrishnayya] [22nd September 1955

తరువాత రాజధాని నగరములో యిళ్ళకు చాలాకొరత ఏర్పడివున్నది, నిజమే. ఇళ్ళకు కొరత కావటానికి కారణములువున్నవి. లేకపోలేదు. ఇందుకు రెండు కారణములు వున్నవి. అసలు యిళ్లు లేకపోవడము ఒకటి వుంటే అందులో ఏ వేరుశెనగ పోట్టుపోసి, యిళ్లు ఖాళీలేవు అని చెప్పడము ఒకటి జరుగుచున్నది. ఇప్పుడు గుంటూరు పట్టణము వుదహరణగా తీసుకుంటాము. అక్కడ గుంటూరు మునిసిపాలిటీవారు పట్టణములోపలవున్న పోగాకు godowns అన్నీ కూడ ఆరోగ్యమునకు భంగకరముగా వున్నందున పట్టణము బైటపెట్టుకోవలసిందిగా తీర్మానించారు. తీర్మానముమాత్రం చేసేరేగాని, దాన్ని అమలులోకి మాత్రము తీసుకొని రాలేకపోతున్నారు. ప్రభుత్వముకూడా యీ విషయములో జోక్యము పుచ్చుకొని సహాయ్యము చేయలేదు. ఇంతవరకూ ఆ godowns అన్నీ ప్రజలు కాపురములువున్న యిళ్ళకు ప్రక్కనే వుంటున్నవి. ఇప్పుడు హైకోర్టు ఏర్పాటు చేసినప్పటికినీకూడా ఆ godowns వున్న యిళ్లవిషయములో యేమీ కదిలించలేకుండా వున్నారు. ప్రభుత్వమువారిని యిళ్లకొరకు అడిగితే, యిళ్లు ఖాళీగా లేవు. ఇందులో యేవి యివ్వాలో అర్థము కావడము లేదని అంటున్నారు. ముఖ్యంగా ప్రజలయొక్క ఆరోగ్యము చూడాలి. ప్రభుత్వమువారు తెచ్చిన యీ బిల్లులో rent ను, lease ను control చేస్తున్నామని అంటున్నారు. బాగానే వుంది. అయితే యీ యిళ్ల ప్రక్కనవున్న మురుగు కాలవల సంగతి యేమిటి? దానికి Control యేమి ప్రవేశపెట్టడము లేదు. ఒక యింట్లో ఒక ఉద్యోగిని ప్రవేశపెట్టిన తరువాత, ఆయనయొక్క ఆరోగ్య విషయముగూడా చూడవలసిన బాధ్యత ప్రభుత్వము మీదనే వుంది. కాని అటువంటిది యేమీ కనబడదు. మునిసిపాలిటీవారు ఒక యింటికి ఒక latrine కట్టించినా సరే, ఆ latrine బాగు చేయకపోయినా సరే, అన్ని విషయాలలోనూ ప్రభుత్వమే ఎక్కువ శ్రద్ధవహించవలసిన బాధ్యత ప్రభుత్వం మీదనే వుంది. Rent Control Act క్రింద ప్రభుత్వమువారు వాసయోగ్యమైన యిల్లు ఒకటి యిస్తున్నప్పుడు, ఆయనకు అన్నివిధాలావాసయోగ్యమైన పరిస్థితులు అందులో వున్నవా లేదా అనేది చూడాలి గదా! అందువల్ల యీ బిల్లులో అటువంటి నిబంధనలు, నిర్బంధాలుకూడా కల్పించవలసిందిగా కోరుచున్నాను.

పంచాయితీల విషయము తీసుకుంటే, పంచాయితీలలో రెండు రకాలు వున్నవి. చిన్న చిన్న పంచాయితీ గ్రామాలకు యీ బిల్లు వర్తిస్తుందా అంటే, పంచాయితీ గ్రామాలు, అంటే ఒక వెయ్యి, రెండువేల జనాభాకు తక్కువగా వున్నవాటికి యీ బిల్లును వర్తించ చేయకూడదని నా అభిప్రాయము. అంతకు పైగా జనాభావున్న గ్రామాలకు వర్తింపచేయాలి. ఎందుకంటే ప్రభుత్వమువారు ఆ గ్రామాలలో

హైస్కూళ్లు పెట్టినట్లయితే, అక్కడికి రాబోయే టీచర్లకు యిళ్లు లభించడం లేదు గనుక ఈ విధంగా యిళ్లు సాధించే ప్రయత్నం వుండాలి. ఇల్లు అద్దెకుయిస్తే మరల వారికి రాదనే వుద్దేశ్యముతో, ఆ యిల్లు అద్దెకు యివ్వకుండా, ఏ వేరుశెనగ పోట్లో పోసి యిల్లు ఖాళీగాలేదని చెబుతారు. అటువంటి యిల్లు ఖాళీచేయించి యివ్వటానికి యీ బిల్లులో provision లేదు. అలాంటి provision కూడా వుండాల్సిన అవసరము వుంది. వేరుశెనగ పోట్లుపోసి, మా యిల్లు godown క్రింద వుందని సమాధానము యిస్తూ యిల్లు అద్దెకు యివ్వటానికి నిరాకరిస్తారు. అలాంటి పరిస్థితులలో ప్రభుత్వము High Schools ను గ్రామాలలో కట్టించినప్పుడు, teachers కు accommodation విషయము వచ్చేటప్పటికి, ఆయింట్లో వున్నది వేరుశెనగపోట్లో, మరియింకా ఏమైనా వున్నదో, నిజస్థితి విచారించి, ఆ యిల్లు అద్దెకుయిచ్చే యేర్పాటు చేయాలి. రెండవది స్కూళ్లకు కావలసిన buildings ఏవైనా వుంటే, అటువంటి యిల్లు కూడా స్వాధీనపరుచుకోటానికి యీ బిల్లులో ప్రధానంగా provision వుండాలి. ఇది ముఖ్యంగా ఆలోచించవలసిన విషయము.

MR. SPEAKER : There is separate Act for it. Let us confine ourselves to this Act.

Sri VAVILALA GOPALAKRISHNAYYA :—అద్దెల విషయమును గురించి మాట్లాడుతున్నాను.

MR. SPEAKER : That Act is not now under discussion before the House. You may remember, we passed another Act for the requisitioning of houses.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—Requisition ను గురించాండి? అసలు అద్దెను నిర్ణయించేటప్పుడు వచ్చే చిక్కు requisition చేసేటప్పుడే వస్తుంది. ఈ అద్దెలు నిర్ణయించే సందర్భములో కూడా ఒక ఉదహారణ చెబుతున్నాను. నాకు తెలిసిన సంగతే చెబుతున్నాను. ఒక ఆయనకు ఒక యింటికిగాను అద్దె ఇంతఅని నిర్ణయిస్తే, అది ఎక్కువఅద్దె అని, ఆయనకు అది యిష్టములేకపోతే, ఆయనకు యేమొఖ మాటస్థుడుగానో లేకపోతే, ఏ బంధువుడుగానోవుంటే, ఆ అద్దె ఎక్కువ అనే ఉద్దేశ్యముతో, ఆ విషయము P.W.D. వారికి refer చేయించి, పాతలెక్కలు చూపించి, అద్దె తక్కువ అయ్యేటట్లుగా చేయించుకుంటాడు. ఇటువంటివి జరగడము అన్యాయమని అంటున్నాను. పెద్ద ఇళ్లకు పెద్ద అద్దె, చిన్న ఇళ్లకు చిన్న అద్దె నిర్ణయించడము సమంజసముగాని, యీ విధంగా పెద్ద యిళ్లకు పాతలెక్కలు చూపించి అద్దెలు తక్కువ చేయించుకోవడము మంచిదేనా అని అడుగుచున్నాను. దీనిబట్టి యింతవరకు పెద్ద పెద్ద యిళ్లకు పెద్ద అద్దె కట్టడమనేది ఎగగొట్టడానికి యెత్తుగడలు సాగుతున్నవి. తరువాత చిన్నయిళ్లకు అద్దె పగ్గించడానికి వీలులేకుండా పోతున్నది.

Sri Vavilala Gopalakrishnayya] [22nd September 1955

అందువల్ల యింతవరకు జరిగే procedure ఏవిధంగాను చిన్న ఉద్యోగస్థులకుగాని, సామాన్యప్రజలకుగాని సహాయకరంగా లేదు. ఎవరైనా పెద్ద ఆఫీసరు వచ్చి అద్దెయిల్లు స్వాధీనపరచుకొని, అద్దె ఎక్కువగావేస్తే, దాన్ని తగ్గింపుచేయటానికి ప్రయత్నముచేసి, అద్దె తగ్గింపు చేయించుకుంటున్నవారికి అది ఉపయోగపడింది. అద్దె ఎగగొట్టడానికి వీలుగా వుంటున్నది. తరువాత మునిసిపాలిటీవారికి యివ్వవలసిన tax కూడా తగ్గిపోతున్నది. చిన్న యిళ్లలో వుండే వారికి అద్దె సౌకర్యాలు ఏ విధంగాను దొరకటములేదు.

తరువాత మన మిత్రుడు శ్రీ రాఘవులుగారు చెప్పినట్లు అద్దె నిర్ణయించేటప్పుడు అసలు ఎంతకు అద్దె యిచ్చారనేది దర్యాప్తిచేయవలసి వుంటుంది. లోపాయకారిగా 200 రూపాయలకు అద్దెకుయిచ్చి, యీ యాభై రూపాయలకు ఇచ్చినట్లుగా ఏర్పాటు పైకి కనబరుస్తారు. ఆవిధంగా చేస్తే, మునిసిపాలిటీలు కూడా నష్టపడవలసివస్తున్నది. కాబట్టి అద్దెకు ఎంతమటుకు ఖచ్చితముగా యిచ్చారో పూర్తిగా దర్యాప్తు చేయించి నిర్ణయించవలసి వుంటుంది. అద్దెకు వున్నవాడు తగాదా పెట్టుకొని ఎగగొట్టే టైము వచ్చేటప్పటికి యిల్లు కలిగిన స్వంతదారుడు నష్టపడుతాడేమోగాని, లేకపోతే, యింటి స్వంతదారుడు యీ విధంగా వుపయోగపడేటట్లు చూచుకుంటున్నాడు. ఇటువంటి పరిస్థితులు జరిగేటప్పుడు యీ Rent Control Act యొక్క ప్రయోజనము యేమి అయిందని అడుగుతున్నాను. కాబట్టి యిటువంటి అక్రమాలు జరుగకుండా ప్రభుత్వము చూడాలి. ఇటువంటివి జరగకుండా అన్ని విషయాలు ప్రభుత్వము పూర్తిగా ఆలోచించి, ఒక సమగ్రమైన Amending Bill ను తీసుకొని వస్తామని ప్రభుత్వమువారు అంటున్నారు గనుక అది యెంత త్వరలో తెస్తే అంత మంచిదని నా అభిప్రాయము. ప్రభుత్వమువారు అటువంటి బిల్లును త్వరలో తీసుకొని రావాలని కోరుతున్నాను.

12.30 p.m.

* SRI P. SUNDARAYYA :—అధ్యక్షా! ఈ Rent Control చట్టాన్ని మరొక మూడు యేండ్లు పొడిగించడానికి ఈ సవరణ చట్టాన్ని తెచ్చారు. మామూలుగా ప్రభుత్వానికి అలవాటు అయిన పద్ధతిగానే త్వరత్వరగా ఈ చట్టాలు ప్యాసుచేయించుకునే దాని కొరకు మాత్రం మంత్రిగారు చాలా క్లుప్తంగా 5 నిమిషాలలో దాని అవసరాన్ని గురించి చెప్పి దానిని పొడిగించాలని కోరారు. 5 నిమిషముల ఉపన్యాసమునకు 3 యేండ్లు పొడిగించడము న్యాయముకాదని నేను చెబుతున్నాను. దాదాపు ఇది ఆరు యేండ్లు అమలులో ఉన్నప్పుడు ఈ ఆరు యేండ్ల లోపల దానివల్ల కలిగిన ఉపయోగము ఏమిటి, అది ఎంతవరకు పనికి వచ్చినది.

ఇండ్ల సమస్యను ఈ rent control చట్టము ప్రకారము పెద్ద పెద్ద పట్టణాలలో అయినా సరే ఎంతవరకు పరిష్కారము చేయగలిగాము, చేయలేక పోతే ఇకముందు ఎటు వంటి సవరణలతో చట్టము తీసుకురాదలచుకున్నాము, అనే వాటిని-అన్నిటినీ గురించి చూచాయిగా ప్రభుత్వము తెలియజేసి, వాటన్నింటికి తగిన చట్టము తెస్తాము, ఈలోపల దానిని పొడిగించమనికోరినట్లయితే అది సవ్యముగా ఉంటుంది. అది ప్రజా తంత్రంగా ఉంటుంది. అంతేగాని, శాసనసభలో తమకు మెజారిటీ వున్నదిగదా అని మేము ఏమి చెప్పినాకూడా లక్ష్యపెట్టకుండా ఉండడం మంచిదికాదు. శాసన సభలో ముద్ర వేసేందుకు అనే కాకుండా నిజమైన శాసనసభా సాంప్రదాయాలను కూడా ప్రభుత్వం గుర్తించాలి. మంత్రిగారు అవేమీచేయక బిల్లు సెప్టెంబరు 30 వ తేదీలోపల ప్యాసు కావాలి, ఇక్కడ గవర్నరు అనుమతి, ప్రెసిడెంటు అనుమతికూడా Constitution ప్రకారము కావలసి ఉంటుంది, కాబట్టి దానిని తీసుకురావలసి వచ్చింది, అదిలేకపోతే ఏదో ఆకాశము అంతా విరిగి నెత్తిమీద పడబోతున్నట్లుగా ఇండ్లలో ఉన్న వారి నందరిని వెంటనే ఇండ్ల యజమానులు తొలగిస్తారు, అందువల్ల యీ బిల్లును తెచ్చాము. అని చెప్పారు. ఈ విషయంలో అద్దెలను ఎక్కువగా పెంచుతారు అని నాకు ఎటు వంటి భయములేదు. మనము చట్టమును ఒక రోజు ఆలస్యముగా చేసినవాళ్లు తొలగించే దానికి వీల్లేకుండా retrospective effect క్రింద ఎప్పుడుకూడా చట్టము తెచ్చే దానికి అవకాశము ఉన్నది. ఏ గృహ యజమానికూడ ఈరోజున ఇంట్లో ఉన్న వారిని వెంటనే తొలగించడానికి వీలులేదు. వారికి నోటీసులు ఇవ్వవలసి ఉంటుంది. ఈ చట్టము ఉన్నా లేక పోయినాకూడా మరుసటి రోజువచ్చి మెడబట్టుకొని ఇండ్ల లోనుంచి బయటకు గెంటే దానికి అవకాశము లేదు. అందుచేత ఏదో ఆకాశము విరిగి నెత్తిమీద పడ్డట్లు సెప్టెంబరు 30 వ తేదీలోపల దీనికి ప్రెసిడెంటుగారి అనుమతి రాక పోతే అవాంతర పరిస్థితి ఏర్పడుతోంది అన్న విషయము సరిగాదు. ప్రభుత్వము ఈ విషయము గురించి తీవ్రంగా ఆలోచించడములేదు. ఈ సమస్యను పరిష్కా రించేదాని కోసము ఏదో ఆలోచన చేయడంలేదు. ఒకవేళ కొంతచేసినా ఉద్యోగస్థులకు తక్కువ అద్దెలకు ఇండ్లను కొంతవరకైనా ఇప్పించే దానికోసము ఈచట్టాన్ని ఉపయోగించుకుంటోంది. తప్పితే ప్రజలందరికీకూడా న్యాయముగా ఇండ్లసౌకర్యములు కల్పించే విషయాన్ని మనస్సులో పెట్టుకొని చేస్తు న్నట్లు కల్పించడము లేదు. అధ్యక్షులవారు House Requisition Act వేరే వున్నది, దానినిగురించి చర్చవచ్చినప్పుడు ఈవిషయము మాట్లాడవచ్చును అన్నారు. కాని ఈ Rent Control Act లో Section 3 క్రింద ఏ ఇల్లు అయినాసరే 30 రూపాయిలు మించి అద్దెవస్తున్న ఇండ్లు అయినాసరే ఖాళీఅయినట్లయితే ఈ చట్టము వర్తించే పట్టణాలలో ఆ ఇంటియజమానులు ముందుప్రభుత్వమునకు తెలియజేయాలని,

Sri P. Sundarayya] [22nd September 1955

ప్రభుత్వము తన ప్రభుత్వోద్యోగస్థులకుగాని, ప్రభుత్వపనులకోసముగాని, ఇతర ప్రజోపయోగకరమైన పనులకుగాని ఆ ఇండ్లు కావాలి అన్నట్లయితే దానిని తీసుకో వచ్చునని, అది అవసరములేదు అని, దానినిగురించి సమాధానము ఒకవారను ఈరోజుల వరకు చెప్పకుండాయుంటే అప్పుడు ఆ ఇంటియజమాని తనంతటతాను ఇంకొకరికి ఇచ్చుకోవచ్చును అని చెప్పతోంది. ఏ ఇల్లు అయినా ఖాళీఅయినవెంటనే ప్రభుత్వము తీసుకోనేహక్కు దాంట్లో ఈ section క్రింద ఉన్నది. అందుచేత ఆసందర్భంలో ఈవిషయాన్నిగూర్చి ప్రస్తావించడము సరియైనదే. ఈప్రభుత్వోద్యోగస్థులకోఅను దానిని కొంతవరకైనా ఉపయోగించుకోనేదానికోసం చేస్తున్నదిగాని మిగతా ప్రజలకోసము ఈచట్టము ప్రవేశపెట్టబడలేదు. అయితే తరువాత వచ్చేటటువంటి క్లాజులో అద్దెకు ఉన్నటువంటి ఏవ్యక్తి అయినాసరే ఇంటియజమాని తనమీద ఎక్కువ అద్దెవేసినట్లు, దానిని తగ్గించమని కంట్రోలరుకు అప్లికేషను పెట్టుకుంటే, ఆయన విచారించి అద్దెతగ్గించేదానికి అవకాశము ఉన్నది. అంతవరకు ఈ చట్టం ఉపయోగముకాదా అని అంటారు. న్యాయమైన అద్దె ఏమిటో అది ఏంకంగా నిర్ణయించాలో చెప్పారు. కాని ఇది ఆచరణలో పూర్తిగా నిరుపయోగము అవుతోంది. కావలసిన ఇండ్లు లేనప్పుడు ఎవరో ఒకర్రు పేరాశతో, దురాశతో ఎక్కువఅద్దె అడిగినట్లయితే ముందు ఏదో ఒకరకంగా ఇల్లు సంపాదించుకుంటే తరువాత మనము అద్దె తగ్గించేదానికోసము వీలుంటుంది అని తాత్కాలికంగా ఇంటిలో ప్రవేశించవలసి వస్తోంది. కంట్రోలరు ఏమిచేసినా చేయకపోయినా అంతేకాకుండా తనకు ఇల్లు దొరకదు అనే భయంతో ఇవ్వాల్సినడబ్బు ముందుగానే ఒకసంవత్సరానికో రెండు సంవత్సరములకో, మూడుసంవత్సరములకో ముందుగానే అద్దె ఇవ్వవలసివస్తోంది. దానిని బొంబాయిలో పగిడి అంటారు. మన తెలుగుదేశంలో లంచములేక అడ్వాన్సు అంటారు. ఉత్తర హిందుస్థానములో సలామీ అంటారు. ఈ రకంగా ముందుగానే ఇచ్చుకోవడము జరుగుతోంది. అంటే Rent Control Act క్రింద న్యాయమైన అద్దెకు ఇల్లురావటములేదు. సరిగా ఆ ఇంటిని సంపాదించే దానికోసము ముందుగానే కొంతకాలమునకు అద్దె ఇచ్చుకో వలసివస్తోంది.. ఇండ్లకు అద్దెను నిర్ణయించడంలోకూడా అనేక అన్యాయాలు జరుగుతున్నాయి. ప్రభుత్వమువారు నిర్ణయించిన అద్దెలు గురించి తీసుకొందాము. ప్రభుత్వ departmentలు కట్టినటువంటి ఇండ్లు, వారు ఏ రేటుప్రకారం ఇస్తున్నది గమనించవలసి ఉంది. 1940 వ సం॥ లో ఏ అద్దెవున్నదో దానికి 100 కి 8 వంతులు, 12 వంతులు, ఈ రకంగా హెచ్చుచేయవచ్చును అని చెప్పి, షెడ్యూలు ఇచ్చారు తప్పితే న్యాయమైన పద్ధతిలో ఇది లేనేలేదని చెబు

తున్నారు. అంటే 1940 సంవత్సరమునకు ముందున్న అద్దెలు చాలా న్యాయమైన అద్దెలు ఉన్నట్లు, వాటిమీద 100 కి 10% 12 వంతులు పెంచితే సరిపోతుంది అనడం పొరబాటు అవుతోంది. ప్రతి ఇంటిమీద ఒకే రకమైన అద్దెవేయమని కాదు నేను చెబుతున్నది. పట్టణాల్లో పెద్దపెద్ద భవనములు వున్నవాళ్లు ఎక్కువ అద్దెలు పుచ్చుకుంటున్నారు. ఏమూలను, నాలుగు గదులుగల చిన్న ఇండ్లు పాత ఇండ్లు అయినప్పటికీకూడా ఇంకొక జీవనాధారము లేకుండా ఏదోరకంగా బ్రతుకవలసి వున్నది. భార్యాబిడ్డలను పోషించుకోవలసి వున్నది. కాబట్టి ఒక చిన్న గదిలో వుండి మిగిలినది ఇతరులకు అద్దెకు ఇచ్చుకుని వచ్చిన దానిలో జీవించే కుటుంబాలు చాలా ఉన్నాయి. ధనవంతులు పెద్దభవనము కట్టుకొని అందులో నివసిస్తూవుంటే, స్వంతదారుడు అందులో నివశిస్తున్నాడు. తక్కువ rental అనే పేరుతో value ను ఆధారం చేసుకొని Municipal Assessment తక్కువగా వుంటున్నది. ఆ భవనంయొక్క మొత్తము ఏరియా ఎంత ? ఏ పరిసరాలలో ఉన్నది ? ఎన్ని అంతస్తులభవనము, ఏ యే సౌకర్యాలు వున్నాయి, అనే విషయాలు విచారించకుండా పన్ను విధించడం జరుగుతున్నది. వాటినిబట్టి ఎన్ని కుటుంబాలో న్యాయముగా జీవించే దానికి వీలుంది అనే విషయాలు ఆలోచించాలి. ప్రజలకు కావలసిన ఇండ్ల వసతి మనము చూపించాలి. ఆవిధంగా చేయడంలేదు. సరిగదా పెద్దపెద్ద భవనాలలో విశాలమైన ప్రదేశాలలో నివశించే భాగ్యవంతులకు Municipal Tax తక్కువగా విధించడం మామూలైపోయింది. బీదవారు, మధ్యతరగతి ప్రజానీకము ఇంకా జీవితాధారము లేని కారణముచేత తన కుటుంబముతోకూడా ఎన్ని యిబ్బందు లున్నప్పటికీ ఒక గదిలోఉండి మిగిలినభాగము అద్దెకుఇచ్చి ఆ ఆదాయంతో జీవిస్తున్న పేదవారిమీద ఎక్కువ పన్ను వేయడము జరుగుతోంది. ఈ విధముగా చాలా అన్యాయాలు జరుగుతున్నాయి. ఈ పద్ధతి అంతాకూడా పూర్తిగా మార్పుచేయవలసి ఉంటుంది. కర్నూలు పట్టణమునకు రాజధాని రావడమువల్ల అనేక ఇళ్లు ప్రభుత్వము స్వాధీనము చేసుకుంది. కొన్ని సందర్భాలలో వాటిని స్వాధీనము చేసుకొని వాటికి వందలకొలది, వేలకొలది రూపాయలు ఖర్చుచేసి మరమ్మతులు చేసింది. వాటిని వసూలు చేసుకోలేని ఘటనలు ఒకప్రక్కన ఉన్నాయి. రెండవప్రక్కన ఒకే ఇల్లు గల యజమాని ఉన్నాడు. ఒక చిన్నగదిలో అందులో ఒకభాగాన్ని వంటగదిగా ఉపయోగించుకొనే దానికోసం ఏర్పాటుచేసి 30 రూపాయలుకు అద్దెకు ఇస్తున్నాడు. దానిప్రక్కనే ఇంకొక పెద్దభవనము ఉన్నది. దానిని ప్రభుత్వం requisition చేసి తన ఉద్యోగస్థునికి అంటే, ఒక Deputy Secretary గారికి యిచ్చిన యింటి విషయం నాకు తెలుసును. 40రు. కు అద్దెకు యిచ్చారు. ఈ పెద్ద యింటి ప్రక్కన వున్న చిన్నయింటికి యిచ్చే అద్దెనుబట్టి చూస్తే యీ ఇంటికి ప్రభుత్వమువారు......

THE HON. SRI B. GOPALA REDDI :—రు. 250 లు అద్దె యివ్వవలసి వుంటుంది.

Sri P. SUNDARAYYA :—కర్నూలు పట్టణంలోవున్న యింటి యజమానులు ఇంకా ఆ దశకు రాలేదనుకుంటాను.

Sri CHINNAMA REDDI :—ఒక సంవత్సరమా, మూడు సంవత్సరాలా అన్నవిషయానికి ఇది అంతా మాట్లాడడమువల్ల అసెంబ్లీ కాలము అంతా వృథా అవుతున్నది.

MR. SPEAKER :—క్లోజరు మోషను లేదు.

SRI P. SUNDARAYYA :—క్లోజరు మోషను లేదని కాదు. ఒక చట్టానికి మూడుయేండ్లు పొడిగిస్తున్నాము అన్నప్పుడు ఆ చట్టము మొత్తము మనము తీసుకొని enact చేస్తున్నాము అన్నమాట. మూడుయేండ్లదాకా ప్రభుత్వం ఈ చట్టాన్ని అమలుచేయవలసి వచ్చింది. అందుచేత ఇటువంటి బిల్లులు తెచ్చినప్పుడు పార్లమెంటరీ సాంప్రదాయము ప్రకారము మొత్తం Act కు సంబంధించిన విషయాలన్నిటినీ బాగా మాట్లాడేదానికి సభ్యులకు హక్కు వుంటుంది.

దాదాపు రు. 250 ల వరకు అద్దె ఇవ్వవలసిన ఇళ్లును తక్కువ అద్దెకు తీసుకుంటున్నారు. ఆ యజమానికి తక్కువ ఇస్తున్నారు అని నాకు విచారంలేదు. నేను ఈ విషయమై విచారించాను. యింటి యజమానికి ఇటువంటి ఇండ్లు 7, 8 ఉన్నాయి. పెద్ద ఇంటి యజమాని ఎంత తక్కువగా తీసుకున్నా అభ్యంతరము లేదు. మీ ఉద్యోగస్థునికి కావలసిన యింటిని రు. 90 లకు మాత్రమే తీసికొని, అంతటితో వదలి వేసారు. అతనికి ఎన్నెన్ని ఇండ్లున్నాయి, వాటిలో కాపురమున్నవారు ఎంతెంత అద్దెలు ఇస్తున్నారో చూసారా? మీకు మాత్రం రు. 90 ల అద్దెకు ఇస్తున్నారు; మిగిలిన పట్నంలోని పేదవారికి ఇండ్లు కావలసివస్తే విపరీతంగా గుంజుకుంటున్నారు. అప్లికేషను పెట్టుకుంటే ప్రభుత్వంవారు చూస్తాము అంటున్నారు. అప్లికేషను పెట్టుకుంటే ఇల్లే లేకుండా పోతోంది. మూడు సంవత్సరాలకు కావలసిన రు. 1000 లు ముందే కట్టవలసి వస్తుంది. ఎక్కువ మంది పేద ప్రజానీకానికీ, ఇండ్లు లేనివారికి ఉపయోగించే విధంగా Rent Control చట్టం తీసుకురావలసి ఉన్నది. రు. 30 ల లోపు అద్దె ఇచ్చేవారికి ఈ చట్టం వర్తించదని చెప్పారు. చిన్న ఇండ్లు ఉన్నవారికి మినహాయింపు చేయడం కొంతవరకు సహజమే. ఇదివరకు చాలాకాలం క్రితమే కర్నూలులోనూ ఇతర పట్టణాలలోనూ

బజారులో రు. 20, రు. 30 లకు అద్దెకు ఉన్న ఇండ్లు ఉన్నాయి. తరువాత కర్నూలు రాజధాని అయిన కారణంగా పెద్దది అయిపోయింది. ఈ చట్టం ప్రకారం అక్కడ వుంటే ఇండ్లకు తక్కువ అద్దె అద్దె పెంచడానికి వీలులేదు. పెద్ద వర్తకులుకూడా ఇదివరకు ఇచ్చే అద్దే ఇస్తున్నారు. ఇండ్లవాళ్లకు నష్టం వస్తోంది. మరొక పర్యాయం ప్రభుత్వానికి చెప్పే విషయం ఏమిటంటే ఈ Rent Control Bill ను సమగ్రంగా తీసుకురావలసియున్నది. కొద్దిపాటి ఇండ్లుకల వారికి, పేదవారికి వర్తింపకుండా చూడాలి. పేదతనం కుటుంబాన్ని బట్టి, ఆస్థిని బట్టి నిర్ణయించవలసి ఉన్నది. ఇక ఏ ఇతర జీవనాధారం లేనివారికి రు. 30 మాత్రమే కాదు, రు. 50 లు వరకు మినహాయింపు చేయవచ్చును. ధనవంతులకు ఒక రూలు, పేదలకు ఒక రూలు ఉండాలి. ధనవంతుల మీద ఎక్కువ పడేట్లు చిన్నవాళ్లకు వారి కుటుంబపోషణకు సరిపోయేట్లు - రెండింటిని సమన్వయ పరచినపుడే ప్రజలకు ఒకేరీతిగా ఇండ్లు లభించేటట్లు సౌకర్యం కలిగించడానికి వీలు ఏర్పడుతుంది. పూర్తిగా ఇండ్ల సౌకర్యం కలిగించాలంటే కేవలం అద్దె కంట్రోలు మాత్రమే చాలదు. దానికి ఎక్కువ ఇండ్లు కావాలి. ఈ చట్టం ప్రతి గ్రామానికి వర్తించాలని మా ఉద్దేశం కాదు. ముందు పట్టణాలకే వర్తింపచేయాలి. మరీ అవసరమయితే మేజరు పంచాయితీలలో వర్తింపచేయవచ్చును. ప్రతి పంచాయితీకి ఇండ్ల అద్దె కంట్రోలు వర్తింపు చేయాలని మా ఉద్దేశంకాదు. ఈ సూత్రాలనుబట్టి చట్టాన్ని తీసుకురావలసియున్నది. ఈనాడు అద్దె కంట్రోలు చట్టాన్ని ఇదేరకంగా కొనసాగిస్తే ధనవంతులు ఇండ్లు కట్టరు. కొన్ని మునిసిపాలిటీలలో రెండు నెలలకు, కొన్ని మునిసిపాలిటీలలో మూడు నెలలకు అద్దె తీసుకుంటారు. మరమ్మతుల క్రింద కొంత ఖర్చు అవుతుంది. 4%, 5% వడ్డీకూడా గిట్టుబాటు కాదు కాబట్టి ఈ చట్టం ఉంటే క్రొత్త ఇండ్లు ఎవరూ కట్టరు. దీనిమీద పెట్టుబడి ఎవరూ పెట్టరు, అని ఒక వాదం తీసుకువస్తున్నారు. ఇది మామూలు వాదమే. ధనవంతులు, ఆ ఎక్కువ ఆదాయం వచ్చేవారిమీద ఎక్కువగా పన్నులు వేస్తే initiative తగ్గిపోతుంది. చొరవపోతుంది. పరిశ్రమల్లో పనిచేయరు. ఇండ్లు కట్టరు. ఏమిచేయగు అని ఈ వాదం. కట్టక ఏమి చేస్తారు? డబ్బును మూల పెట్టుకొని కూర్చుంటారా? దానికి వేరే చట్టం తీసుకురండి. డబ్బు ఖర్చు చేయకుండా ఇంట్లో పెట్టుకున్న వారి డబ్బును వడ్డీ లేకుండానే ప్రభుత్వం తీసుకుని ఇండ్లు కట్టిస్తుంది ఫాక్టరీలు పెట్టిస్తుందనే చట్టం తీసుకురావాలి. ధనవంతులు మనమీద దయతలచి ఇండ్లు కట్టడం మానరు. ధనవంతులు న్యాయమైన అద్దెతో బ్రతకాలంటే ఇండ్లు కట్టరని అందుచేత ఈ చట్టాన్ని రద్దు చేయాలని అంటే మేము

పూర్తిగా వ్యతిరేకిస్తున్నాను. ప్రభుత్వంవారు మాటల్లో అంగీకరించకపోయినా ఆచరణలో మాత్రం నిరుపయోగమైన అద్దె కంట్రోలు చట్టాలు పెట్టుకుని ధనవంతులకే ఉపయోగం చేస్తోంది. మంత్రిగారు గత సంవత్సరం 2700 అప్లికేషనులు వచ్చాయని అందులో 1640 dispose of చేసామని చెప్పారు. ఆంధ్ర రాష్ట్రంలో 50 వేల జనాభా ఉండే పట్టణాలు 37 కు పైగా ఉన్నాయి. వీటిలో దాదాపు సగం జనాభా అద్దె ఇండ్లలో ఉంటున్నారు. వీరంవరూ న్యాయమైన అద్దెలోనే ఉన్నారనడానికి లేదు. అప్లికేషనులు పెట్టుకొంటే చూస్తాము అంటున్నారు. దానికి ఉండే ఇబ్బందులు తెలియచేసాను. ప్రభుత్వం తన కర్తవ్యం నెరవేర్చ దలచుకుంటే, అద్దెకు ఉన్నారు ఎంత అద్దెఇస్తున్నారో తెలుసుకొని నేను చెప్పిన ప్రకారం పేదలకు ఇచ్చే అద్దె హెచ్చించి, ధనవంతులకు ఇచ్చే అద్దె తగ్గించాలి. వచ్చిన అప్లికేషన్లలోనే ఇంకా 1100 అప్లికేషన్లపై తీర్పు చెప్పవలసి యున్నది. ఇంత అసంతృప్తికరంగా ఉన్నదీ చట్టం. ఏమీలేనిదానికంటే, గుడ్డిలో మెల్లగా దానిని కొనసాగించాలంటే మంత్రిగారు ఒక ఓదార్పు చెప్పారు. 30 వ తారీఖు లోపుగా జరపాలికదా pass చేయండి. తరువాత సమగ్రమైన చట్టం—రెండు మూడు నెలల్లో తీసుకువస్తాము అంటున్నారు. నిజంగా సమగ్రమైన చట్టమే తీసుక వస్తారేమో అనుకున్నాను. ఢిల్లీ ప్రభుత్వమునుంచి కంట్రోలరు దగ్గరనుంచి కొన్ని సూచనలు వచ్చాయట. కంట్రోలరుగా ఉండే ఆయన డెప్యూటీ కలెక్టరుగా ఉండవలెనా, లేక District Munsiff గా ఉండవలెనా—ఇది ఒక పెద్ద సవరణ. గవర్నమెంటు purposes కోసమా, లేక ఇతర purposes కోసమా అనేది మరొక పెద్ద సవరణ. వీరు తేబోయే చట్టం ఏమిటంటే పెద్దమార్పులు లేకుండా డెప్యూటీ కలెక్టరు బదులు District Munsif. ఇటువంటి మార్పులు తప్ప నిజమైన ఉపయోగకరమైన మార్పులు ఉన్న చట్టం తీసుకరారన్న మాట. ఆ ఉద్దేశం ఉన్నది కొబట్టే మూడు సంవత్సరాలు లోపుగా ఇంతకన్న ఎక్కువ మార్పులు చేయవలసిన అవసరం లేదు; చిన్న చిక్కులకు సంబంధించిన చట్టం మాత్రమే మేము తీసుకువస్తాము అని చెబుతున్నారు. ఇది ఏ రీతిగాను న్యాయము కాదు. ఈ చట్టాన్ని సమగ్రమైన చట్టంగా తీసుకురావలసి ఉంటుంది. ఎక్కువమందికి ఉపయోగకరంగా ఉండేటట్లు తీసుకురావాలి. ధనవంతులు ఇండ్లు నివసించకుండా ఉన్న ఇండ్లు తక్కువ అద్దెకు ఇప్పించేటట్లు చట్టం తీసుకురావాలి. ఇది మునిసిపాలిటీవారు fixచేసే rental valuesమీద ఆధారపడి ఉండరాదు. ఈ విషయంలో శాసనసభలో ఒక తీర్మానం pass చేసాము. ఏ సంవత్సరానికైనా assignment చేసేవాళ్లు లెక్కలు తనిఖీచేయవచ్చును. అద్దెను పెంచవచ్చును. గుంటూరులో ఇటువంటి ఇండ్లు

పదివేలు ఉన్నాయని చిన్నపేపరులో చదివినాను. Revise చేస్తే 9000 revision applications వచ్చాయట. వీటిని గురించి మునిసిపల్ కమిషనర్ విచారిస్తున్నారు. ఇండ్లు అద్దెకు ఇచ్చారా, స్వంతంగా ఉపయోగించుకుంటున్నారా అనే ఒకేప్రశ్నవేసి నిర్ణయిస్తారట. విస్తీర్ణాన్నిబట్టి సౌకర్యములనుబట్టి అద్దెలువేసే పద్ధతి తీసుకొని రావలెను. సమగ్రమైన చట్టము తీసుకొనిరావలెను. దీనికి ఎక్కువ కాలం పడుతుంది. అందుచేత మూడు సంవత్సరాలదాకా గడువు ఇవ్వమంటున్నారు సమగ్రమైన చట్టము ఒక సంవత్సరములో తీసుకురావచ్చును. అందువల్ల ఏ పరిస్థితులలోను దీనికి మూడు ఏండ్లు అవసరంలేదు. ఒక సంవత్సరం కన్న గడువు అనవసరం. చట్టము ప్యాసుచేసి అందరికి ఉపయోగకరముగా రెంటు కంట్రోలు చట్టము అమలు జరుపవచ్చును.

THE HON SRI B. GOPALA REDDI:—అధ్యక్షా, చాలామంది చాలా ఉపయోగకరమైన సలహాలు ఇచ్చారు. చాలా సంతోషము. వారి వారి దృక్పథాలను అనుసరించికూడా కొన్ని కొన్ని సవరణలు చేసినారు. ప్రతిపక్షనాయకులు రెండు కంట్రోలుచట్టములు — ధనవంతులకు ఒకరకమైనది, బీదలకు ఇంకొకరకమైనది కావాలన్నారు. కాని ఆ విధముగా చెయ్యడానికి సంసిద్ధముగా లేము. అది చట్టానికి విరుద్ధము. ధనవంతుల ఇండ్లు కావలెనంటే వేరే చట్టముక్రింద స్వాధీనము చేసుకోవచ్చు. విస్తీర్ణాన్ని బట్టి అద్దె నిర్ణయించాలి. భాగ్యవంతుల యిండ్లకు 30 రూపాయలు చొప్పున పేదవారి ఇండ్లకు 70 రు.ల చొప్పున ఇస్తామని చెప్పడం మంచిది కాదు. దేవస్థానాల ఇండ్లవిషయం ప్రగడ కోటయ్యగారు చెప్పినారు. అది ఆలోచించవలసిన విషయమే. తరువాత యీ Rent Control Act అన్ని పంచాయితీలకు వర్తించవలెనా లేక కొన్నికొన్ని చిన్నపట్టణాలలో మాత్రమే అమలులో ఉండవలెనా అనేవి ఒకటివున్నది. ఈ చట్టము శీఘ్రముగా రద్దు అయితే మంచిద నేవారు ఉన్నారు. అన్ని కంట్రోల్సు అమలు పెట్టవలెనని చెప్పేవారు కొందరు ఉన్నారు. ఇప్పుడు ఉన్న పరిస్థితులనుబట్టి డిమాండులనుబట్టి వదలడం మంచిది కాని డిప్యూటీ కలెక్టర్లకు, తాశీల్దార్లకు enormous powers ఇవ్వడం మంచిదికాద నేవారు కొంతమంది ఉన్నారు. గృహనిర్మాణ పథకములు వేయలేదని ఏదో చేస్తున్నారు ప్రభుత్వంవారు శ్రద్ధవహించడము లేదు అని శ్రీ వెంకటేశ్వర్లుగారు చెప్పారు. వచ్చే రెండవ పంచవర్ష ప్రణాళికలో industrial labour కు కాని Co-operative Housing Society లకు కాని ఎక్కువ ప్రోత్సాహము ఇవ్వవలెనని ప్రభుత్వం ప్రయత్నం చేస్తున్నారు. కేంద్రప్రభుత్వంవారు ఇస్తున్న సహాయం పూర్తిగాపొందడానికి ఢిల్లీలో industrial labour housing విషయమై సంప్రతింపులు జరిగాయి. Industrial labour housing కుగాను బెజవాడలో 300 ఇండ్లకు అప్పు అడగడం తటస్థించింది. ఈ మాదిరిగా co-operative scheme క్రింద ఇండ్లుకట్ట

Sri B. Gopala Reddi] [22nd September 1955

డముకూడా అవసరం. ప్రభుత్వమే వారి సిబ్బందికి ఇండ్లు కట్టడం అంటే అది జరిగేది కాదు. కొన్నికోట్ల రూపాయిలు అవుతుంది. చాలా ద్రవ్యము కావలసి ఉంటుంది. అదే మనకులేదు. ద్రవ్యంలేనిదే ఆకాశంలో సాముచేసినట్లు ఉంటుంది. గుమస్తాలకు ఇండ్లుఉంటే బాగానే ఉంటుంది. లేనప్పుడు అద్దె ఇండ్లతో సంతుష్టి పడాలి. ఇక పోలీసులవిషయమై వెంకటేశ్వర్లుగారు చెప్పారు. ఈ విషయంలో ఢిల్లీప్రభుత్వంవారుకూడా సమావేశము జరిపారు. పోలీసువారికి గృహనిర్మాణము విషయములో ప్రభుత్వంవారు శ్రద్ధవహించి 5 సంవత్సరాలలో ఎక్కువ ఇండ్లు కట్టవలెనన్న ప్రయత్నము జరుగుతున్నది. రెండు పక్షాలువారు చెప్పేరు. ఎక్కువగా sub-letting జరుగుతూ ఉన్నవని, ఇంకోవైపు land-lords ఇండ్లను ఆరోగ్య పరిస్థితులతో ఉంచడంలేదని అన్నారు. అనేక రకాలైన ఇబ్బందులు ఉన్నవి. ఒక సారే మనుష్యుల దౌర్బల్యం నివారణ అవుతుందనే ఆశ ఏమీలేదు. ఎవరికి కావలసిన లాభాలను వారు తీసుకొనే ప్రయత్నాలు జరుగుతున్నవి. రెంటు కంట్రోలు ఆక్టువల్ల సంఘను పునర్నిర్మాణము చెయ్యడంకాదు. మానవత్వం పునర్నిర్మాణం అగుతుందని కాని ప్రభుత్వంవారు ఆశించడములేదు. ప్రస్తుతము మూడు సంవత్సరాలు ఇవ్వండి తరువాత మీరుచెప్పిన సవరణలు అన్నికూడా త్వరలోనే చట్టంగా చేస్తాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—మూడు సంవత్సరాలు ఎందుకో explain చేస్తారా ?

THE HON. SRI B. GOPALA REDDI :—పదే పదే అసెంబ్లీసభ్యులు రాకుండా సవరణలు వస్తున్నాయి వాటిని ఆలోచిస్తామని చెబుతున్నారు. మీరుకూడా సవరణలు పంపవచ్చును. మీరు non-official resolution పెట్టవచ్చును. కాలహరణము చేసికొనడము మంచిదికాదు. పదే పదే ప్రెసిడెంటుదగ్గరకు పోకుండా వుండుటకుగాను ఈ 3 సంవత్సరాలు కావాలన్నాము. కొందరు land lord కు సానుభూతిగా ఉండవచ్చును. కొందరు tenants మీద సానుభూతిగా ఉండవచ్చును. అనేకమైన విభిన్నమైన దృక్పథాలు ఉన్నవి. వాటి నన్నింటిని ఆలోచించి త్వరలో చిక్కులులేకుండా ఉండడానికి ప్రయత్నం చేస్తాము. ఇప్పుడు ఈ చట్టము ఆమోదించాలని ప్రార్థిస్తున్నాను.

MR. SPEAKER : The question is :—

"that the Madras Buildings (Lease and Rent Control) Andhra Amendment Bill, 1955 be taken into consideration."

The motion was carried.

## CLAUSE 2.

MR. SPEAKER: Sri Vavilala Gopalakrishnayya will move his amendment.

SRI VAVILALA GOPALAKRISHNAYYA: Sir, I move—

"Substitute '30th September 1957' for 30th September 1958"

నేను మాట్లాడుతున్నప్పుడు ఇందాక టైముసంగతి ఏమీ చెప్పలేదు. రెండు సంవత్సరాలకు ఒప్పుకుంటారేమోనని. చీఫ్ మినిస్టరుగారిని అడుగుతున్నాను. అధ్యక్షా, దీనిలో ఉద్దేశ్యము ఏమిటంటే వారు బిల్లు తెస్తాము అంటున్నారు. రెండు సంవత్సరాలు ఇవ్వడము జరిగింది. బిల్లు తేవడం లేదంటే వేరే విషయము. తెస్తాము అన్నతరువాత గవర్నరువద్దకు, రాష్ట్రపతివద్దకు పోవలెనన్నారు. కావలెనంటె రెండుసంవత్సరాలు ఇచ్చినాము.

MR. SPEAKER: It does not mean that they want to extend the Act by 3 years. They may bring in an amending Bill to-morrow or day after.

SRI VAVILALA GOPALAKRISHNAYYA:—పాలిసీ ఏమో అడుగుతున్నాను. House వద్దకురాకుండా ఉండాలనే అభిప్రాయముతో వారు ఉన్నారనుకోవచ్చును. టైము కావలెనని అంటున్నారు. వారు రెండు సంవత్సరాలకు ఒప్పుకుంటారని ఆశిస్తున్నాను.

SRI S. VEMAYYA: I second the amendment.

MR. SPEAKER: Amendment moved:—

"*Substitute* '30th September, 1957' *for* '30th September 1958'."

THE HON. SRI B. GOPALA REDDI: Sir, I oppose the amendment.

1 p. m.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా, పాపము వావిలాలవారు 1957 వరకు అన్నారు. గాని ఆమాత్రము న్యాయము కూడా ముఖ్యమంత్రి గారు కలుగచేసినట్లులేదు. ఆయన మూడుసంవత్సరాలు అడిగి నారు. 1949 నుండి 55 వరకు extend చేస్తునేఉన్నాము. పెర్మనెంటు శాసనంచేస్తే బాగుంటుంది. Statute Book లో పెడితే బాగుంటుంది. మూడు సంవత్సరాలు అడగడానికి basis అగపడలేదు. ఈ రెండు కారణాలుతప్ప ఏమైనా prestige అడ్డమువస్తుందా అని అనుకుంటున్నాను. Compromising attitude లేనట్లు అగుపడుతూ ఉంది. మద్రాసులో ఉన్నప్పుడు రాజగోపాలాచారిగారు తేలికగా compromise చేసేవారు. వారివద్ద శిష్యరికంపొందిన మన ముఖ్యమంత్రి గారు అలా చెయ్యకూడదా. నేను ఇప్పుడు ఈ అమెండుమెంటులో 1956 వరకు చేస్తే బాగుంటుందని అనుకుంటున్నాను. సంవత్సరములో బిల్లు తీసుకొనిరావచ్చును లేకపోతే Permanent legislation చెయ్యవచ్చును. గాని ఈవిధముగా 1949లో చేసిన ఆక్టును extend చెయ్యడములో అర్థములేదు. I don't find any meaning in it. అవసరము అయితే permanent legislation అయినా చెయ్యవలెను. మూడు సంవత్సరాలు ఏమిటి ? Why not five years or 100 years. 100 years వరకూ కావాలి అని చెప్పవచ్చు. ఎందుకు మూడుసంవత్సరాలు. మీకు permanent legislation ఆలోచించుటకు డానికి మూడుసంవత్సరాలు కావాలా ఒక సంవత్సరం time చాలదా ? సంవత్సరంకాకపోతే పోనీ సంవత్సరం ఆరునెలలు అంటే December వరకూ accept చెయ్యండి. కేవలం majority ఉన్నదికదా అని మాట్లాడుతున్నారు గాని, లేకపోతే దీనికి ఒక scientific basis కాని, ఆలోచనగాని ఏమీ కనిపించడంలేదు. నేను మీద్వారా కూడా appeal చేస్తున్నాను. Being a lawyer you know it better.

MR. SPEAKER :—I cannot help it.

Sri PILLALAMARRI VENKATESWARLU :—Of course you too are in such a position. మీకుకూడా విజ్ఞప్తిచేస్తున్నాను. ఇవన్నీ తేలికగా adjust చేసి త్వరగా ఒక legislation కావాలి. ప్రస్తుతంఉన్నది అసమగ్రంగాయున్నది. ఇది పనికిరాదనే విషయాన్ని అంతా accept చేస్తున్నాం. Why not we bring a legislation within

year so that we can have a better piece of legislation ? అది చెయ్యకుండా ఇల్లా extend చేయడం అనేది ఏమీ బాగా లేదని మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. నా amendment accept చెయ్యడం ఉచితమని మంత్రిగారికి తెలియజేస్తున్నాను. కొండంటూరా, గోపాలకృష్ణయ్యగారు రెండు సంవత్సరాలని amendment ఇచ్చారు. పోనీ అది accept చేసినా సంతోషిస్తాం. కాబట్టి ఏదో ఒకటి accept చేయవలసినదని కోరుచున్నాను.

THE HON. SRI B. GOPALA REDDI :—అధ్యక్షా ! నేను తేబోయేటటువంటి సవరణకున్నూ, ఈ కాలపరిమితికీ ఏమీ సంబంధం లేదు. ఇప్పుడు పెట్టిన కాలపరిమితి మూడు సంవత్సరములలోపల ఆంధ్రదేశంలో క్రొత్త గృహముల నిర్మాణంవలన ఈ rent control అవసరం లేకుండా పోతుందేమో అనే ఆశతో ఉన్నాం. కాబట్టి ఇది permanent గా చెయ్యాలనే ఉద్దేశ్యం ఏమీ కాదు. ఈ మూడు సంవత్సరాలలోపల ఈ housing difficulty అంతా లేకుండా పోయి, ఎక్కడపడితే అక్కడ ఇళ్లు దొరుకుతాయనీ, ఎంత అద్దె ఉండాలనే విషయం ఇండ్ల యజమానులు, అద్దెకుండేవారు తమంతటతామే నిర్ణయించుకుంటారనే ఉద్దేశ్యంతో మొదట రెండు సంవత్సరాలు, మరల రెండు సంవత్సరాలూ, ఇప్పుడు మళ్ళీ మూడు సంవత్సరాలూ, దీన్ని పెంచుతున్నాము. కాబట్టి దీన్ని శాశ్వతంగా ఉంచాలనే ఉద్దేశ్యం ఏమీ లేదు. ఇదంతా వాళ్ళవాళ్ళకు వదలివెయ్యడం మంచిది కాని ప్రతీది గవర్నమెంటువారు control చెయ్యడం మంచిది కాదేమోనని కూడా అభిప్రాయపడుతున్నాను. దీంట్లోయున్న చిక్కులు మీరు చెప్పండి. అవి ఆలోచించి మేము సవరణచేస్తామనే మాట చెప్పాము. సవరణలకూ, కాలపరిమితికీ ఏమీ సంబంధం లేదు. అది 3 ఏళ్లయినా, ఒక సంవత్సరమైనా, రెండు సంవత్సరాలైనా దానికేమీ నిమిత్తం లేదు. ఆంధ్రదేశంలో ఈ చిక్కులన్నీ తీరిపోతాయనీ, దీన్ని మళ్ళీ renew చేయుటకు అవసరం లేకుండా పోతుందనే ఆశకూడా యున్నది. ఈనాడు జరిగిన debate వల్ల confusion ఎక్కువైనది గాని ఈ విధంగా ఇదమిద్ధంగా చెయ్యాలనే విధానమేమీ సూచింపబడక ఒకరు చెప్పిన విధంగా ఇంకొకరు చెప్పడములేదు. దృక్పథాలు అనేకవిధాలుగా ఉన్నాయి. కాబట్టి ఈ విషయమై Collectors నూ, Municipal councillors నూ, లేక Rate payers ని అందరినీ సంప్రతించి ఎటువంటి సవరణ తెచ్చుటకు వీలవుతుందో ఆలోచించి అటువంటి సవరణ తెచ్చుటకు ప్రయత్నం చేస్తున్నాం.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా ! ముఖ్య మంత్రిగారు మాట్లాడుతూ గతసంవత్సరంలో 2200 కేసులుపైగా ఉన్నాయని

చెప్పారు. అదే సందర్భంలో ఇప్పుడు మూడు సంవత్సరాలలో పూర్తిగా ఈ Rent Control Act లేకుండా, దీని అవసరమే లేకుండాపోతుందని ఈ లోపల ఇళ్ళవసతి సమస్య పరిష్కారమవుతుందని చెబుతున్నారు. అది ఎలా సాధ్యమౌతుంది ? ఈ రెండింటికి సమన్వయం కాదనీ, ఇంకా కొంతకాలం ఉండవలసిన అవసరం కనబడుతున్నదనీ వారు చెప్పిన లెఖ్ఖల ప్రకారం తెలుస్తోంది. కాబట్టి సంవత్సరం ఉంటే సరిపోతుందని మూడు సంవత్సరాలు అనవసరమనీ, సమర్థనీయం కాదనీ అనుకుంటున్నాం.

THE HON. SRI B. GOPALA REDDI :—Co-operative colonies పుష్కలాలు రావడం, లేక private capital తో అనేకమైన ఇళ్లు కట్టడం జరిగినప్పుడు మనకు Rent Control Act అవసరం లేకుండా పోతే పోవచ్చును. అందువల్ల దానికీ, దీనికీ ముడిపెట్టవద్దనీ, మూడు సంవత్సరాల పరిమితిని అంగీకరించమనీ కోరుతున్నాను.

MR. SPEAKER : Now I put Sri Vavilala Gopalakrishnayya's amendment to the vote of the House. The question is :

"Substitute '30th September 1957' for '30th September 1958'."

The amendment was lost.

SRI PILLALAMARRI VENKATESWARLU : Sir, I move.

"*For* '30th September 1958' *substitute* '30th September 1956'."

SRI S. VEMAYYA : I second the amendment.

MR. SPEAKER :—Amendment moved :—

"*For* '30th September, 1958' *substitute* '30th September 1956."

THE HON. SRI B. GOPALA REDDI : I oppose the amendment.

22nd September 1955]

Mr. SPEAKER : The question is :—

"*For* '30th September 1958' *substitute* '30th September 1956'."

The amendment was lost.

Clause 2 was put and carried.

Clause 1 was put and carried.

The preamble was put and carried.

THE HON. SRI B. GOPALA REDDI : Sir, I move :

"that the Madras Buildings (Lease and Rent Control) Andhra Amendment Bill 1955 be, passed into law."

MR. SPEAKER : The question is :

"that the Madras Buildings (Lease and Rent Control) Andhra Amendment Bill, 1955 be passed into Law."

The motion was carried and the Bill was passed into Law.

SRI P. SUNDARAYYA :—బిల్లు ప్రకటించేటప్పుడు ఆ సంవత్సరము నెంబరు వేస్తే తేలికగా గుర్తుంటుంది. ఇవన్నీ చదవాలంటే ఏ బిల్లుఅయినది తెలియడంలేదు.

MR. SPEAKER : It ceases to be a Bill now. When it becomes an Act, it receives a number. It ceases to be a Bill hereafter. It is only a Bill until you pass it in the House. After it is passed, it gets prominence and it gets recognition and a number.

SRI P. SUNDARAYYA :—ఒక్కొక్క ఆక్టుకు 4, 5 Amending Bills ఉన్నాయి. అందులో ఈ బిల్లు ఏదో తెలుసుకోవడం కష్టంగా వుంది.

THE HON. SRI B. GOPALA REDDI :—ఈ విషయంలో ఇబ్బంది లేకుండా చూస్తాము.

MR. SPEAKER : We shall sit upto 1-30 p.m., and meet again at 2-30 p.m.

# THE ANDHRA PAYMENT OF SALARIES AND REMOVAL OF DISQUALIFICATIONS (AMENDMENT) BILL, 1955.

THE HON. SRI B. GOPALA REDDI: Sir, I beg to introduce the Andhra Payment of Salaries and Removal of Disqualifications (Amendment) Bill, 1955 and move that the Bill be taken into consideration at once.

ఇది మన ఎసెంబ్లీ మెంబర్ల యొక్క జీతాలను చెందినది. ఎవరైనా మన ఎసెంబ్లీ మెంబర్లు నేషనల్ కేడెట్ కోర్ లో గాని లేక టెరిటోరియల్ ఆర్మీలో గాని చేరి అక్కడ ఏదో కొంత గౌరవభృత్యం పుచ్చుకొన్నప్పటికీ కూడా అది డిస్క్వాలిఫికేషనై ఎసెంబ్లీ సభ్యత్వానికి రాజీనామా పెట్టవలసిన అవసరం లేదని అది exempt అవుతుందని, అది disqualification కాదనేమాటగా ఈ బిల్లు పెట్టడమయినది. Government of India వారే అన్ని ప్రభుత్వాలను ఈ విధంగా చేయమని కోరినారు. ఆ ప్రకారం చేశాం కాబట్టి ఇది ఆట్టే debate లేకుండా pass చేయవలసిన బిల్లు. దీనిని నేను move చేస్తున్నాను.

MR. SPEAKER: Motion moved:

"That the Andhra Payment of Salaries and Removal of Disqualifications (Amendment) Bill, 1955, be taken into considera tion at once."

SRI PILLALAMARRI VENKATESWARLU:—మేము చాలా reasonable గా ఉంటాం కాబట్టి ఇలాంటి వాటిని వ్యతిరేకించకుండా ఆమోదిస్తున్నాం.

MR. SPEAKER: The questions is:

"that the Andhra Payment of Salaries and Removal of disqualifications (Amendment) Bill, 1955, be taken into consideration at once."

The motion was carried.

## CLAUSE 2.

MR. SPEAKER: The motion is:—

"that clause 2 do stand part of the Bill."

SRI VAVILALA GOPALAKRISHNAYYA: Sir, I move the following amendment:

"Add at the end, 'Provided he will not draw his monthly salary so long as he is in the Territorial Army and National Cadet Corps.'"

దీనిలో ఉద్దేశం యేమంటే N. C. C. లో అందరు శాసన సభ్యులు కూడ చేరడమునకు అంగీకరిస్తున్నారు. అయితే దీనికిబిల్లు ఎందుకు వచ్చింది? మనము ఇతర చోట్ల జీతములు తీసుకొంటూ ఈ సభ్యత్వం పోతుందనే భయంతోటి అట్లాంటిది లేకుండా రక్షణకోసం తీసుకోరాబడిన బిల్లు ఇది. అంటే ఇవతల కొంత డబ్బు తీసుకొంటూ ఉన్నాము. అవతల డబ్బు తీసుకొంటున్నాము. గనుక నష్టము అవుతుంది. నేను మనవిచేసేది యేమంటే దానికి ఎక్కువ చాకిరి చేయువలసిన అవసరం ఉంటుంది. ఎక్కువ డబ్బు వచ్చేటట్లయితే శాసనసభా సభ్యత్వ జీతాన్ని తీసుకోమంటున్నాను. లేక రెంటిలో యే choice తీసుకొంటే, ఆ choice తీసుకోవచ్చు. రెండు జీతాలు ఒక మనిషి తీసుకోవడం న్యాయం కాదు. శాసన సభ్యుడు తప్పకుండా N.C.C. లో చేరడం ఎంత అవసరమో దానిలో ఉండే integrity maintain చేయడం కోసం రెండు జీతాలు పుచ్చుకొని, దుర్వినియోగం చేయకుండా, ఈ డబ్బును తీసుకోకుండా దానిని హానివేయువలెనని కోరుతున్నాను.

SRI P. SUNDARAYYA: I second the amendment.

MR. SPEAKER: The question is:

"Add at the end 'Provided that he will not draw his monthly salary so long as he is in the Territorial Army and National Cadet Corps.'"

The amendment was lost.

Clause 2 was put and carried.

Clause 1 was put and carried.

The preamble was put and carried.

THE HON. SRI B. GOPALA REDDI: Sir, I move—

"That the Andhra Payment of Salaries and Removal of Disqualifications (Amendment) Bill, 1955, be passed into law."

MR. SPEAKER : The question is:

"That the Andhra Payment of Salaries and Removal of Disqualifications (Amendment) Bill, 1955, be passed into law."

The motion was carried and the Bill was passed into Law.

## (3) SRI VENKATESWARA UNIVERSITY (AMENDMENT) BILL, 1955.

THE HON. SRI B. GOPALA REDDI : Sir, I beg to nt roduce—

"The Sri Venkateswara University (Amendment) Bill, 1955, and move that the Bill be taken into consideration."

అధ్యక్షా, Sri Venkateswara University Act సవరణ బిల్లుకు సంబంధించినంతవరకు మూడు విషయాలుమాత్రమే ఉన్నాయి. University Chancellor గా Chief Justice of Andhra కాకుండా Governor of Andhra ఉండవలెననేది మొదటి విషయం. University కి 25 వేల రూపాయల డబ్బుకు తక్కువైన మొత్తాలను ఇచ్చిన దాతలు ఎవరైనా ఉంటేటట్లయితే వారి విషయమై Act లో ఏమీలేదు. అటువంటివారి విషయమై 10 వేల రూపాయలకు మించి 25 వేల వరకు ఎవరైనా ఇస్తే, వారు మూడు సంవత్సరములు Senate లో సభ్యులుగ ఉండవచ్చునని; అంతేగాక, రు. 5000/- ఇచ్చే వాండ్లుకూడా సభ్యులుగ ఉండవచ్చుననే సవరణ రెండవది. Privileges Committee అంటూ ఒకటి ఉండవలెనని ఇప్పటి చట్టంలో ఒక క్లాసు ఉంది. అది అవసరంలేదని, ఇంకా ఏ University Act లో కూడా అటువంటిది లేదని, కావలసిఉంటే ఈ విషయమై వారే నిర్ణయించుకోవచ్చుననే సవరణ మూడవది. Statute ప్రకారం వాండ్లకు అధికారంఉంది. అంతేకానిచట్టముతోనే Privileges Committee ఉండవలెననేది అక్కరలేదని మా అభిప్రాయం. ఈ మూడు విషయాలు మాత్రమే సవరణ చట్టంలో ఉన్నాయి. Privileges విషయం గురించి ఆలోచించవలసి యున్నది. ఉదాహరణకు మద్రాసుశాసనసభకు కొన్ని privileges ఉన్నాయి. అక్కడ సభ్యుల హక్కులను ఎవరైనా భంగపరిస్తే, ఆ విషయాన్ని Privileges Committee కి refer చేయడం జరుగుతుంది. ఈ Privileges Committee కూడ కొత్తగా ఈ చట్టంలో వచ్చినదేకాని, అది మొదటినుంచి

ఉన్నది కాదు. 1950 వ సంవత్సరం Constitution Act లో వచ్చిందిగాని Government of India Act లో గాని, అంతకుముందు ఉన్న Act లలో గాని లేదు. కాని Assembly లో జరుగని వ్యవహారాలన్నీ, senate లో నే జరుగవలెను. అక్కడ ఎన్నో privileges ఉన్నాయి. ఆ priveleges ను ఎవరో భంగం చేయబోతున్నారు. కాబట్టి ఇవి అన్ని consider చేయడానికి Privileges Committee ఉండవలెనని భావించడం న్యాయంకాదేమో. Assembly లో జరిగే వ్యవహారాలు వేరు. University లో జరుగుతూ ఉండే వ్యవహారాలు వేరు. ఇక్కడ ఏదో ఒకపార్టీ గవర్నమెంటు ప్రతిపక్షాలవారు ప్రతిపక్షనాయకులు ఉంటారు. Assembly లో adjournment motions మొదలైనవి తీసుకురావడం, ప్రభుత్వంవారిని విమర్శించడం జరుగవచ్చు. ఇవి అన్నీ తీసుకొనిపోయి, Senate లోను academic council లోను పెట్టడం న్యాయంకాదు. సాధ్యమైనంతవరకు రాజకీయాల ప్రసక్తిలేకుండా, ఇది కేవలం ఉన్నతవిద్యకు సంబంధించిన విషయం. కాబట్టి ఇక్కడ Privileges Committee అవసరం అని చెప్పడం న్యాయం కాదు. Madras University Act లో గాని, ఇతరచోట్లగాని, ఇటువంటి Privileges Committee లేదు. అందువల్ల అది ఈ చట్టంలో కూడా లేకుండాఉంటే మంచిదేమో. అవసరమైతే వాండ్లే చూచుకొంటారు. రెండవది దాతల విషయం. అన్ని University లలో కూడ, బహుశ నాకు తెలిసినంతవరకు దాతలకు ప్రాతినిధ్యం Senate లో ఉంది. ఆంధ్ర యూనివర్సిటీచట్టంలో 25 వేల రూపాయలు ఎవరైన ఇస్తే శాశ్వతంగా Senate లో మెంబరుగ ఉంటారు. అట్లే మద్రాసు, అణ్ణామలై విశ్వవిద్యాలయాలలోకూడా ఉన్నది. మన వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో మాత్రం 25 వేలుపైగా ఇస్తే 5 సంవత్సరములు మెంబరుగ ఉంటారని ఏర్పాటుచేశారు. ఇతర University లలో యావజ్జీవం అని ఉంటే ఇక్కడ అయిదు సంవత్సరాలు అనే ఉంది. దానిని ఇప్పుడు మేము ఏమీ disturb చేయడంలేదు. కాని 25 వేలు కాకుండా 15, 20, 10 వేలు ఇస్తే వాండ్లకు Senate లో ప్రాతినిధ్యం ఉండవలెనా, లేదా, అనేమాట పోయిన సంవత్సరం చర్చకు వచ్చిందేమో బహుశ దాతలందరు డబ్బు ఇచ్చి University Senate ను dominate చేస్తారేమో అనే భయంతో కాబోలు ఇక్కడ ఇది అక్కరలేదని చెప్పినారో ఏమో అనుకొంటాను. ఈ నాడు Sri Venkateswara University లో ఉండే పరిస్థితులు ఆంధ్ర University లో వున్నాయి. అన్ని University Act లలో ఇటువంటిది ఉంది. కాని ఆంధ్ర యూనివర్సిటీలోగాని మద్రాసు యూనివర్సిటీలోగాని దాతలు డబ్బు ఇచ్చి Senate అంతా dominate చేశారన్న విషయం మనకు తెలియదు. Madras University 75 సంవత్సరములుగ ఉంది. అక్కడ ఈ ఏర్పాటును

దుర్వినియోగం చేశారన్నమాట లేదు. ఇచ్చేవాండ్లను ప్రోత్సహించి 15 వేలో 20 వేలో ఇవ్వండి అని చెప్పండి. మూడు సంవత్సరములు Senate లో ఉండండి శ్రద్ధ చూపించండి అని ఆహ్వానించడానికి బదులుగా, వాండ్లు ఎవరో వస్తారు, ఏదో చేస్తారు కాబట్టి వాండ్లందరు మీ దగ్గరకు రానక్కరలేదు అని చెప్పడం అది Venkateswara University అభివృద్ధికి కొంతవరకు భంగంగా ఉంటుందేమో అని కూడా అనుకొంటాను. ఇచ్చేవాండ్లు ఎవరైనా ఉండవచ్చును. 10, 15 వేల రూపాయలు ఇవ్వవచ్చును. రెండు మూడు సంవత్సరములు మెంబరుగ ఉండవచ్చును. 5 వేల రూపాయలు ఇవ్వవచ్చును. ఒక సంవత్సరం మెంబరుగ ఉండవచ్చును. అన్ని University లలో ఉండేదానిని ఇక్కడమాత్రం లేకుండాచేయడం University ని పైకి రాకూడదనే ఉద్దేశంతో చేశారేమోగాని, ఇచ్చేవాండ్లను ప్రోత్సహించడం న్యాయం కాని నిరుత్సాహపరచడం న్యాయం కాదు. అందుకు చిన్న సవరణమాత్రం తీసుకొని వస్తున్నాను.

మూడవ విషయం. విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు Chief Justice లేక Governor అనేది కేవలం వ్యక్తులకు సంబంధించినది కాదు. ఈ విషయంలో చర్చ జరిగేటప్పుడుకూడ, సున్నితంగా మనం చర్చ చేసుకోవలసి ఉంటుంది అని అనుకొంటాను. ఒకరు కూడదు, ఒకరు కావాలి, అనే విషయంకూడ కొంత జాగ్రత్తగానే చర్చ చేసుకోవలసి ఉంటుంది.

ఒక్కవిషయంమాత్రం నేను చెబుతున్నాను. మన హిందూదేశములో దాదాపు 25,26 యూనివర్శిటీలు ఉన్నాయి. ఎక్కడాకూడ Chief justice గావున్న వారు Chancellor గా ఉన్నమాటలేదు. నాకు తెలుసు. ఇతర దేశములలో ఎట్లున్నదో గాని, మన దేశంలోమాత్రం Chief Justice University కి Chancellor గా ఉన్నమాట ఇదివరకు ఎక్కడలేదు. అటువంటిది ప్రత్యేకంగా, క్రొత్తగా శైశవ అవస్థలో ఉన్నటువంటి ఈ వెంకటేశ్వరా యూనివర్శిటీకి తీసుకురావడం న్యాయమైనది కాదని అనుకొంటాను. అన్నిచోట్ల మనం ఈ విధంగా క్రొత్తపద్ధతులను experiment చేయడం మంచిదికాదు. కొన్ని కొన్నిచోట్ల గవర్నరు Chancellor గా లేకుండా పోవచ్చును. విశ్వభారతి యూనివర్శిటీలో పండిట్ నెహ్రూ Chancellor గా ఉన్నారు. ఆయన Prime Minister గా ఉన్నందువల్ల ఆ విధంగా ఉండడంలేదు. వ్యక్తిగతంగానే ఆయన ఈనాడు Chancellor గా ఉన్నాడు. ఉస్మానియా యూనివర్శిటీలో, Chief Minister of the State, Dr. బి. రామకృష్ణరావు గారు Chancellor గా ఉన్నారు. తరువాత అలిఘుర్ యూనివర్శిటీలో మరొకరు Chancellor గా ఉన్నారు. ఇవి తప్ప ఇతర

22nd September 1955] [Sri B. Gapala Reddi

యూనివర్శిటీ లన్నిటిలో గవర్నరే Chancellor గా ఉన్నారు. ఈ వెంకటేశ్వర యూనివర్శిటీ Act చర్చకు వచ్చినప్పుడు, Select Committee లో ఈ విషయం జాగ్రత్తగా పరిశీలనచేశారు. Select Committee లో Chief Justice అనేమాట రాలేదు. కనుక ఆ విషయములో చర్చలేకుండా Select Committeeలో దాన్ని pass చేశారు. కాని ఇది Assembly లో వచ్చినప్పుడు Cheef Justice, Chancellor గా ఉండాలని చెప్పారు. ఆ విధంగా Select Committee లో చర్చింపబడనటువంటి విషయం అసెంబ్లీలో పెట్టడం జరిగింది. అందువల్ల ఈ యూనివర్శిటీయొక్క భవిష్యత్తును ఆలోచించి ఈనాడు గవర్నరు Chancellor గా ఉంటే మంచిదని, వారు ఆంధ్ర యూనివర్శిటీకి, వెంకటేశ్వరా యూనివర్శిటీకి రెంటికి Chancellor గా ఉంటే, ఈ రెంటిని సమన్వయం చేయడానికి వీలుంటుందని, అంతేకాకుండా, ఇతర యూనివర్శిటీలలోఉన్న పరిస్థితులనుబట్టి నాకు యూనివర్శిటీలతో ఉన్నటువంటి పరిచయమునుబట్టి ఈనాడు గవర్నరే. Chancellor గా వుండడం శ్రేయస్కరమనే ఉద్దేశంతో ఈ సవరణ తీసుకొనివస్తున్నాము. Chancellor కు కొన్ని nominations చేసే అధికారమే కాకుండా, ఇంకా కొన్ని ముఖ్యమైన పనులున్నాయి. ఈనాడు University Grants Commission కొత్తగావచ్చింది. వారు యూనివర్శిటీకి కొంత grant ఇవ్వడానికి సంసిద్ధంగా ఉన్నారు. అటువంటప్పుడు వారితో మాట్లాడడానికిన్నీ, వారి సలహాలు తీసుకోడానికినీ, వారినిఒప్పించడానికిని గవర్నరుకు ఉన్నటువంటి అవకాశాలు Chief Justiceకు ఉండవేమోనని అనుకోవలసియుంటుంది. కాబట్టి ఈ వెంకటేశ్వరా యూనివర్శిటీ యొక్క శ్రేయస్సును, భవిష్యతును గమనించి, మరియు ఈ రెండు యూనివర్శిటీలకు గవర్నరే Chancellor గా ఉంటే బాగుంటుందనే ఉద్దేశంతో యీ సవరణ తీసుకురాబడింది. అసలు యీ Actను గురించి సెలెక్టుకమిటీలో చర్చింపబడినప్పుడు యీ విషయంలో అందరూ అంగీకరించారు. అప్పుడు కమ్యూనిస్టులు, నాగిరెడ్డి మొదలగువారంతా ఉండినారుకూడ. అక్కడ అందరు అంగీకరించి అసెంబ్లిలో వచ్చినతరువాత suddenగా దానికి ఒక సవరణపెట్టడం, దానిని pass చేయించడం జరిగింది. ఇది న్యాయంకాదేమోనని అనుకొంటాను. కనుక యీ సవరణను ఆమోదించవలసిందని మనవి చేస్తున్నాను.

**MR. SPEAKER**: Motion moved—

"That the Sri Venkateswara University (Amendment) Bill, 1955, be taken into consideration".

Mr. Gopalakrishnayya has given an amendment to the main motion itself 'that the Bill be taken into consideration after December 1955. So, I will ask him to move it.'

SRI VAVILALA GOPALAKRISHNAYYA : I am not moving it.

MR. SPEAKER : Then, we can take up the discussion on this Bill. We can have it after lunch.

The House then rose for lunch to meet again at 2-0 p.m.

## (AFTER LUNCH 2-30 p. m.)

2-30 p. m.

SRI K. V. S. PADMANABHA RAJU :—అధ్యక్షా, ప్రస్తుతము మన ముందువున్న బిల్లు విషయములో మన ముఖ్యమంత్రిగారు శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ చాన్సలరుగావున్న ప్రధాన న్యాయమూర్తిగారిని తొలగించి, మన ఆంధ్రస్టేటు గవర్నరుగారే చాన్సలరుగా వుండాలని చెబుతూ యీ బిల్లులో ఒక సవరణ తీసుకొనివచ్చి పెట్టియున్నారు. ఈ సందర్భములో నేను ఒక విషయము చెప్పదలచాను. గత ప్రభుత్వమువారి హయాములో శ్రీ విశాఖపట్టణములో మన శాసనసభ సమావేశమయినప్పుడు ప్రధాన న్యాయమూర్తినే చాన్సలరుగా వుండాలని నిర్ణయించి ప్యాసుచేశారు. ఆ విధంగా చేసినప్పుడు యిప్పటివరకూ ప్రధాన న్యాయమూర్తియే తిరుపతి వెంకటేశ్వర యూనివర్సిటీకి చాన్సలరుగా వుంటూవచ్చారు. ఈనాడు యీ బిల్లును మన ముఖ్యమంత్రిగారు ప్రతిపాదించుచూ ప్రధాన న్యాయమూర్తి బదులు గవర్నరుగారు వుండాలని చెబుతూ కొన్ని సూచనలు చేశారు. వారు చేసిన సూచన ఎటువంటిదంటే, దీనిమీద ఎక్కువవాదన చేయకుండా, అందరు దీన్ని ప్యాసుచేయవలసిందిగా సూచన చేశారు. కాని మీ ద్వారా నేను మనవిచేసేది యేమిటంటే ఏ యూనివర్సిటీకిగూడా మనదేశములో యింతవరకు ప్రధాన న్యాయమూర్తి Chancellor గా ఎప్పుడూలేరు. గవర్నరుగారే వుండాలని, అన్నారు. కాని విశ్వభారతయూనివర్సిటీకి ప్రధానమంత్రి జవహర్‌లాల్ నెహ్రూగారు, ఉస్మానియా యూనివర్సిటీకి శ్రీరామకృష్ణరావుగారున్నూ ఈయూనివర్సిటీలకు Chancellors గా వుంటున్నారని మన ముఖ్యమంత్రిగారే చెప్పారు. అందుచేత నేను చెప్పేది యేమిటంటే, యీనాడు దేశములో పెద్దపెద్ద రాజకీయనాయకులుగా వున్న ప్రధానమంత్రి పండిట్ జవహరలాల్ నెహ్రూగారు విశ్వభారత యూని

వర్సిటీకి చాన్స్‌లరుగా వుంటున్నప్పుడు, రామకృష్ణరావుగారు ఉస్మానియా యూనివర్సిటీకి చాన్స్‌లరుగా వుంటున్నప్పుడు, మన ఆంధ్రదేశపు ప్రధాన న్యాయమూర్తి తిరుపతి యూనివర్సిటీకి చాన్స్‌లరుగా వుండకూడదు అని ముఖ్యమంత్రి గోపాలరెడ్డి గారు చెప్పడములో, నాకు యిందులో ఏదో కిటుకువున్నదనే సందేహము కలుగుచున్నది. గవర్నరుగారికి, ప్రధాన న్యాయమూర్తిగారికి గలతేడాలేమిటో నాకు ఎక్కడను కనబడటము లేదు. ఇద్దరూ పెద్దబాధ్యతగలవారే. ఇద్దరూ పెద్ద విజ్ఞానులే. వీరి యిద్దరిని పోల్చిచూస్తే తేడా ఎక్కడనూ కన్పించదు. గవర్నరుగారు ఒకస్టేటు అంతటినీ పాలించేవారు. ప్రధానన్యాయమూర్తి స్టేటుకంతటికినీ న్యాయమును పాలించేవారు. కాని గవర్నరుగారు constitutional గా, State కు Head గా మాత్రమేవున్నారు. ఇప్పుడు ముఖ్యమంత్రిగారు మాట్లాడుతూ యీ విశ్వవిద్యాలయాలను రాజకీయాలకు జోక్యము లేకుండా, University విద్యను చాలా independent గా వుండేట్లుగాను, రాజకీయాలకు అతీతంగావుంచి దీన్ని ముందుకు తీసుకొని రావాలనే దృక్పథముతో యీ సవరణ తెస్తున్నాను అని మాట్లాడారు. Education కు సంబంధించినవిషయాలు రాజకీయాలకు అతీతముగా వుండడానికి, వీరి యిద్దరిలో రాజకీయాలకు అతీతముగావుండేవారు ఎవరో మనమే గుర్తించాలి. వీరి యిద్దరిలో ప్రధానన్యాయమూర్తియే రాజకీయాలకు అతీతంగావుండేవారు అని, వారు యీ యూనివర్సిటీ విషయములో చేసే అభివృద్ధి కార్యక్రమము అంతా రాజకీయాలకు అతీతంగానే వుంటుందనే అభిప్రాయముతో నేను వున్నాను. ఇప్పుడే కాదు. పూర్వముకూడా ఒకప్పుడు భారతదేశములో హీస్తోష్ ముఖర్జీ అనే ఆయన Vice Chancellor గాకూడా వుంటూవచ్చారనే విషయముకూడా వున్నది. పండిట్ నెహ్రూగారు, శ్రీరామకృష్ణరావుగారు చాన్స్‌లర్సుగా వున్నారని మన ముఖ్యమంత్రిగారే ఒప్పుకున్నారుగదా! అలాంటి సందర్భములో ప్రధాన న్యాయమూర్తి చాన్సలరుగావుంటే ఉండే యిబ్బంది ఏమిటో అర్థము కావటము లేదు. అయినను ఒకసారి యీ శాసనసభ ప్యాసుచేసిన నిర్ణయాన్ని తిరిగి యీ సభముందుకు తెచ్చి మార్చమని కోరటము సబబుకాదు. ఈ ఒక్క విషయమేకాదు. బంజర్లవిషయములోగాని, మరి యే యితర విషయములోగాని ఒకసారి శాసనసభ ప్యాసుచేసిన నిర్ణయాన్ని పదేపదే, ప్రభుత్వానికి వీలుగా, వారికి యిష్టమువచ్చినప్పుడెల్లా, వారికితోచినట్లు మార్చడమనేది, యిది ప్రజాస్వామికము అనిపించుకుంటుందేమో గమనించాలి. ఇది ఎంతవరకు ప్రజాస్వామికము, ప్రజారాజ్యము అనిపించుకుంటుందో నాకు బోధపడడములేదు. మొన్న మొన్ననేకదా ప్రధానన్యాయమూర్తిని చాన్సలరుగా శాసనసభ నిర్ణయించి యూనివర్సిటీబిల్లును ప్యాసుచేశారు. ఇంత తొందరలో మరల యీ నిర్ణయమును

మార్చి గవర్నరుగారిని చాన్సలరుగా వేయడము, దీని అవసరమేమిటో అర్థముకావటంలేదు. పోతే, యింతకుపూర్వము యీవిషయము Select Committee లో అందరూ అంగీకరించి మరల దాన్ని తీసుకొనివచ్చి, యిక్కడ అందరికి అది అనుకూలంగా వుందని చెబుతున్నారు. గత శాసనసభ సమావేశములో మేపార్టీకిసంబంధించినంత వరకు Sri M. V. Subba Reddi గారు అక్కడవుండి, ఆరోజునకూడా Select Committee లోవారు వాదించారు. వారు వాదించలేదని చెప్పటము చాలా పొరబాటు అని నేను మనవిచేస్తున్నాను. కాబట్టి న్యాయమును పాలించే ప్రధాన న్యాయమూర్తిగారు తిరుపతి యూనివర్శిటీకి చాన్సలరుగా వుండడము మంచిదే కాని చెడ్డది యేమీకాదు. ఒకసారి శాసనసభ ఆమోదించిన తీర్మానము యిప్పుడు అది పనికిరాదు అని చెప్పడము సమంజసము కాదు. ప్రభుత్వానికి యిటువంటి దృక్పథమే వుంటే ప్రభుత్వము యీనాడు తీసుకొనివచ్చిన సవరణ ఆనాడే వెంట వెంటనే తీసుకొనివచ్చి ప్యాసుచేయించవలసింది. ఆ నిర్ణయము జరిగి యిప్పటికి సుమారు ఒకటిన్నర సంవత్సరముకూడా కాలేదు. అటువంటిది అప్పటికప్పుడే యీ విధమైన సవరణచేయించినట్లయితే బాగావుండేది. ఇప్పుడు వారినిప్పుడు, గవర్నరు గారినే చాన్సలరుగా చేయాలి అని అనడము చాలా అసంమంజసముగా వున్నది. కాబట్టి యీ విషయాలు అన్నియు ప్రభుత్వము పునరాలోచించి, ప్రధాన న్యాయమూర్తినే చాన్సలరుగా వుంచుతూ దానికి సంబంధించిన సవరణ ఆపివేస్తూ యీ బిల్లును విరమించాలని కోరుతూ, యింతటితో విరమిస్తున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా! ఈనాడు మన ముఖ్య మంత్రిగారు అనవసరమైనదియూ, వివాదగ్రస్తమైనదియూ అయిన ఒక సవరణ బిల్లును యీ తిరుపతి యూనివర్సిటీ విషయములో ప్రవేశపెట్టారు ఈ సవరణవల్ల యీ యూనివర్సిటీకి లాభముగాని నష్టముగాని యేదీగూడా కన్పించదు. ఈ యూనివర్సిటీ ఏర్పడినప్పటినుంచి మన ప్రధాన న్యాయమూర్తిగారు చాన్సలరు పదవీ భారాన్ని మోయలేకుండా వున్నారు. నా భుజములనుంచి యీ బరువును తీసివేయండి, అని వారు కోరియున్నట్లయితే, అప్పుడు యీ సవరణ తీసుకొని రావడములో అర్థము వుంటుంది. వారు ఆవిధంగా కోరియున్నట్లయితే, అప్పుడు యీ సవరణతెస్తే, మేమందరము సంతోషించేవారమే. గత ప్రభుత్వము వారి హయాములో శాసన సభ తీర్మానము చేసే ముందు Select Committee ముందు కమ్యూనిస్టు పార్టీ సభ్యులుగా వున్న మేము యీ సవరణ ప్రతి పాదించకపోయిన కారణము, యీ చాన్సలరుపదవికి గవర్నరుగారైనా ఒకటే, ప్రధాన న్యాయమూర్తిగారైనా ఒకటే, యిందులో ఎవరు వున్నప్పటికినీ, యిద్దరు

సమానులే గనుక, యిద్దరు బాధ్యతగలవారే గనుక యిందులో ప్రధాన న్యాయమూర్తి గారు వుంటేనే బాగుంటుంది, పరవాలేదు అనే దృష్టితో, మేము సవరణను ప్రతిపాదించలేదు. గవర్నరు గారు వుండడము మాకు యిష్టము లేదని కాదు. ప్రధాన న్యాయమూర్తి గారు వుండాలనే సవరణ వచ్చినప్పుడు, రాధాకృష్ణన్ కమిటీ రిపోర్టును దృష్టిలో పెట్టుకొని ప్రధాన న్యాయమూర్తిగారు వుంటేనే బాగుంటుందనే దృక్పథముతో అప్పుడు కమ్యూనిస్టు పార్టీ సభ్యులముగా వున్న మేము అందరము P. S. P. వారు తెచ్చిన సవరణను బలపరిచాము. అంతేకాని యిప్పుడు మనముఖ్య మంత్రి గోపాలరెడ్డిగారు సూచన ప్రాయంగా చెప్పినట్లు తిరుపతి వెంకటేశ్వర యూనివర్సిటీకి భంగకరముగా దేనినో సృష్టించటానికి కాదు. వారు బహుశ ఆవిధంగా చెప్పింది కేవలము వాదనకోసము అయితే కావచ్చును. దానికి పరవాలేదు కాని వారు ఆ విధంగా మనస్ఫూర్తిగా చెప్పియుంటే వారియొక్క అభిప్రాయము యీ విషయములో మార్చుకోవలసిన అవసరము వున్నదని మాత్రము నేను వారికి తెలియజేస్తున్నాను. మేము ఏనాటినుంచో తిరుపతి యూనివర్సిటీ రావాలి, రావాలి అని కోరుతూవుంటూ, చివరకు అది యేర్పడిన తరువాత, దాన్ని ఏవిధంగా అభివృద్ధికి తీసుకొని రావాలి అనేటట్లుగా మేము ఎక్కువగా కోరుతున్నాము. మన ఆంధ్ర దేశములో ఆంధ్ర యూనివర్సిటీ తప్ప మరొకటి లేకుండా వున్నది. ఈనాడు తిరుపతి యూనివర్సిటీ అనేది మన ఆంధ్ర దేశానికి ఒకటి యేర్పడ్డ సమయములో, అది అభివృద్ధి కాకుండా ఎల్లప్పుడు అది గొట్టె తోకలాగా అది అలాగే వుండాలి, వృద్ధికి రాకూడదు అని ఎవరు కోరడము లేదు. ఈవిషయము నేను మంత్రిగారి దృష్టకి తెస్తున్నాను. ఈ యూనివర్సిటీ అభివృద్ధి చెందాలంటే మంత్రిగారి చేతులలో అనేకమంది ధనవంతులు భూస్వాములు వున్నారు. వారందరినుంచి, ఏ 20 వేలో, 30 వేలో, 40 వేలో 50 వేలో లేక యింకా ఎక్కువగానో donations మంత్రిగారు సంపాదించ గలిగితే యీ యూనివర్సిటీ అభివృద్ధి కావటానికి అవకాశము వుంటుంది. కాబట్టి వారు ఆవిధంగా చేయటానికి ఎంత త్వరగా పూనుకుంటే అంత మంచిది. ఇదే మా అందరి కుతూహలముకూడాను. అప్పుడే ఆంధ్రులయొక్క ఆశయాలు అన్ని నెరవేరటానికి వీలు అవుతుంది. ముఖ్య మంత్రిగారు ఆవిధంగా తోడ్పడుతారని ఆశిస్తున్నాము. ఈ యూనివర్శిటీ విషయములో ఏ విధమైన సవరణ తెచ్చినను, కాని దానియొక్క అభివృద్ధినే మేము అందరము వాంఛిస్తున్నామని మాత్రం ముఖ్య మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను.

ఇప్పుడు వున్న ముఖ్యమైన సవరణ ఏమిటంటే Chancellor పదవిని మార్చాలని, మన ముఖ్యమంత్రిగారు దీనికి కొన్ని కారణాలు చెప్పారు. అందులో ఏఒక్క

కారణము అయినా సబబుగా వుంటే దానిని మేము ఒప్పుకునేవాళ్లమే. ముఖ్యమంత్రిగారు చెప్పారుగదా అందువల్ల దానిని ఒప్పుకోకూడదు అనే దృష్టితో కమ్యూనిష్టుపార్టీ లేదు. ఒకవేళ కమ్యూనిష్టుపార్టీ ఏదైనా చేస్తే, కమ్యూనిష్టుపార్టీ చేసినది కాబట్టి ముఖ్య మంత్రిగారు వారి పార్టీవారు వ్యతిరేకిస్తే వ్యతిరేకించవచ్చును గాని, ముఖ్యమంత్రిగారు అవలంబించే పద్ధతిని కమ్యూనిష్టుపార్టీ ఎప్పుడూ చేయదు. అందువల్ల ఈనాడు మనము చాన్సలరును మార్చాలనే సవరణ తెచ్చినప్పుడు దాంట్లో చెప్పిన కారణాలు యేమిటి? ఉపన్యాసము చేస్తూ గవర్నరు గారు ఉన్నట్లయితే గ్రాంట్సు కమీషనునుండి ఎక్కువ గ్రాంట్లు వస్తాయని చెప్పారు. నేను ఒక విషయము అడుగుతున్నాను. గ్రాంట్సుకమీషను దగ్గరకు పోయి గవర్నరుగారు ఏమైనా చెబుతారా? మన మంత్రులు వెళ్లి మా తిరుపతి యూనివర్సిటీకి ఇంత గ్రాంటు కావలెనని అడిగి దానిని అభివృద్ధి చేసుకోవాలని అనుకొంటున్నాము, ఫలానా కోర్సులు పెట్టుతాము, అందువల్ల మాకు గ్రాంట్లు కావాలని చెప్పి గోపాలరెడ్డిగారో లేక సంజీవరెడ్డిగారో వెళ్లి వాళ్లకు నచ్చచెప్పుకొంటే అది వస్తుంది. అంతేగాని Chancellor ఏనంతటతానుగా వెళ్లి మా యూనివర్సిటీకి గ్రాంటు కావాలని కోరినవారు యెవరైనా ఉన్నారా? ఏ గవర్నరు అయినా ఎప్పుడు అయినా వెళ్లారా? ఆంధ్ర యూనివర్సిటీకి యింత గ్రాంటు కావాలని చెప్పి గవర్నరుగారు ఎప్పుడు అయినా వ్రాసి తెప్పించారా? వారిని మనము ఆవిధముగా కోరుతామా? వారి హుందాతనానికి అది తగునుటుందా? ఇది అంతా ఆలోచించుకోవలసిన అవసరము మాత్రము వస్తుంది. అందువల్ల ఏదో వాదనకు దానికి కారణాలు ఏమీ లేకపోయినప్పటికి కూడా కొన్ని కారణాలు పురస్కరించుకొని చెప్పారు. కాబట్టి చెప్పిన మాటలు తప్పు అని, అవి సబబు కావని మాత్రము నేను మంత్రిగారి దృష్టికి తీసుకొనివస్తున్నాను. Chancellor గారు ఇప్పుడు Chief Justice గా వుండడంవల్ల వచ్చిన నష్టము ఏమిటి? ఆవిధంగా వుండడానికి యేమి ఆటంకము ఉన్నది? నిజముగా యేదో ఆటంకము కలుగుతున్నది కాబట్టి మారుద్దాము. ఆటంకంగావున్నదని ఏమాత్రం మనకు అనుమానము కలిగినప్పటికి కూడా తప్పకుండా తిరుపతి యూనివర్సిటీ అభివృద్ధి దృష్ట్యా మన ఆంధ్రదేశ అభివృద్ధి దృష్ట్యా అయినా తప్పకుండా మార్చాలని ఉంటే మార్చవచ్చును. ఎవరికీ ఏవిధమైన అభ్యంతరమూ లేదు. ఈ రోజున Chief Justice గారు Chancellor గా వుండటమువల్ల తిరుపతి యూనివర్సిటీ అభివృద్ధికి ఆటంకంగా వుంటే చెబితే మారుద్దాం చెప్పమనండి. ఇంత పెద్ద వ్యక్తులగురించి చర్చించేప్పుడు ఇవన్నీ ప్రెస్‌కుపోతున్నాయి కాబట్టి, అట్లా పోవడము మంచిది లేకపోతే బహిరంగంగా చర్చించక రహస్యంగా సమావేశము అవుదాము. అప్పుడు ఈ విషయాలన్నీ చర్చిద్దాము. మనకు మెజార్టీ ఉన్నది

గవా అని ఈ బిల్లును pre s చేయడము మంచిది కాదని నేను విజ్ఞప్తి చేస్తున్నాను. యూనివర్సిటీ కమీషన్ రిపోర్టులో ఏమివున్నదంటే అసలు ఒక రాష్ట్రంలో రెండు యూనివర్సిటీలు ఉన్నప్పుడు Chancellor గా ఎవరు ఉండాలనేది సూచన ప్రాయంగా ఉన్నది. దానిని గోపాలరెడ్డిగారు చూచారోలేదో ఒక వేళ చూచే ఈ అభిప్రాయానికి వచ్చారు అంటే ఆందోళన పడవలసిఉంటుంది.

"The University Commission has said : "Present practice varies. But in most provincial Universities the Governor of the Province is ex-officio Chancellor. This arrangement has worked well especially in provinces with only one University. Where there are several Universities in one province, Governor himself may feel that he cannot give to all of them as much personal contact as is desirable. This is a question which should be settled by each province for itself."

దీనినిబట్టి మనకు ఏమి తెలుస్తుందిఅంటే ఖచ్చితంగా గవర్నరుగారు వుండ కూడదు అని చెప్పారు అన్నమాట నేనుచెప్పేది. ఒకటి, రెండు, యూనివర్సిటీలు ఉన్నప్పుడు గవర్నరు గారు అన్నింటిమీద ఒకేవిధమైన దృష్టిని కేంద్రీకరించి ఎక్కువగా పనిచేయడానికి సాధ్యపడుతుందా, లేదా, రాష్ట్రముయొక్క బాధ్యత అంతా కూడా గవర్నరు గారి భుజస్కంధాలమీదనే వుంచేవారు మోయలేక మోయలేక మోస్తున్నారు. ఆంధ్ర రాష్ట్రములో ముఖ్యముగా ఒక యూనివర్సిటీ జరుగుతుంటే ఇంకొక యూనివర్సిటీ జరుపుకూడా వారిమీద పెట్టడము ఏ విధముగా న్యాయముగా కూడా నాకు బోధపడటములేదు. అందువల్ల దానిని పురస్కరించుకొని Chief Justice Chancellor గా వుండకూడదనే నిర్ణయానికి రావడము సబబు కాదని మాత్రము మాకు తెలియజేస్తున్నది. వారు ఉపన్యాసంలో అది చెప్పారు.

"In the interests of administrative convenience, it is considered desirable to relieve the Chief Justice of the High Court of Andhra of the administrative responsibility of the Chancellorship of Sri Venkateswara University."

చాన్సలరు యొక్క ప్రాక్టీస్ ఏమిటి? Act అంతా తిరగవేయండి. Chancellor యొక్క duties మనము చెప్పినంతవరకు......

To nominate persons to represent interests not adequately represented otherwise అనిఉంది. సెనేటులో ఎవరి interest అయినా represent కాకపోయినప్పటికి Chancellor గారు represent

చేయవచ్చును. ఇది వారికి ఉండేటటువంటి గురుతర బాధ్యత. ఈ బాధ్యతను ఈ chanceller గారు నిర్వర్తించ లేమ లేదని గోపాలరెడ్డిగారి అనుమానమా? ఇంత వరకు ఒక సంవత్సరముకూడా కాలేదే? దానిని ఇంత తొందరపడి తీసుకురావలసి వచ్చింది అని నేను అడుగుతున్నాను. ముఖ్యమంత్రిగారు చాలా తొందరపడ్డారనే అనుమానము ఎవరికీ వుండదు. అందరూకూడా దానిని అంగీకరిస్తారు. ఇంత తొందర పడాల్సిన అవసరము ఏమివచ్చింది? ఇంతవరకు సంవత్సరము అయినది, ఇంకొక సంవత్సరము కనిపెట్టుకొనిఉంటే బాగుంటుంది. వారు ఆ బరువును మోయలేక పోతే నా భుజాలమీదనుంచి ఈ బరువుదింపమని వారే కోరుకుంటారుకదా? ఆ అవకాశాన్ని ఎందువల్ల వారికి ఇవ్వకూడదుఅని నేను ముఖ్యమంత్రిగారిని నేను ప్రశ్నిస్తున్నాను. అందువల్ల ఇప్పుడు తెచ్చిన ఈ క్లాజును వారు ఉపసంహరించుకోవాలని మాత్రము నేను కోరుతున్నాను. దానిని వివాదగ్రస్తను గా చేయవద్దనికూడా నేను చెబుతున్నాను. మన ముఖ్యమంత్రిగారు మార్పును వివాదాలు తగ్గించడానికి లేదు. వివాదాలు పెంచడానికి అనే అనుమానముకూడా కలుగుతుంది. చాన్సలరుగారు తిరుపతి యూనివర్సిటీ అభివృద్ధికి ఆటంకంగా వున్నారని అన్నారు. ఎవరు వున్నారో చెప్పగలరా? ఎవరి ఉపన్యాసముఅయినాసరే తిరుపతి యూనివర్సిటీ అభివృద్ధికి ఆటంకంగా వుందని చెప్పగలరా? చెప్పలేదు. ఎందువల్ల ఈ పవ్రయోగము చేయవలసివచ్చిందో నాకు బోధపడటములేదు. అందువల్ల a lministra'ive convenience చూచుకున్నప్పుడు యీ రోజున వచ్చేటటువంటి బ్రహ్మాండమైనటువంటి ఆటంకాలు ఇంతవరకు మనకు ఏమీ కల్పించబడములేదు. అప్పటికికూడా administrative convenience అని పెట్టారు. ఇంకా

"A Common Chancellor for both the Universities in the State may have a better appreciation of the problems of both the Universities and be in a better position to guide them in a manner that does not give room for duplication of effort" అనికూడ వుంది. నేను ఈ కారణాన్ని దీంట్లో ఉదహరించినందుకు చాలా సంతోషిస్తున్నాను. నిజముగా మంత్రిగారు దీనిమీదనే ఆధారపడి వాదించడానికి సిద్ధంగా ఉన్నారు. Duplication of work లేకుండా problems appreciate చేయడానికి అనుకూలురుగా ఆంధ్ర యూనివర్సిటీ చట్టాన్ని తిరుపతి యూనివర్సిటీ చట్టాన్ని మార్చడానికి మంత్రిగారు సిద్ధంగా వున్నారా? లేరని నేను చెప్పగలను. మేము ఏమి సూచనలు చేసినాకూడా వారు అంగీకరించరు. మేముకాదు వారి పార్టీనుంచి కూడా ఎవరైనా సూచనలు చేసినా అంగీకరించరు. కావలసివస్తే ప్రయత్నముచేసి

చూడండి. మొట్టమొదట ఒకే చాన్సలర్ వుండాలన్నారు. ఇద్దరుచాన్సలర్లు ఎందువల్ల వుండకూడదని నేను అడుగుతున్నాను. ప్రోచాన్స్‌లరును, వైస్ చాన్సలరును ఒక్కరినే పెట్టుకునేదానికి అంగీకరిస్తారా? రెండు సెనేటులుగానైనా సరే లేక రెంటినీకలిపి ఒకేసెనేటుగానైనాసరే వుంచుకొని ఆంధ్రదేశానికంతకు సంబంధించిన ప్రాబ్లెమ్సును, పరిష్కరించుకోవాలి. ఆంధ్రదేశంలో వున్న యావత్తు ప్రజానీకానికి సంబంధించిన యూనివర్శిటీలు గాని ఏదో వర్గాలకు, ఒకప్రాంతానికి, ఒకజిల్లాకు మాత్రమే సంబంధించిన యూనివర్సిటీలు కావు అనే వుద్దేశ్యము అందరికి వుండి తీరాలి. దురదృష్టవశాత్తు అలాంటి విభేధాలు కల్పించుకొని ఇంతదూరము తెచ్చుకున్నది. ఇకనైనా దానిని ఎంతత్వరగా విరమించుకుంటే అంతమంచిదని మంత్రిగారికి చెబుతున్నాను. అందువల్ల యోగోజన మనము ఒకేదృక్పథముతో నడవాలి అన్నప్పుడు మనసమస్యలు అన్నికూడా సమగ్రంగా పరిశీలించాలన్నప్పుడు అవలంభించే విధానాలు తిరుపతి యూనివర్సిటిలోగాని ఒకేవిధముగా వుండాలన్నప్పుడు పైనుంచి గవర్నమెంటువాళ్ళను ఎప్పుడూ goad చేస్తూ వుండకుండా కూర్చునేందుకైనా ఒక మిషనరీ వున్నదా? లేదా? అది అవలంభించేప్పుడు మీరు దానిని ఎందుకు అంగీకరించరు? ఒకే ఒక Vice Chancellor ను పెట్టుకుందాము అంటే, అంగీకరిస్తారా? Amending బిల్లు తెస్తే మేముతప్పకుండా అంగీకరిస్తాము. దాంట్లోవున్న ఉద్దేశ్యము ఏమిటని ముఖ్యమంత్రిగారిని ప్రశ్నిస్తున్నాను. ఇవన్నీకూడా ఎందుకు ఆలోచించి తీసుకురాకూడదు? వారు దానికి ప్రోచాన్సలరుగా వున్నారు. దీనికి కూడా వారినే ప్రోచాన్సలరుగా ఎన్నుకుందాము. రెండు యూనివర్సిటీలు ఒకే రకంగా అభివృద్ధి చెందాలని మనకందరకు వున్నట్లయితే మన విభేదాలను చంపివేయాలి అన్న ఉద్దేశ్యం మనకు ఉన్నట్లయితే తప్పనిసరిగా ఈ రకమైన proposals తెచ్చేవారుగాని ఒక్క చాన్సలరుని మార్చినంత మాత్రాన దాంట్లో ఉదహరించినటువంటి ఆశయముకోసం మార్పు చేస్తున్నాము, అది మమ్ములను నమ్మమంటే మేము అంత తెలివితక్కువ వాళ్లము కాము. ప్రజలుకూడా ఆ స్థితిలో లేరని నేను మీకు విజ్ఞప్తి చేస్తున్నాను.

Sri Pillalamarri Venkateswarlu] [22nd September 1955

అందువల్ల ఈరోజున మీరుతెచ్చిన సవరణ ప్రకటింపబడిన ఉద్దేశాలతో రాలేదు. Administrative convenience అంటారా ఒకసంవత్సరం ఆగండి, అనవసరమైన feelings ఎందుకు తెచ్చిపెడతారు? వచ్చిన. వివాదాలను మరిచిపోవాలి అని అన్నీ సమసిపోవాలనే రోజుల్లో తిరిగి మీరు పుల్లతో పుండును కెలుకుతున్నారు. ఈరోజున అవసరంలేదు ఇటువంటి బిల్లు. చాన్సలరుగా ఎవరుంటే ఏమివచ్చింది? ఆంధ్ర యూనివర్సిటీకి గవర్నరుగారు చాన్సలరుగా ఉన్నారు. ఆయన ఉంటే ప్రత్యేకంగా జరిగింది ఏమిటి? తిరుపతి యూనివర్సిటీకి Cheif Justice చాన్సలరుగా ఉండడంవల్ల నష్టం ఏమిటి? రెండింటికి ఒకటే ఉండవలసివస్తే గవర్నరుగారినే తీసివేసి Cheif Justice గారినే ఎందుకు పెట్టకూడదు? ఒకేవిధంగానే ఉండాలంటారా, ఆలోచిద్దాం ప్రతివిషయం. విభేదాలు సమసిపోవడమే మాకు కావాలి. ఆ విషయం ఎక్కడా కనిపించదే! ఈ బిల్లు తీసుకురావాలని తెలిసినప్పుడే ఈ వివాదాలు మళ్లీ లేవనెత్తుతున్నారు అనిపించింది. దేశం ముందుకు పోతోంది అంటున్నారు. పంచవర్ష ప్రణాళిక అంటున్నారు. ఇటువంటి సందర్భంలో, ఎక్కడ ఎటువంటి కాలేజీలు, industries కావాలో ఆలోచించుకోవాలి కాని ఇది మార్గం కాదు. కలిసి ఆలోచించుకోడానికి machinery ఏదైనా set up చేశారా? లేదు. మద్రాసు యూనివర్సిటీ తోకమాదిరిగా వెళ్ళే ప్రమాదం వున్నదని ఈవేళ పత్రికలుచూస్తే తెలుస్తుంది. రెండు విభిన్నమైన పంథాను అనుసరించినా ఆశ్చర్యపడవలసిన అవసరంలేదు. ఒక machinery suggest చేయండి. ఆ విధంగా ముఖ్యమైన సమస్యలను పరిష్కారం చేయకుండా ఇతర కారణాలను పురస్కరించుకుని కాగితంమీద ఒకటి, అసలు కారణం వేరొకటి పెట్టుకుని దాన్ని ఈ విధంగా తీసుకురావడం సబబుకాదని మంత్రిగారికి విజ్ఞప్తిచేస్తున్నాను. ఇంకా రెండు amendments వున్నాయి. Privileges committee అనవసరం అని చెప్పారు. దానిలో రాజకీయాలు లేవు కనుక అన్నారు. విద్యాసంస్థలలో రాజకీయాలు లేకుండా వుంటేనే మంచిదని మేమూ అనుకుంటున్నాము. రాజకీయపార్టీలు రాజకీయభావాలు ఎట్లావున్నా దానిని అనుసరించి విభజన కావలసిన అవసరంలేదని అంగీకరిస్తున్నాము. రెండుపార్టీలు తగాదాలు పడుతున్నా, మనం కలపివున్న అడ్డంకులు కొన్ని తొలగించుకోవచ్చును. ఒకపార్టీ మరొకపార్టీని వ్యతిరేకిస్తే పొరపాటు అని మనవిచేస్తున్నాను. అన్ని privileges సరిగ్గా అమలుజరుగుతున్నాయా, లేదా అనేవి ముఖ్యం. మనుష్యుడు చెడ్డగావున్నా మంచిగాఉన్నా, మనం అన్నింటికి provide చేసుకోవలసిన అవసరం ఉన్నది. అందుకే Privileges Committee ని ప్రత్యేకంగా ఉదహరించాము. ఆంధ్ర యూనివర్సిటీలో ఎక్కడా

లేదుకదా, తీసివేస్తున్నాము అంటున్నారు. ఇది ఉండడంవల్ల వచ్చే నష్టంఏమిటి అంటున్నాను. దీనివల్ల తిరుపతి యూనివర్శిటీ function చేయడంలో ఏమి నష్టం వచ్చింది? Vice Chancellor report లేదు; ఏ విధంగా ఏమిచేస్తుందో చూడలేదు. ఇది ఏమీలేకుండా, ఆనాడు కమ్యూనిస్టులో ఎవరో చేశారు కాబట్టి, ఎత్తిపారేయాలి. మంచిచెడుగులు చూడకుండానే ఎత్తిపారేయాలని చూస్తున్నారు. ఒకసంవత్సరమైనా చూడండి, సెనేటు చేయవచ్చును కదా అంటూరు. క్రొత్తగా మనం యూనివర్శిటీని నిర్మించుకునే సమయంలో కొన్ని క్రొత్తవిధానాలు ఏర్పాటు చేసుకుంటాము. వీటిని function చేసే విధానం చూసేవరకు ఓర్పువహించాలి. మెంబర్లు డబ్బుఇవ్వాలి అంటూరు. University Commission Report చూసే ఉంటూరు. ఆ విధంగా యివ్వకూడదని ఖచ్చితంగా వ్రాశారు. గోపాలరెడ్డిగారు దానిని commercial సంస్థగా ఎందుకు మార్చకూడదు అంటూరు, 5 వేలు రూపాయిలు తేలిగ్గా వస్తాయి, అని. ఒకరూపాయికూడా తేలిగ్గారాదు. Educational institutions విషయంతో వాళ్లయొక్క dignity maintain చేయాలంటే అనుభవజ్ఞులు ఇచ్చిన రిపోర్టుచూచినా అలా చేయకూడదని తెలుస్తుంది. రాధాకృష్ణన్ కమిటీ రిపోర్టు చూచిన తెలియగలదు. వివరాలలోనికి నేను వెళ్ళను; సుందరయ్యగారు చెబుతారు. ఎవరుచెప్పినా మేము వినము; మా డిపార్టుమెంటు చెప్పిందే మాకు కావాలి. లేదు అనడం సబబుకాదని చెబుతున్నాను. తొందరపడి అనుభవంమీద చూడకుండా, తిరుపతి యూనివర్శిటీ ఏ విధంగా పనిచేస్తోందో చూడకుండా ఈవిధమైన సవరణలు తీసుకురావడం సరికాదని అనుకుంటున్నాను. మేము ఈ సవరణలు మూడింటినికూడా అంగీకరించలేము. ఇతర యూనివర్శిటీల అనుభవం మీద మార్చుకోవాలి. ఈ బిల్లుకు తొందరలేదు. మీకు open గా చెప్పడానికి కష్టం గావుంటే secret session వేసుకుందాము. నిజంగా ఏమైనా ఇబ్బందులు ఉంటే కమ్యూనిస్టుపార్టీ మార్చుకోడానికి సిద్ధం. పెంకితనంగా మేముపట్టిన కుందేలుకు మూడుకాళ్లు అనేరీతిగా మీకు మెజారిటీ వున్నది. కాబట్టి pass చేస్తామంటూరు. మీయిష్టం.

SRI K. VENKATARAMANAYYA :—అధ్యక్షా, ఇప్పుడు ముఖ్యమంత్రిగారు వెంకటేశ్వర యూనివర్శిటీ Actకు కొన్ని సవరణలు పెట్టారు. అందులో ముఖ్యమైనది, ఇదివరలో Chancellorగా ఉండే Chief Justiceగారి స్థానే రాష్ట్రగవర్నరుగారిని ఛాన్సెలరుగా పెట్టాలని గోపాలరెడ్డిగారు తమ ఉపన్యాసములో చెప్పకపోయినా గవర్నరుగారు ఛాన్సెలరుగా ఉండే పక్షంలో కొన్ని అసందర్భపు పరిస్థితులు ఏర్పడడానికి వీలుఉన్నది. యూనివర్శిటీ మీద దావాలువస్తే ఆ దావాలు

Sri K. Venkataramanayya] [22nd September 1955

హైకోర్టులో writ ద్వారా వచ్చినపుడు కొన్ని చిక్కులు వస్తాయి. అప్పుడు Chief Justice గారే ఛాన్సలరుగా వైన High court లో writ వేసే కొన్ని అసందర్భపు పరిస్థితులు ఏర్పడుతాయి. గవర్నరుగారే ఛాన్సెలరుగా ఉన్న పక్షంలో writ వేసినా హైకోర్టులో ఏ విధమైన అభ్యంతరాలు లేకుండా ఉంటాయి. రెండవది administrative convenience అని చెప్పారు. యూనివర్సిటీకి రాష్ట్ర finances, grants finance అన్నీ కూడా grants రూపంలో కావలసి ఉంటుంది. మన రాష్ట్ర ఆదాయంనుంచి grants ఎంతవరకు ఇవ్వడానికి వీలు ఉంటుందో, Centre నుంచి ఎంతవరకు రాబట్టడానికి వీలు ఉంటుందో, ఒక estimate తయారు చేయడానికి గవర్నరుగారే ఛాన్సలరుగా ఉంటే, గవర్నమెంటులో ఉండే విధానాలను ఆలోచించి, ఆంధ్ర యూనివర్సిటీకికూడా ఆయనే ఛాన్సెలరు కాబట్టి నూతనంగా స్థాపించబడిన వెంకటేశ్వర యూనివర్సిటీ విషయంలోకూడా ఏవిధంగా చేస్తే బాగుంటుందో—ఏ విధంగా grants రావడానికి వీలుఉంటుందో—రెండింటికి నష్టంలేని రీతిగా సదుపాయాలను కలిగించడానికి సావకాశం ఉంటుంది. Centre నుంచి grants కోరేటప్పుడు, రాష్ట్ర గవర్నమెంటు వారు చేయాలి. ఛాన్సెలరుగా గవర్నరుగారు ఉంటే తప్ప మిగతా విషయాలు విద్యాశాఖ మంత్రిగారినుంచి సెక్రటరీ గారి దగ్గరనుంచి తెలుసుకోడానికి వీలుగా ఉండదు. Centre నుంచి డబ్బు తెచ్చుకోడానికికూడా గవర్నరుగారు ఛాన్సెలరుగా వుంటే ఎక్కువ వీలుగా ఉంటుంది, దీనిని దృష్టిలో పెట్టుకునే administrative convenience అన్నారు గోపాలరెడ్డిగారు. అంతేకాని చాన్సలరుగా ఉండకూడదని కాదు. ఉండడంవల్ల వారికి కష్టం అని కాదు. చాలా చిక్కులున్నవని అన్నారు. ఇండియా దేశం మొత్తంమీద ఎక్కడ కూడా చీఫ్ జస్టిసు చాన్సలరుగా ఉండడంలేదు. లోగడ మద్రాసు యూనివర్సిటీకి వైసు చాన్సలరుగా Sir John Wallace చీఫుజస్టిసు ఉండేవారు. అప్పటిలో యూనివర్సిటీ ఒక దావా వేయవలసి వచ్చింది. దావా వేసేముందు legal advice తీసుకోవడమా, అవసరములేదా అన్న ప్రశ్న వచ్చినపుడు వైసు ఛాన్సలరుగా ఆయన దావా వెయ్యమని సలహా ఇచ్చారు. ఆదావా యూనివర్సిటీకి వ్యతిరేకముగా తీర్పు అయి ఖర్చులక్రింద యూనివర్సిటీ 250/- రూపాయలు ఇచ్చుకోవాలన్నారు. Sanction కు సెనేటులో ఈడబ్బుగురించి ప్రశ్నవచ్చినప్పుడు సెనేటు మెంబరు Dr. Nayar ఈదావా contest చెయ్యాలని తీర్మానముచేయక పూర్వము legal advice తీసుకొన్నారు అని అడిగారు. దానికి ఛీఫ్‌జస్టీసు వైసుఛాన్సలరుగా

ఉండగా వేరే legal advice అవసరం లేదన్నారు. అప్పుడు వాయరుగారు ఛీఫ్ జస్టీసుగా ఉన్నవారు ఉదారంగా advice ఇచ్చారు కాబట్టి వారే ఆ డబ్బు కూడా స్వంత pocket లోనుంచి యిస్తే బాగుంటుందన్నారు. సెనేటు ఇవ్వడానికి వీలులేదన్నారు. వైసుఛాన్సలరు తన స్వంత పాకెట్టులోనించి ఇస్తాను అన్నారు. ఇండియా మొత్తములో 26 విశ్వవిద్యాలయములు ఉన్నాయి. అన్నింటిలో ఛాన్సలరుగా గవర్నరే గాని ఛీఫ్ జస్టీసు కారు. మన సోదరులు ఆంజనేయులుగారు చెప్పినారు. రాజకీయాలతో సంబంధము లేకుండా ఉంటుంది. ఛీఫ్ జస్టీసు ఛాన్సలరుగా ఉంటే ప్రత్యేకముగా ఏవిధమైన రాజకీయాలతో సంబంధములేకుండా కొన్ని విషయాలు నిర్ణయించవచ్చును అన్నారు. అయితే ఛాన్సలరుకు యూనివర్సిటీ ఎడ్యుకేషను పరిపాలనకు ఏమీ సంబంధములేదు. దానికి సంబంధించినంతవరకు అక్కడి కార్యక్రమమంతా వైసుఛాన్సలరే నడుపుతారు వైసు ఛాన్సలరుద్వారానే ఆయన పరిపాలన చెయ్యవలెను. మనది ముఖ్యముగా కొత్త యూనివర్సిటీ కాబట్టి దానికి డబ్బు కావలెను. అది ఇచ్చేది స్థానిక ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వం. ఈ రెండింటినుంచి డబ్బు తీసుకొని రావడానికి, దీని అవసరాలను కనిపెట్టడానికి ఛాన్సలరుగా గవర్నరు ఉంటేనే బాగుంటుంది. All purposes కు కూడా బాగా వీలుగా ఉంటుంది. ఈ విషయములో మెంబర్లకు మెజారిటీ ఉంది కాబట్టి ఆ కారణముచేత ఈ బిల్లు తీసుకువచ్చారుగాని ఇంకేమీ కారణము కాదని ఆంజనేయులుగారి విమర్శ సరిఅయినది కాదు. మెంబర్లు అధికముగా ఉన్నప్పటికీ లేనప్పటికీ అదివరకు లోగడ ఏ కారణముచేత వారు చేసినారో ఆ కారణముచేత ఇప్పుడు తిరిగి శాసనసభ్యులు చెయ్యడానికి వీలులేదని చెప్పడం సమంజసము కాదు. అప్పుడు ఏ కారణములచేత చేసినా ప్రస్తుత పరిస్థితులలో అది అవసరము, అవునో కాదో చూసి, అది ఎక్కువ ఉపయోగకరముగా ఉంటుందని ఆలోచించి గోపాలరెడ్డిగారు చెప్పినట్లుగా administrative convenience కు చాలా అవసరం ఉన్నది కాబట్టి ఈ మార్పు తీసుకువచ్చారు. ఇక రెండవవిషయము Privileges Committee అనేది. ఆంధ్ర విశ్వ విద్యాలయములోను ఇతర విశ్వ విద్యాలయములలోను ఎక్కడ ఈ ప్రివిలేజసు కమిటీ అనేదిలేదు. రాజకీయముగా ఎసెంబ్లీలలోను కౌన్సిళ్లలోను, పార్లమెంటులోను ప్రివిలేజసు కమిటీలు ఉన్నవి. సెనేటు సభ్యులకు గాని, సిండికేటు సభ్యులకు గాని వేరే ప్రివిలేజసు అంటూ లేనే లేవు. ప్రివిలేజసు ఉన్నప్పుడు, వాటికి భంగముకల్గినపుడుకదా ప్రివిలేజసు కమిటీ కావలసినది ? ప్రివిలేజసే లేనపుడు ఈ ప్రివిలేజసు కమిటీ అనవసరము. ఇదివరకు ఛీఫు జస్టీసును ఛాన్సలరుగా పెట్టినట్లై ఈ ప్రివిలేజసు కమిటీకూడా పెట్టారు. అది ఇప్పుడు అనవసరము కాబట్టి ఈసవరణ సమంజసముగానే ఉన్నది.

మూడవ విషయము యూనివర్సిటీకి ఎవరైనా డబ్బు ఇస్తే కొంతకాలం మెంబరుగా ఉండవచ్చునని ఉన్నది. అంతేగాని ఆంజనేయులుగారు చెప్పినట్లు రు. 1000/- ఇస్తే రెండు నెలలు రు. 500/- ఇస్తే ఒక నెల మెంబరుగా ఉండడము కాదు. సెనేటు పరిపాలనకు స్థిరత్వం ఉండడానికి వీలు లేదు. కాబట్టి అలా చెయ్యడానికి వీలులేదు. ఆంధ్ర విశ్వవిద్యాలయంలో పెద్ద పెద్ద మొత్తాలు ఇచ్చినవారు ఉన్నారు. ఇక్కడ కూడా డబ్బు రావచ్చును. ఇది కూడా సహాయకముగా ఉన్నది. కాబట్టి ఈ మూడు ఆమోదించి బిల్లు ప్యాసు చెయ్యవలెనని కోరుచున్నాను.

Sri PILLALAMARRI VENKATESWARLU :—ఆంజనేయులు గారు అని అన్నారు. ఎవరండి ఆ ఆంజనేయులు గారు?

SRI K. V. RAMANAYYA :—I am sorry, I mean.

SRI A. KALESWARA RAO :—అధ్యక్షా! ఈ మూడు సవరణలు, ముఖ్యమంత్రిగారు ప్రతిపాదించినవానిని, మన స్నేహితులు కొందరు ఆక్షేపిస్తున్నారు. నిజమే. ఛీఫ్ జస్టీసు అనేటటువంటి ఆయన చాలా గొప్పవారు, పూజ్యులు, ధర్మమూర్తి. ఆయన విషయములో ఏ విధమైన అగౌరవము లేదు మనకు. ఆయన నిష్పక్షపాతి. ఇప్పుడు ఉన్న ఛీఫ్ జస్టీసు చాలా ధర్మబుద్ధిగలవాడు. ఆంధ్ర హైకోర్టు ఆదర్శప్రాయంగా ఉన్నది. ఈ నాడు దానికి ఇప్పటి ఆ అమెండుమెంటుకు సంబంధము లేదు. మనవారు చేసిన గొప్ప కార్యాలలో తిరుపతి విశ్వవిద్యాలయము స్థాపన ఒకటి. తిరుపతి దేవుడు డబ్బు ఒక గొప్ప విశ్వవిద్యాలయానికి మరల్చారు. అదిచాలా సుప్రసిద్ధము అయిన విశ్వవిద్యాలయమే కాబోతున్నది. ఆ విశ్వవిద్యాలయానికి ఇంకొక లక్ష్యం ఉంది. అది కొన్ని జిల్లాలకు ప్రత్యేకించి affiliating విశ్వ విద్యాలయంగా ఉన్నది. కేవలం Residential University గా లేదు. తిరుపతి విశ్వవిద్యాలయం కొన్ని జిల్లాలకు, వాల్తేరు విశ్వవిద్యాలయము మరికొన్ని జిల్లాలకు ఉపకరిస్తుంది. ఈ రెండు విశ్వవిద్యాలయాలు ఒక పరిపాలన క్రింద ఉంటే పరిపాలన పద్ధతులు ఒకే పద్ధతిలో నడువవచ్చును. అటువంటప్పుడు ఈ విశ్వవిద్యాలయాన్ని బాగుచెయ్యడానికి చాలా డబ్బు కావలెను. ఇది Financial matter. దానికి గవర్నరే సహాయము చెయ్యవలెను. గవర్నరంటే మంత్రివర్గము దానికి ఇవ్వాలి. దానికి ఇవ్వాల్సిన డబ్బు ఒకేవిధమైన పాలసీతో జరుగవలసి ఉంటుంది. సెనెటు, సిండికేటు వేరుగా ఉంటాయి. వైస్‌ఛాన్సలరు, రిజిస్ట్రారు వేరుగా ఉండవచ్చును. కాని డబ్బు తదితరమైన విషయాలలో ఒకే రకమైన ఆర్థిక

పాలసీ రాజనీతి అవలంబించవలెను. ఈ రెండింటికి గవర్నరుకు సంబంధము ఉన్నది. తిరుపతి యూనివర్సిటీకి 7 లక్షల 50 వేలు ఇచ్చారు. ఆంధ్రవిశ్వవిద్యాలయానికి కొన్ని లక్షలు ఇస్తారు. Administrative Head గవర్నరు, మంత్రులు సలహా దారులుగా ఉన్నారు. ప్రధానమంత్రి విద్యామంత్రి బూర్గుల రామకృష్ణారావు గారు హైదరాబాదులో ఉన్నారు. ఆయన ఛాన్సలరు. ముఖ్యంగా సూటిగా పోయేటటువంటి, న్యాయమూర్తి, ధర్మమూర్తి పదకొండు గంటలనుండి అయిదు గంటలవరకూ ఆఫీసులో కూర్చునే ఆయనను తీసుకొనివచ్చి ఎట్లాపెట్టేరో దురూహ్యముగా ఉంది. మన విద్యామంత్రిని పెట్టితే దానికి అర్థము ఉంది అంతేగాని ఛీఫ్ జస్టిసుగారిని ఛాన్సలరుగా పెట్టడం ఎక్కడా లేదు.

ఎక్కడ లేనటువంటి సాంప్రదాయాన్ని తీసుకువచ్చి పెట్టడం బాగా లేదు. మనకు ఆయనమీద ఏవిధమైన అగౌరవంలేదు. Administrative convenience అంటేపరిపాలనా సౌలభ్యానికి Central Governmentతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి డబ్బు సంబంధమైనటువంటి విషయాలు చూసుకోడానికీ, మన గవర్నమెంటుకు సంబంధం ఉండి, దానికిపైన ఉన్న Head, రాష్ట్రానికి Executive Head గా యున్న గవర్నరుగారే దీనికీ కూడా Executive Head గా ఉండాలి. ఇంకాక మన సోదరులు వెంకటేశ్వర్లుగారు చదివారు. కొన్ని రాష్ట్రాలలో ఒకే యూనివర్శిటీ ఉన్నప్పుడుకూడా గవర్నరే Chancellor గా ఉంటున్నారు. చాలా యూనివర్శిటీలు ఉన్న చోటకూడా అంతే. మనకున్నవే రెండు యూనివర్శిటీలు. ఈ రెండు కూడా overlap కావడంలేదు. కొన్నిచోట్ల కొన్ని Affiliating Universities కొన్ని Residential Universities ఉంటాయున్నవి. ఇప్పుడు U. P. లో కావలసినన్ని యూనివర్శిటీ లున్నవి. అలహాబాదులో, అలిఘురులో, Delhi లో, Lucknow, Benares Hindu University ఇవన్నీ ఉన్నవి. కొన్ని overlap అవుతున్నాయి. మనది అట్లాకాదు. ఆంధ్రాలో ఉత్తర జిల్లాలన్నిటికీ ఒక యూనివర్శిటీ అనీ పశ్చిమ జిల్లాలన్నిటికీ ఒక యూనివర్శిటీ అనిన్నీ పెట్టినప్పుడు రెండూ ఒకటే దృష్టితో ఒకే ఆర్థిక రాజనీతితో జరపవలసినటువంటి విధి ఈ ఆంధ్ర రాష్ట్ర ప్రభుత్వానికి ఉన్నది. కనుక రాష్ట్రానికి పెద్దగా ఉన్నటువంటి గవర్నరుగారినే, ఆంధ్ర విశ్వవిద్యాలయం చూచినట్లే దీన్నికూడా చూడమని మనం కోరవలసియున్నది. రమణయ్యనాయుడుగారు సెలవిచ్చినటువంటి అనుభవాలన్నీ కూడా నిజంగా చాలా మంచివి. Writ సమాచారం వస్తే అప్పుడు ఏమి చేస్తాడు? న్యాయమూర్తి కళ్లు మూసుకుని యూనివర్శిటీకి వ్యతిరేకంగా ఆయనే judgment

Sri A. Kaleswara Rao] [22nd September 1955

ఇవ్వాలి. బహుశః నేనుండడానికి వల్లకాదని ఇంకోచోటికి transfer చెయ్యాలి తన దగ్గర కేసు దాఖలైతే. కాబట్టి న్యాయశాఖకు Headగా ఉన్నాయనను తీసుకువచ్చి ఆర్థికనీతి, రాజకీయ policy లతో మిశ్రితమైయున్న ఈ యూనివర్శిటీకి ముడి పెట్టడం సమంజసంగా లేదు. విద్యావిధానం విషయంలో అనేక సమస్యలుత్పన్నమవుతున్నాయి. Hindi పెట్టాలా, Sanskrit పెట్టాలా, ఇంకేం పెట్టాలి, విశ్వవిద్యాలయాలకి ఎంత ఇవ్వాలి, అనేటటువంటి వివాదాలన్నీ Chief Justice గారి నెత్తిమీద పెట్టడంలో నిజంగా మనం మంచి పనిచేయలేదనే నేను గట్టిగా చెప్పవలసి యుంటుంది. University Grants Committee వచ్చిందన్నారు. Chief Justice గారు పరుగెత్తుకుపోగలరా ? ఆయనక్కడ Court లో పని చూచుకుంటూ ఉండవలసినదే. కాని గవర్నరుగారు ఎక్కడికి వడితే అక్కడికి సంచారం తిరుగుతూ యుంటారు. అందువల్ల Grants Commission వచ్చిందనటం తోనే గవర్నరుగారు మన తరపున వారి దగ్గరకు వెళ్ళి represent చేస్తారు. గవర్నరు గారు మనతోటిపాటి వాడే నేను గవర్నరు గారికి Chief Justiceగారికిచ్చినంత గౌరవంకూడా ఇవ్వను. ఎందువల్లంటే ఈయన మనలో వాడు. మనకు Head. ఇది చాలా ముఖ్యమనీ, ఇదేమీ పార్టీ question కాదనీ, మీరంతా దీన్ని support చేయమనీ కోరుతున్నాను. ఇంకా డబ్బు విషయంలో చెబుతూ ఏదో Commercial అన్నారు. నాకు ఒక అనుభవం ఉన్నది. ఏ మ్యునిసిపాలిటీగాని ఏటా 3 వేలు ఇస్తే దానికి Senate లో సభ్యత్వం ఉంటుందన్నారు. నేను ఆవిధంగా Senate member గా ఉన్నాను. ఇక్కడనప్పుడు కూడా Legislative Assembly తరఫునా, ఇతరత్రాకూడా Senate మెంబరుగా ఉన్నాననుకోండి. అదివేరే సంగతి. ఏ Association గాని, person గాని 5 వేలు ఇవ్వాలని పెట్టారు. 5 వేలు ఇస్తే ఇచ్చినవాళ్ళకు Senate membership ఉంటుంది. మనం District Board లలోంచి ఎటువంటి వాళ్ళని మెంబర్లుగా పంపుతున్నాం? వీరికంటె ఈ డబ్బిచ్చే వాళ్ళంతా వట్టిపనికిమాలినవాళ్ళా, తక్కువ వాళ్ళా? వీళ్లు యూనివర్శిటీని చెడగొట్టే వాళ్ళా? District Board లలో ఏమి చేస్తుంటారంటే మంచివాళ్ళందరినీ వైస్‌ప్రెసిడెంటుగా ఉంచి, ఎందుకూ పనికిరానివాళ్ళను యూనివర్సిటీకి ప్రతినిధులుగా పంపుతూయుంటారు: కనుక డబ్బు విషయంలో వాళ్లు పెట్టినటువంటిది చాలా న్యాయమైనటువంటిది. ఇంక Privileges అన్నారు. Privileges ఏమి ఉన్నాయక్కడ? Privileges అంటే arrest లు, judicial proceedings, Criminal లి ఎన్నో యున్నవి. అవన్నీ ఏమి ఉన్నా అక్కడ మామూలుగా కూర్చుంటారు. Majority ప్రకారం

ఏమి చెయ్యాలో అది చేస్తూ ఉంటారు. కాబట్టి Privilege అనేది special గా పెట్టి గడబిడ చేశారు. అది అంతా తీసేసి ఈ వెంకటేశ్వర యూనివర్సిటీకూడా మన ఆంధ్రా యూనివర్సిటీ level లోకి తీసుకువచ్చినందుకు విద్యా మంత్రి, ముఖ్య మంత్రిగా యున్న గోపాలరెడ్డిగారిని నేను అభినందిస్తూ ఇది మీరు ఏక గ్రీవంగా pass చెయ్యాలని కోరుతున్నాను.

*SRI K. SUBBA RAO :—అధ్యక్షా! ఈ విశ్వవిద్యాలయ సవరణ చట్టాన్ని సంపూర్ణంగా హృదయపూర్వకంగా నేను ఆమోదించుచున్నాను. పోయినసారి శాసనసభ్యులు వెంకటేశ్వర విశ్వవిద్యాలయ స్థాపన గురించి తీర్మానం చేసినందులకు సభ్యులను అభినందిస్తున్నాను. ఈ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం కావాలని మొట్టమొదటగా కలగన్న పెద్దమనిషి ఆంధ్రదేశంలో చాణక్యుడంతటి వాడు. ఆంధ్రరాజ్య పాలనలో ప్రతిభావంతుడైనటువంటి పానగల్ రాజా గారు. ఆయనే దానికి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అని పేరుపెట్టింది. ఇక్కడున్నటువంటి చాలామంది సభ్యులు ఇంకా పుట్టకముందే మొట్టమొదటిసారిగా శ్రీ పానగల్లు రాజాగారు యీపనికి పూనుకున్నాడు. కె. శ్రీనివాస అయ్యంగారు నాడు Law Member గా ఉండేవారు. 20 లక్షల రూపాయలు మహంతు దగ్గర తీసుకుని విశ్వవిద్యాలయం పెట్టవలెనని, పత్రం వ్రాసేటప్పుడు ఒక పెద్దమనిషి వచ్చి మహంతును భోజనానికి పిలుచుకొనిపోయి మళ్లీ మహంతును కనబడకుండా చేశారు. ఆ కారణం చేతనే వెంకటేశ్వరా యూనివర్సిటీ బిల్లుకు బదులు వెంకటేశ్వర దేవస్థాన చట్టము వచ్చిందప్పుడు. అప్పటినుంచీకూడా ఒక విశ్వవిద్యాలయం కావాలని దానికొఱకు ఆంధ్రులు అహరనిహస్సులు తపస్సు చేశారు. ఆ తపస్సు ఫలించింది కొన్నాళ్ళకు. కాని అది ఫలించినప్పుడు ఆ ఆవేశంలో "మూగారిః తృతీయః ఫంథా" అన్న విధంగా ఆదినం మూడవ పంథాగా ఏ విశ్వవిద్యాలయానికి కని విని ఎరగనటువంటి Chief Justice గారిని Chancellor గా తీసుకువచ్చినప్పుడు, ఆ ఆశతో ఉన్నటువంటి వాళ్లకు కొంత నైరాశ్యం కల్గింది. కారణం లేకుండాపోలేదు. అది నేను చెబుతాను. ఇంతవఱకూ శ్రీ రమణయ్యనాయుడుగారున్నూ, కాళేశ్వరరావుగారున్నూ చెప్పినట్లు ధర్మమూర్తులకు న్యాయవిచక్షణాశక్తి ఒక్కటే యుంటుంది. వారికి పరిశీలనాశక్తి లోపం. వారిదగ్గరకు వచ్చింది చట్టప్రకారం పరిష్కారం చేస్తారు. వారు చూచేది చట్టం ఉందా లేదా అని. ఏదైనా న్యాయమని తోచినా చట్టం లేనప్పుడు న్యాయం చెయ్యడానికి అధికారంలేదు వాళ్లకు. అందుచేత వారిని పెద్దగా ఒకచోట పెట్టి పూజించదగినవారేకాని, పరిపాలనాధికారం వారిచేతికిచ్చి ఈ ఎగుడు దిగుడులలో, ఆ ఆవేదనలో, ఆవేశంలో, అవాంతరంలో అప్పుడప్పుడు వచ్చేటటువంటి

[illegible] పెట్టి మీరు తీర్మానం చేయవలసివస్తే చాలాకష్టమవుతుంది. అది లేకుండా ముఖ్యంగా గవర్నరుగారంటే రాజ్యవ్యవహారాలు చక్కగా తెలిసినటువంటివారు గనుక, పరిపాలనలో ఆయన భాగదారి గనుక, రాజ్యంయొక్క మంచిచెడ్డలన్నీ తెలియటంచేత అతను రెండు విశ్వవిద్యాలయాలే కాదు, మూడు విశ్వవిద్యాలయాలకు అధికారిగా ఉండినప్పటికిన్నీ అన్నీ చూచి, అందరికీకూడా సౌకర్యంగా యేర్పాటు చెయ్యడానికి తగినటువంటి శక్తి కలిగి, ఉచితమైన సలహా మంత్రులకిచ్చి పరిపాలించి అధికారం చేయగలరు. కాని పెద్దలు చెప్పవచ్చు, ఏదో యూనివర్శిటీ కమిషన్ వాళ్లు వ్రాసినారు. ఇది పరీక్ష చేసి, అట్లు ఉంటే బాగుంటుందని, న్యాయవేత్తలు, విద్యావేత్తలు కొంతమంది వ్రాసినారే గాని నిజంగా Chief Justice గారిని అడగండి. ఈ బాధ నాకెందుకు అంటున్నారు. వాళ్ళకు ఇది బాధగా కనబడుతుంది. ఎందుకంటే nominations సందర్భాలు వచ్చినప్పుడు ఎవరు అనేది తెలియదు వాళ్లకు. మంత్రులను అడగడానికి వాళ్ల గౌరవానికి భంగం. మంత్రులను అడిగి చేయకూడదు గనుక నాకు తోచినట్లు నేను చేస్తాననే ప్రయత్నం జరుగుతుంది. ఈకారణాలే కాకుండా, క్రొత్తగా ఏర్పడినటువంటి విశ్వవిద్యాలయం అన్నివిధాలా అభివృద్ధి చెందడానికి పరిపాలనాధికారం కల్గినటువంటి అధికారి అక్కడుంటే చక్కగా జరుగుతుందని నమ్ముతున్నాను. మంత్రిగారు కొంత విలంబన చేసినప్పటికీ, రాయలసీమలోని చాలా మంది మేమంతా కూడా ఈ సవరణ అవసరం. ఈ మూడవ పంథా మాకెందుకు తెచ్చిపెట్టినారు; గవర్నరుగారిని అధికారిగాపెట్టి మంచిచెడ్డలు చూడమంటే బాగుంటుందని అనేకసార్లు చెప్పాకోగా ప్రభుత్వంవారిప్పుడు ఈ సవరణ తెచ్చినారు. దానికి వారిని అభినందిస్తున్నాం. వెంకటేశ్వర విశ్వవిద్యాలయం అభివృద్ధి కావాలనే కోరిక సర్వులూ వెలిబుచ్చినారు. ఆ కోరికకు అడ్డంకు న్యాయాధిపతి ఎక్కడ కూడ కదలకుండా, మెదలకుండా కూర్చునేవారు, ప్రజలతో తిరిగి వ్యవహారంచేసే, పదిమందిని ఆశ్రయించి, లేదా పదిమందిని ఆదరించి పని జరిపేవాళ్లుంటే అభివృద్ధికి అవకాశం వుంటుంది. ఆ ఒక్క కారణం తప్పితే న్యాయమూర్తులు ఉండరాదని కాదు. న్యాయమూర్తులు న్యాయపరిశీలకులుగా ఉండవలసినదే. కాని ఈ బాధలన్నీ పెట్టుకునేది మంచిది కాదని నా అభిప్రాయం.

ఇంకా 25 వేల రూపాయల సవరణ ఉంది. వెంకటేశ్వర్లుగారికి అభ్యంతరం లేదనుకొంటాను. ధనవంతులను తీసుకొనివచ్చి ఇక్కడ ఇమిడ్చి వారిని ఏదో ఒక రూపంగా దోపిడి చేయడానికి మాత్రమే ఈ సవరణ. దానినివాండ్లు దోపిడి

అంటారు. లేకపోతే మేము వాండ్లను గౌరవపూర్వకంగా ఒకసారి మీరు పెద్ద senate లో పని ఇస్తాము. Senate లో భాగదారిగా ఉండవచ్చును. మీ జీవితములో విశ్వవిద్యాలయంలో అయిదు సంవత్సరములు భాగస్వామిగ ఉండవచ్చును. నీ ఆస్తిలో 20 వేల రూపాయలు ఇమ్మంటే, ఇచ్చేటటువంటి వాండ్లు ఉంటారు. కనుక దోపిడి అనే భావం వారు చెప్పినా మేము ఒప్పుకోము. కాని మేము ధనవంతులకు నచ్చ చెప్పి, వాండ్లు చేసే పని మేము చేస్తున్నాము. పూలమాలలువేసి ఎట్లా పెద్ద మనిషి అంటున్నామో, అట్లానే Senate member పని ఇచ్చి, నీవు సంపాదించిన ధనంలో కొంత ఇమ్ము, విద్యాదానానికి సంబంధించినది. దానాలలో విద్యాదానము శ్రేష్ఠము అని వాండ్లకు చెప్పే ప్రయత్నం జరుగుతూ ఉన్నది. ఇంతవరకు చిన్నచిన్న Municipality లలో కూడ హిందూపురంలోకూడ నేను మూడువేల రూపాయలు ఇప్పించాను. ఎవరు సభ్యులుగ ఉండినా, Municipality నుంచి ఇచ్చిన 3 వేల రూపాయల వృధా ఖర్చుకు కాదు. కావలెనంటే మీ Municipality తరఫున ఒక మనిషిని పంపించడానికి అవకాశం ఇస్తాము. పంపించమంటే ఉత్సాహం కలుగుతుంది. ఉల్లాసంతో వాండ్లు కొంత డబ్బు ఇస్తారు. లేకపోతే ఇవ్వడానికి వీలులేదు. ఏదో ఇది గవర్నమెంటుపని, మా కెందుకు అని చెప్పేటటువంటిదిగా వుంటుంది. ఇట్లా పదిమంది దగ్గరనుంచి విశ్వవిద్యాలయము సర్వవిధములా, సర్వోత్కృష్టముగ అభివృద్ధిచెందడానికి కావలసినటువంటి డబ్బును సంపాదించడానికి ఇది ఒక ఎత్తు కనుక దీనిని అడ్డగించితే, దానినుంచి నష్టం ఎక్కువగా ఉంటుంది. దానివల్ల దీనికి ఎవరు అడ్డం చెప్పరనుకొంటాను. ఇంకా privilege అని ఏమో అన్నారు. పురమే లేని వాడికి అంతఃపురం ఎక్కడిది? ఇక్కడ సభ్యులకు privileges ఏమి ఉన్నాయి? వస్తారు, వెళ్లిపోతారు. బత్తా తీసి రెడీగా పెట్టిఉంటారు. శాసనం. పెద్దమనుష్యులు అంతా కూర్చొని దానిని వ్యవహారం చేసేప్రయత్నం అది. కనుక Privileges Committee అన్న తరువాత ఆ privileges కి అడ్డుపడేవారు ఒకడు పుట్టుతుంటాడు. లేనిది మీరు చేస్తారు. లేని privileges చేస్తూ లేకపోతే అనవసరంగా నేను సెనెటుకు వస్తూంటే, నా privilege భంగమైంది, నాకు అడ్డము పడినాడు, ఇకమీదట నాకు ఎవడు చోవ యివ్వలేదు, అని ఏదో ఒకటిచెప్పి వ్యవహారం చేయడానికి అవకాశం మేము కల్పనచేసి ఇచ్చినట్లు అవుతుంది. కనుక లేని పోని బెడద తెచ్చి పెట్టుకోనేదానికంటే దానిని తొలగించితే బాగుంటుంది. కనుక ఈ మూడు సవరణలను ఒప్పించుకొని అందరి అభిమానంతో మంత్రిగారు కోరినట్లు అందరూ మంజూరు చేస్తారని ఆశిస్తున్నాను. తరువాత వెంకటేశ్వర విశ్వవిద్యాలయ అభివృద్ధికి సర్వులు ప్రయత్నపడి దానిని ఈ ప్రాంతప్రజల ఉన్నత విద్యాభివృద్ధికి తగినటు

వంటి వసతులకు సర్వులుకూడ ఆశించి చక్కగా అభివృద్ధి పెంపొందింప చేయాలని ప్రార్థనచేస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

* SRI VAVILALA GOPALAKRISHNAYYA:—అధ్యక్షా, ఆంధ్రకు ఎప్పుడు ప్రత్యేక పరిస్థితులే ఉన్నాయి అని శ్రీకల్లూరి సుబ్బారావుగారు చెప్పారు. తృతీయ పంథా మురారిపంథా ఎందుకు అవలంభించారంటూరా ? Padmanabha Raju గారు చెప్పతూ పశుబలముతో ఆపోటుచేసుకున్నారు అన్నారు. అంటె మీవైపు పశుబలంతోనసే పశువైద్యానికి సంబంధించిన అధికారిని, ఆంధ్రదేశం మురారిని తెచ్చుకొన్నది. అందువల్ల మనం మురారిపంథాను అవలంబించాము ఇక్కడ.

రెండవది మనకు ఒక ప్రత్యేకత ఉంది. ఎందువల్ల అంటే ఏరాష్ట్రము లోను లేనటువంటి ఉపముఖ్యమంత్రి మనకు ఒకడు ఉన్నాడు. అది ఎక్కడ ఏ రాష్ట్రములో precedent ఉందో చెప్పితే సంతోషిస్తాను. లేకపోతే ఎందుకు తీసుకువచ్చారు ?

MR. SPEAKER : It is not relevant.

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—మన ప్రత్యేక పరిస్థితులలో అనేకమైన క్రొత్త ఉద్యోగాలు పదవులు సృష్టించినట్లే High Court జడ్జీఉంటే బాగుంటుంది అని తలచాం. ఇంకా పైగా వెంకట్రమణయ్యగారు చెప్పతూ ఒకమాటచెప్పారు. ఇదివరకు మద్రాసు జడ్జీని మద్రాసువిశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షుడుగా వేస్తున్నారంటే చాలచిక్కు వచ్చిందట. ఆయన advice ఇస్తానని ఒప్పుకొన్నాడు Legal advice ఇవ్వడానికి ఆయన ఒప్పుకొన్నాడుగనుక పెద్దమనిషిగ నేనే ఇస్తానన్నాడు. అసలు ఆయనను legal advice ఏలా అడుగుతారు? ఒక public prosecutor ఒక కమిటీలోఉంటే ఆయన దానిలో ఉన్నాడు కదా అని ఆయనను legal advice అడుగుతామా ? ఆ సంస్థకు నిర్ణీతమైన లీగల్ సలహాదారుండాలి. ఆయననే అడగాలి. అదేమి సమస్యకాదు. ప్రధానంగా పెట్టింది ఏమిటంటే వాండ్లు ఎవరు ఉండకూడదని Kaleswara Rao గారు సుబ్బారావుగారు అన్నారు. అట్లాగైతే మారిస్ గ్వయర్ ఎందుకు డిల్లి విశ్వవిద్యాలయానికి Vice Chancellorగా తీసుకొనివచ్చారు ? అది తప్పయితే మాని వేసి ఉండాల్సింది. కాని అది ఏమి bar కాదు. ఇక్కడ ఉండే సౌకర్యాలు ఎట్లా వుపయోగపడుతుంది అనే విషయం ఆలోచించవచ్చుగాని వాండ్లను పెట్టడమే పనికిరాదు. వాండ్లను తీసుకొనివచ్చినపుడు నష్టం అవుతుంది. వాండ్లు ఏమో

ముట్టుకోనివాండ్లు అని అంటేమాత్రం—ఇదివరకు precedents వున్నాయి. దానిని గురించి మనము ఇంకా ఆలోచించవలసిన అవసరం లేదు. ఆరోజు శాసనసభలో జరిగిన పరిస్థితులలో administrative and executive difficulties ఉన్నవని అన్నారు. Executive difficulty అంటే ఏమి అనకొంటామంటే ఏ ఆఫీసరును వేయాలని ప్రశ్నవచ్చినపుడు మొట్టమొదట Rangathama Rao గారిని వేయాలని అనకొన్నారు. ఎప్పుడైతే Chief Justice వచ్చాడో అప్పుడు కథ అడ్డం తిరిగిపోయి ఇంకొకరు రావడం జరిగింది. మంత్రివర్గంకేమీ అధికారం లేకుండా పోయింది. అట్లాంటి ఇబ్బందులువస్తున్నవి కనుక మేము మార్చుకోవాలని ప్రయత్నంచేస్తున్నాము. ఇది పనికిరాదని చెప్పేటట్లయితే అది administration difficulty కాకుండా executive difficulty వస్తుందంటే, బహుశా అది నిజమే కావచ్చునేమో ? అందువల్ల నేను మనవిచేసేది, ఈవేళవున్న పద్ధతిలో విశ్వవిద్యాలయంలో ఆరోజు అందరి అభిప్రాయం ఏమిటంటే Residential University గ వుండి తరువాత affiliation తీసుకోవాలనే అభిప్రాయం ఆలోచించే జరిగింది.

దానికి ఎవరిబలం ఎటుంటే అటులా గారు. ఎవరికి ఏవిధంగాతోస్తే ఆ ఆవిధంగా వ్యవహరించారు. దానిలోమాత్రం దాపరికం ఏమి అక్కరలేదు. ఇది చరిత్రలో వున్నభాగం. అందువల్ల ఆరోజు Chief Justice ను తీసుకొని రావడానికి కారణం Residential University ఒప్పుకోండి అని ఒప్పుకున్నవాండ్లుకూడ ఒత్తిడివల్ల జారిపోయారు. కనుక ఎక్కడపెట్టునామంటే, ఏ వైపునుంచి అంటే, ఆవైపునుంచి వచ్చారు. దీనిలోనష్టం ఉండవచ్చును. కాని నష్టం ఆవిధంగాలేదు. ఈవేళ గోపాలరెడ్డిగారు, కాశేశ్వరరావుగారు, ఏమిచెప్పారంటే డబ్బుసంపాదించటానికి చాలా ఇబ్బంది అవుతుందని. నేను మనవిచేసేది ఏమిటంటే ఈ amendment తీసికొనివచ్చినపుడు ఆంధ్ర University కి ఎంతనష్టం వస్తుందో అది మీరు ఆలోచించండి. Pro-chancellor మీరు రెండింటికి ఉన్నారు. రేపు Chancellor రెండింటికి ఒకరిని చేయబోతున్నారు. ఆంధ్ర University ని starve చేసి, కొత్తగా వచ్చిందికదా, అనిచెప్పి దానిని గనుక మేపడం మొదలుపెట్టితే అపుడు ఇంకో Chancellor వుంటేనే ఉపయోగం అనే అభిప్రాయం విద్యావేత్తలందరికికూడ కలగటానికి అవకాశం వుంటుంది. అట్లాంటిప్రమాదం లేకుండావుండే పద్ధతితోటిమాత్రం ఈ తీర్మానం ఎట్లు గెలుస్తుందో? మేమువద్దన్నా, కద్దన్నా గెల్చేదేఅది. కాని ఈప్రమాదాన్ని మాత్రం మీరు గుర్తించవలసివుంటుంది. మనము పోషించిన సంస్థ ఒకటి ఉంది, మళ్లీ పోషించవలసిన

సంస్థ ఇది. అందువల్ల దీనినిమాత్రం మార్చమని చెప్పడం లేదు. కాని దీనిని పోషించేందుకు కావాలసిన పద్ధతిలో, దానికి దీనికి కావలసివచ్చినప్పుడు, అని ఏమన్నా పెరిగి ఉంది. అభివృద్ధి అయినటువంటి సంస్థ. నూతన విశ్వవిద్యాలయం బాల్యావస్థలో వుంది. కనుక దానితోపాటు వచ్చేంతవరకు నీవు ఆగు. ఇక్కడ పెరిగినవాడవు. నీకు ఏమైనా భోజనం పెట్టితే పరుగెత్తగలిగినావు. కనుక కుర్రవాణ్ణికూడా పరుగెత్తనియ్యి. వాడు కడుపునిండా తిండి తిని బాగా పరుగెత్తటానికి నీ అంత ప్రాయం వచ్చినప్పుడు, నీ అంతా యౌవనం బలం వచ్చినప్పుడు అప్పుడుకూడా కుంటుకుంటూ వచ్చి నడుస్తాడు. కనుక ఆవిధంగా ఆగు 'ఆంధ్ర University', అని చెప్పేను. దానిని తీసుకొనివచ్చే ప్రాతిపదిక అందులో ఉందేమో అని నా భయం. బిల్లు ఉద్దేశ్యాలలో చివర ఒక మాట అన్నారు. ఆ విషయం వివరంగా చెప్పవలసివుంది. Duplication of effort ఉండకూడదు అన్నారు. అది లేకుండా చేయటానికి చేస్తున్నాము అంటున్నారు. ఆరోజువచ్చిన సమస్యకూడా అదే ఆంధ్రవిశ్వ విద్యాలయములో దానిని నకలు చేయవద్దు. అక్కడ ఏ facility ఉంటుందో, ఏఏ విద్యావిధానం ఉంటుందో అవి మరి ఇక్కడ పెట్టకుండా, ఇది ప్రత్యేకంగా ఒక పద్ధతితోటి అక్కడ ఒక పద్ధతితో చేస్తే ఆంధ్రదేశంలో సమగ్రమైన అనేక విద్యావిధానాలు విజ్ఞాన విధానాలు పెట్టడానికి వీలు అవుతుంది. Science, art గాని విడివిడిగా పెట్టడానికి దానిని చేస్తే బాగా ఉంటుంది. Humanities కి సంబంధించిన విద్య దీనిలో పెంచండి. ప్రాచ్య విద్యావిధానము నెలకొల్పండి అని ఆ రోజు చెబుతున్నాము. మనము చేసిన duplication రాకుండా ప్రయత్నంచేస్తే చాలా సంతోషం అవుతుంది. లేకపోతే దానికి నకలు అయి ఒకదానికొకటి పోటీ అవుతవి. రెంటికి యిద్దరు Chancellors వుంటే ఆ విధంగా ఉపయోగపడుతుందేమో దీర్ఘంగా ఆలోచించండి.

**3-30 p. m.**

దాని తరువాత, అనుకొన్నటువంటి set up అంతాకూడా తలక్రిందులైంది గవర్నమెంటుకు దానివల్ల ఇబ్బందిపడ్డాము కాబట్టి ఈ విధంగా వెంటనే దాన్ని సద్దుకోవడానికి వీలున్నదని అంటున్నారు. విద్యావిధానంలో సద్దుకోడానికి ప్రయత్నిస్తున్నామంటే, ఈ మార్పుచేయడం న్యాయమేగాని, మీరు వెయ్యదలచుకొన్నటువంటి ఉద్యోగులను వెయ్యడానికి అడ్డువస్తున్నారు. గనుక దాన్ని ఆ విధంగా మార్చుకోడానికని, ఆ మొత్తం చెప్పితే బాగుండదని ఈ వైపుకుంచి, ఇంకో విధంగా చెప్పి మార్పు తీసుకువస్తేమాత్రము అది fair గాను న్యాయం గాను అని మనవి చేస్తున్నాను. జరిగిన చరిత్రం అంతా వెనుక ఉన్నది. ఆ విధంగా చేయండి అని చెప్పి, వారు తీసుకువచ్చిన ఈ ఆమోద తీర్మానాన్ని oppose చేస్తున్నాను.

22nd September 1955]

SRI K. PUNNAYYA :—అధ్యక్షా! మన Chief Minister గారు తెచ్చినటువంటి ఈ సవరణను బలపరుస్తున్నాను. అయితే ఈ సవరణవల్ల Chief Justice కు అపచారము చేసినటువంటివాళ్లుగా భావించరాదు. ఎందుచేతనంటే, వారికి ఇవ్వవలసినటువంటి మర్యాద, గౌరవము, అన్నీకూడ మన ప్రభుత్వము ఇస్తూనే ఉన్నది. ఇస్తుందికూడాను. అందుచేత, అటువంటి అభిప్రాయము మనశాసనసభ్యులలో ఎవరికికూడా ఉండకూడదు, ఇక్కడ financial aspect చాలా ముఖ్యమైనది. యూనివర్సిటీ సర్వతో ముఖాభివృద్ధికి ఈ financial aspect చాలా అవసరం కాబట్టి ఇటువంటి అవసరాన్ని గుర్తించి మన గవర్నరుగారిని Chancellor గా ఇప్పుడు ఏర్పాటుచేసుకోవడం చాలా సంతోషమైనటువంటి విషయము. అయితే ఇందులో మనమిత్రులు చెప్పినట్లు, administrative difficulties లేక executive difficulties ఉండడంబట్టి ఇటువంటి ఏర్పాటుచేస్తున్నారనే ఒక భావన ఉన్నది. అయినప్పటికీ, అన్నీకూడ దృష్టిలో పెట్టుకొని ఈ విధంగా ఏర్పాటు చేసుకొన్నందుకు మనం సంతోషపడాలి. ఈ ఏర్పాటు యూనివర్శిటీ అభివృద్ధికి ప్రతిబంధకంగాకూడ ఉంటుందేమోనని మనమిత్రులు వినిపించారు. అటువంటి ప్రతిబంధకం ఉండుటకు అవకాశం లేదు. ఉండదు కూడాను. ఎందుచేతనంటే, ప్రజలలో చైతన్యం ఉన్నది. ప్రజలు, శాసనసభ్యులు అందరుకూడాను ఈ విషయాన్ని చాలా జాగ్రత్తగా కనిపెడుతూ ఉన్నారు. అటువంటప్పుడు, ఈ ప్రతిబంధకం ఉంటుందని ముందుగానే సందేహించడం అనవసరము. అటువంటిది ఉంటేమాత్రము, తప్పకుండా,. శాసనసభ్యులు, ఆంధ్రప్రజలు అంగీకరించరు అని చెప్పుతూ విరమిస్తున్నాను.

Sri P. SUNDARAYYA :-అధ్యక్షా! ఈ సవరణ బిల్లును ప్రభుత్వముతీసుకు రావడంలో, వారు జాగ్రత్తగా ఆలోచించి తీసుకురాలేదని చెప్పవలసి యుంటుంది. ఈరోజు తిరుపతి వెంకటేశ్వర విశ్వ విద్యాలయానికి Chancellor గా Chief Justice ఉన్నప్పుడు వారినికాదని, గవర్నరును ఉంచాలనే సవరణ తీసుకురావడం అనవసరమైనటువంటి అపోహాలకు దారి తీస్తున్నది. అంతేకాదు, ప్రధాన న్యాయమూర్తి పనిచేసేవారు ఈ పదవికి పనికిరారు అనే అర్థం ఇచ్చేరీతిగా ఇది ఉంటున్నది. ఇంతకుముందు ఏమి జరిగిందో దానికి ప్రతీకారంగా చేయాలనే దృష్టితో ప్రభుత్వము దీనిని తెచ్చినట్లు ఉన్నది గాని దానివలన ఈరోజు కలిగే దుష్ఫలితాలను గురించి ఆలోచించలేదు. అందుచేత, తొందరపడి ఈ బిల్లును తెచ్చారని చెప్పక తప్పదు. ఈ బిల్లును తీసుకురావడంలో, ప్రధాన న్యాయమూర్తిగా ఉన్నవారు ఈ విశ్వవిద్యాలయ పరిపాలనను సక్రమంగా నిర్వహించలేదు అనేటటు

వంటి కారణాలు తెస్తున్నారు. ఇవన్నీ అసంబద్ధమైన కారణాలని, విశ్వవిద్యాలయం గురించి ఏ మాత్రం తెలిసిన వారైనా, దానితో ఏ మాత్రం సంబంధం ఉన్నవారైనా చెప్పక తప్పదు. Judge అయితే పని ఎక్కువ అని, న్యాయమూర్తి అయినవారు, ఈ విశ్వవిద్యాలయముయొక్క పనులకు తగినంత కాలము వినియోగించలేరని, అందు చేత దానికి ఎక్కువ కాలము వినియోగించ కలిగినటువంటి గవర్నరుగారిని Chancellor గా పెడతామని చెప్పి ముఖ్యమంత్రిగారు ఒక కారణంగా చెప్పారు. ఇది ముఖ్య మంత్రిగారు చెప్పారు. కాశీశ్వరరావుగారుకూడా చెప్పారు. ఈ కారణం నిజమైనట్లయితే, Chancellor పదవికన్నా Vice Chancellor పదవిలో ఇంకా ఎక్కువ బాధ్యత ఉన్నది. Vice Chancellor విశ్వవిద్యాలయంయొక్క పరిపాలనలో రోజురోజుకు executive head గా ఉంటారు. అటువంటప్పుడు, ప్రధాన న్యాయమూర్తిగా ఉన్నవారు Chancellor గా, విశ్వవిద్యాలయ అభివృద్ధి కోసం తగినంత కాలాన్ని వినియోగించలేరు అనే కారణం సరికాదు. ఢిల్లీ విశ్వవిద్యాలయం ఆరంభించినప్పుడు, దాన్ని ఎంతో పెంపొందించవలసిన భాధ్యత ఉన్నప్పుడు, ఆరోజు Federal Court Chief Judge గా ఉన్నటువంటి మారిస్ గ్వయర్ గారిని దానికి Vice Chancellor గా చేశారు. వారు Federal Court Chief Judge గా ఉంటూ కూడ ఆ విశ్వవిద్యాలయాన్ని Vice Chancellor గా కొత్త పథకాలతోటి ఎంతో అభివృద్ధిచేసినట్లు మనకు తెలుసును. అందుచేత Vice Chancellor గానే వారు అంత పని చేయగలిగినప్పుడు ప్రధాన న్యాయమూర్తిగా ఉన్నంత మాత్రమున దీనికి తగినంత కాలమును వినియోగించలేరు అనే వాదనటి అర్థము లేని వాదనగా కన్పడుతుంది.

ఇంకొక కారణంగూడ చెప్పారు. Writs వేయడానికి వస్తే, అప్పుడు Judge గారు ఇక్కడే కూర్చొన్నట్లయితే వారికి చాలా క్లిష్టదశ వస్తుందని రమణయ్యగారు మద్రాసు ఉదాహరణ తెచ్చారు. అది ఎందుకు తెచ్చారో తెలియడం లేదు. Chancellor కు ఏదో ఎప్పుడైనా nominations చేసేదానికిని, Convocation చేసే సందర్భములో, పట్టబద్రులకు పట్టాలు ఇచ్చే సందర్భంలో అధ్యక్షులుగా ఉండడానికిని, Senate, Syndicate సభలు జరుగుతున్నప్పుడు, వాటికి అధ్యక్షత వహించేదానికిని హక్కులు ఇచ్చినాము. ఇంతకన్న ఎక్కువ బాధ్యతలు ఉన్నటువంటు Vice Chancellor గా ఉండిన Mauris Guyer గారికి ఈ Writs సమస్యగాని, ఇంకొక అభ్యంతరంగాని రాలేదు. అటువంటప్పుడు ప్రత్యేకంగా ఇప్పుడు ఈ తిరుపతి విశ్వవిద్యాలయం విషయంలో Chancellor గా ఉంటున్న న్యాయమూర్తికి ఈ writs సమస్య ఎందుకు రావలసి వచ్చిందో నాకు అర్థం కావడంలేదు.

అంతేకాకుండా, మరొక హాస్యాస్పదమైన కారణం తీసుకువచ్చారు. గవర్నరు Chancellor గా ఉండినట్లయితే, వాళ్ళతో వీళ్ళతో, సంప్రతించి డబ్బు తీసుకురావడానికి అవకాశం వుంటుందని, న్యాయమూర్తికి ఆ అవకాశం ఉండదన్నట్లుకూడ చెప్పారు. అయితే ఈ విషయంలో ఒకటి అడుగుతాను. అసలు గవర్నరు రోజు రోజుకు రాజకీయాలలోగాని, పరిపాలనా వ్యవహారములలోగాని, వారేమి జోక్యము కలిగించుకోకూడదు. వారు కేవలం మంత్రి వర్గము ఏరీతిగా చెప్పితే ఆరీతిగానే వుండాలని అన్నారు. వారు గవర్నరు హోదాలో వున్నంతకాలము ఆ హోదాలో తప్ప మరితర ఏ పదవిలోకూడ వారు వుండకూడదు. రాజ్యాంగ చట్టం ప్రకారం, ఆ spirit తో చూచినట్లయితే వారు ఇంకొక పదవి తీసుకోవడం చాలా పొరబాటు అవుతుంది.

THE HON. SRI B. GOPALA REDDI :—ఎందుకు ?

SRI P. SUNDARAYYA :—ముఖ్యమంత్రిగారు Chief Justice విషయంలో ఆ వాదన తెచ్చారు కాబట్టి, నేను ఈ వాదన తెస్తున్నాను. ప్రధాన న్యాయమూర్తిగారు న్యాయవిచక్షణ, న్యాయం చేయడం తప్ప ఇంకొకపదవి తీసుకోకూడదనే వాదన తెస్తే, గవర్నరుగారు రాజ్యాంగ చట్టం ప్రకారం, మంత్రివర్గం చెప్పినట్లు చేస్తూ అలంకార ప్రాయంగా వుండడం తప్పితే, మరే పదవి తీసుకోకూడదు. ఎప్పుడైనా ప్రెసిడెంటు తరఫున ఈ రాజ్యాంగ చట్టం ఇక్కడ సరిగా అమలు పరచడంలేదు. కాబట్టి ఈ మంత్రి వర్గమును, ఈ శాసన సభను రద్దు చేయవలసిన అత్యవసర పరిస్థితి ఏర్పడిందని వ్రాసేటప్పుడు మాత్రం మంత్రివర్గం సలహాలేకుండా చేయవచ్చును. మిగిలిన అన్ని విషయాలలోను మంత్రివర్గం చెప్పినట్లు వారు నడుచుకోవలసి యుంటుంది. ఆ పరిస్థితులలో వారిని విశ్వవిద్యాలయానికి Chancellor గా చేయడమంటె అర్థమేమిటి ? వారుచేసే nominations ఇవన్నీ కూడాను వ్యక్తిగతంగా గాక, మంత్రివర్గము సలహాల ప్రకారం చేయవలసి వుంటుంది. అట్లాలేనప్పుడు, రాజ్యాంగ చట్టం ప్రకారం, వారు గవర్నరుగా వున్నంతకాలం Chancellor గా వుండడం అనవసరమని అనిపిస్తుంది. అందుచేత, ప్రధాన న్యాయమూర్తిని Chancellor గా ఒక సారి ఎన్నుకొన్న తరువాత, ఆయనను తొలగించి, దాన్ని అర్థంలేని వాదనలతో సమర్థించుకోవడం ఎవరిని సంతృప్తి పరచలేరు.

అంతేకాదు. ఇంకొకవాదన తీసుకొని వచ్చారు. నామినేషన్ను విషయము. వారికి యిచ్చిన అధికారము నామినేషను కాబట్టి చాన్సలరుగారికి ఎవరెవరు ఎటువంటివారో ఎవరిని nominate చేయవలెనో వారికి తెలియదు. మంత్రివర్గము

Sri P. Sundarayya] [22nd Sep. 1955

recommend చేసినవారిని ప్రధాన న్యాయమూర్తి చాన్సలరుగావుంటే, ఎవరిని nominate చేయాలో వారికి తెలియదు, గవర్నరుగారికి అయితే తెలుస్తుంది, అని ఒకరు అన్నారు. అంటే దానిఅర్థమేమిటి ? మంత్రివర్గము చెప్పినవారినే nominate చేయాలనా ? ప్రధానన్యాయమూర్తి ఆ విధంగా మంత్రివర్గము recommend చేసి పంపిన పేర్లను nominate చేయకుండా నిరాకరించి యింకొకరిని nominate చేయవచ్చు. గవర్నరుగారైతే, వారికి యింక ఎవరూ తెలియరు. గనుక, మంత్రి వర్గము ఎట్లాపడితే, అట్లా, వారి యిష్టప్రకారము గవర్నరుచేత nominate చేయించుకోవచ్చుననా ? ప్రధానన్యాయమూర్తి అయితే అటువంటి నిర్బంధమువారి మీద వుండదు కాబట్టి గవర్నమెంటుగాని యితరులుగాని recommend చేసిన వారిని nominate చేయటానికి వారు అంగీకరించవచ్చు, అంగీకరించకపోవచ్చు. లేదా వారి స్వతసిద్ధముగా యింకొకరిని ఎవరినైనా nominate చేయవచ్చు. కనుక అటువంటి చిక్కులు ఏవీలేకుండా, ప్రధానన్యాయమూర్తి అయితే ఆటంకములు వుంటాయి గనుక, గవర్నరుగారు అయితే అన్నిటికి వీలుగా వుంటుంది అనే భావముతో యీనాడు యీ సవరణ తీసుకొని రావడము యిదేసత్యముఅయితే ఏ పరిస్థితులలోగూడా మీరు ఆరకంగా రాష్ట్రాన్ని మార్పుచేయడానికి తలపెట్టరు. లేకపోతే, యిప్పుడు యీ సవరణ తీసుకొని రావటానికి కారణమేమిటి ?

THE HON. SRI B. GOPALA REDDI :—ఆంధ్ర యూనివర్సిటీకి nominations విషయములో కేవలము Education Minister గారు గాని, లేక Chief Minister గారు గాని చెప్పినట్లుగా చాన్సలరుగారు చేయడములేదు. ఆ యూనివర్సిటీ Vice Chancellor recommend చేసినవారిని, యింకా వారు ఆలోచించుకున్నవారిని, వారు nominate చేస్తున్నారేగాని Education Minister చెప్పినటువంటివారినే వారు nominate చేయడములేదు. ఈ nominations చేసే విషయములో కేవలము మంత్రిగారు recommend చేసేవారినే nominate చేయడమనే సిద్ధాంతాన్ని ఆ చాన్సలరు ఒప్పుకోవడములేదు. అంటే Chancellor కు discretion అనేదివుంటుంది. కొన్ని కొన్ని University Acts లోనే కాదు, ఇంకా Patna లోనూ, అక్కడక్కడకూడా యేమి వ్రాసియున్నదంటే "Chancellor acts in his discretion and not on the advice of the ministry" అనే మాటకూడా Patna వగైరా యూనివర్సిటీ యాక్ట్సులోకూడా ఒక నిబంధనగా వారు పెట్టుకున్నారు. గనుక అటువంటి ప్రమాదము యేమీవుండదని అంటున్నాను.

SRI P. SUNDARAYYA :—అటువంటి ప్రమాదములేదని మన ముఖ్య మంత్రిగారు చెబుతున్నారు. కాబట్టి నాకు సంతోషమే. కాని అటువంటి ప్రమాదాలు యింతవరకు లేకపోవచ్చు. ఇకముందు రావచ్చు. అంటే యీ రోజువరకు ప్రధానన్యాయమూర్తి చాన్సలరుగా వున్నారు. కాబట్టి అటువంటి ప్రమాదాలు రాలేదు. రేపు గవర్నరుగారు చాన్సలరుగావుంటే, అటువంటి ప్రమాదాలురావచ్చు. అదే మనము యీరోజున చర్చించేది. కాబట్టి రేపు గవర్నరుగారు చాన్సలరుగా వచ్చినప్పుడు ఏమిచేస్తారో, వారి discretion ఉపయోగిస్తారో, లేకపోతే మంత్రి వర్గము చెప్పినవారిని యింకా యితరులు చెప్పినవారిని nominate చేస్తారో, దాన్నిగురించికాదు యిప్పటిచర్చ కాబట్టి దాన్నిగురించి చర్చవచ్చినప్పుడు అప్పుడు ఆలోచించవచ్చు. యూనివర్సిటీ చాన్సలరుగా ప్రధాన న్యాయమూర్తిని తీసివేసి గవర్నరుగారిని పెట్టవలసిన అవసరమువచ్చినది. బహుశా, nominations విషయములోనే కొన్ని చిక్కులు వస్తున్నవని కాబోలు. అందుచేతనే యిప్పుడు యీ మార్పు చేయవలసిన అవసరము ఏర్పడ్డది అన్నమాట. అటువంటి సందర్భములో ప్రభుత్వము యిప్పుడు యీ చట్టాన్ని యీ రకంగా తీసుకొని రావడము చాలా దురదృష్టకరమనే చెప్పవలసివుంటుంది. అయితే ఇందులో ఏదో సత్యమువున్నదన్న మాటే. అందువల్ల ప్రభుత్వము తమయొక్క పనులు సాగించుకోటానికి ప్రధాన న్యాయమూర్తి చాన్సలరుగావుంటే వీలువుండదు కాబట్టి, వారు యిచ్చే Judgment మీద విశ్వాసములేక గవర్నరుగారైతే తమ యిష్టము వచ్చినవారిని recommend చేసి పనులు చేయించుకోవచ్చునని యీ బిల్లు తెచ్చారని స్పష్టపడుతున్నది. గనుక యీబిల్లు అటువంటి అపోహలకు దారితీస్తున్నది. అందుచేత యీవాదన సరియైనది కాదని ఉపాధ్యక్షులవారికి చెప్పవలసివస్తున్నది. ఇప్పుడు చాన్సలరుగా గవర్నరు లేనందువల్ల ప్రధాన న్యాయమూర్తిగారు వున్నందువల్ల వచ్చినప్రమాదముయేమిటి ? ప్రధాన న్యాయమూర్తిగారు యూనివర్సిటీకి చాన్సలరుగా వుండడమువల్ల మంత్రి వర్గానికి వచ్చేనష్టము యేమిటో నాకు కనబడడంలేదు. గవర్నరుగారువుంటే వచ్చేలాభాలు, ప్రధాన న్యాయమూర్తివుంటేరావా ? లాభాలువున్నవో లేవో కాని యిదివరకు నష్టముమాత్రము ఒకటి కనబడుతున్నది. ప్రధాన న్యాయమూర్తి యింతవరకూ వున్నవారిని యిప్పుడు తీసివేయడము వారిని అగౌరవపరచినట్లవుతుందని కనబడుతున్నది.

తరువాత ఈ చాన్సలరుపదవి ఒక అలంకారపదవియా ? మంత్రి వర్గమువారు చెప్పిన పేర్లను nominate చేయడము, ఉత్తీర్ణులైన విద్యార్థులకు పట్టాలు యివ్వడము, యిందుకుమాత్రమే అక్కడ పీఠము అలంకరించడముగా కనబడుచున్నది.

లేకపోతే అక్కడి Senateకు Academic Council కు వారు హాజరు అయినప్పుడు, అక్కడ అధ్యక్షపీఠమును అలంకరించటానికి అనేది తప్పితే యింకొకటివుండదని అనుకుంటున్నాను. అందుచేత యీపదవి ఒక అలంకారప్రాయముగా మనం చూస్తున్నాము.

అంతేకాకుండా విశ్వవిద్యాలయములవిషయము వచ్చినప్పుడు, ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు సంబంధించినంతవరకు Pro-chancellor ను Chancellor గారే nominate చేయవలసి వుంటుందని వున్నది. ఇక్కడ తిరుపతియూనివర్సిటీకి Pro-Chancellor గా Education Minister గారే వుంటారని వున్నది. అయితే యీ Pro-Chancellor పనులు యేమిటిఅంటే చాన్సలరు ఏదైనా కొన్నికారణములవల్ల ఆ పనులు నిర్వహించటానికి అవకాశములు లేనప్పుడు, అప్పుడు Pro-Chancellor Chancellor పనులు నిర్వహిస్తారన్నమాట. ఇద్దరు అనసరము లేదన్నమాట. వారువుంటే వీరు అనవసరము లేదు, వీరువుంటే వారు అనవసరము లేదు. ఇద్దరు వుండనక్కరలేదు. ఇద్దరిలో ఎవరో ఒకరు వుంటేచాలు అనుకుంటాను. అప్పుడు Pro-Chancellor వున్నప్పుడు చాన్సలరు అనవసరమేగదా! వీరుగాని, వారుగాని, యిద్దరిలో ఎవరైనా ఒకరు వుండవచ్చు. ఈ యిద్దరుకూడా Pro-Chancellor ప్రభుత్వముతరఫున, Vice Chancellor దాని బాధ్యతవహించటానికి వుంటున్నారు. Education Minister ప్రభుత్వము తరఫున వుంటున్నారు. కాబట్టి nomination లు చేయడము, ఆ బాధ్యత అంతా వారే చూచుకోవచ్చు. ఈ చాన్సలరుపదవి కేవలము అలంకారప్రాయముగా వుండేదిగా తయారవుతున్నది. సరే, అలంకారపదవికి ఎవరువుంటేనేమి? గవర్నరువున్నా ఒకటే, ప్రధానన్యాయమూర్తివున్నా ఒకటే. దానికోసము యిప్పుడు యీ రాద్ధాంతాన్ని అంతా అనవసరముగా తీసుకొనివచ్చి, అనవసరమైన అపోహలకు దారితీసేటట్లుగా ప్రభుత్వము తీసుకొనివస్తున్నారు. ఇప్పుడు యీ సవరణచట్టము తీసుకొనిరావలసిన అవసరము యేమిటి? అయితే select committee stage లో ప్రభుత్వము తరఫునవున్న వారు ఎవరూ మాట్లాడకుండా కూర్చుని, ఆఖరుకు అది యిక్కడ Assembly ముందుకు వచ్చినప్పుడు అప్పుడుమీరు అక్కడ ఓటుచేశారు కాబట్టి యిప్పుడు దీనిని తలక్రిందులు చేయటానికి యీబిల్లు తెచ్చామని చెబుతున్నా రన్నమాటగా కనబడుతున్నది. అయితే అది ఒకవాదనకాదు. ముఖ్యమంత్రిగారు యిలాంటి వాదన తీసుకొనిరావలసినదికాదు. ఎందుకంటే, select committee ముందు సభ్యులు కొన్నికొన్ని పరిస్థితులలో తటస్థముగా వున్నప్పటికినీ, తరువాత వారి అభిప్రాయాలు యిక్కడ ఎసెంబ్లీముందు వచ్చినప్పుడు ఆ విషయము వెల్లడించవచ్చుననే వుద్దేశ్యముతో అక్కడ వూరుకొనివుండవచ్చు. అందులో తప్పేమీలేదు. ఇది

ప్రతిపార్టీసభ్యుడుగూడా చేసేదే. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు సంబంధించినంత వరకూగూడా చాలామంది select committee లో చెప్పినవిషయాలు కాంగ్రెసు సభ్యులుగూడా వారి అభిప్రాయాలకు భిన్నముగావుంటే, తరువాత ఎసెంబ్లీముందు వచ్చేటప్పటికి అభిప్రాయాలు మార్చుకొని, వారికికావలసినప్రకారము ఓటుచేయడము గూడా, కొన్నికొన్ని సందర్భాలలో జరిగినవి. అంతమాత్రముచేత, సెలెక్టుకమిటీ ముందు మీరు మాట్లాడలేదు గనుక యిక్కడ దీన్ని మేము మార్చుతున్నాము మీరు ప్యాసుచేయండి అనేవాదన సరియైనదికాదు. ఆ కారణముచేత యిప్పుడు దీన్ని మార్చుతున్నామని చెప్పేవాదన సరియైనదికాదు.

అసలు ఛాన్సలరు పదవి విషయము తీసుకొనివచ్చినప్పుడు, అసలు executiveకు సంబంధము లేకుండా academic freedom అనేది విశ్వవిద్యాలయముల విషయములో వారి కార్యకలాపాలు సాగించుకొనడానికి స్వేచ్ఛ, స్వతంత్రము అవసరము వుంటుంది నిజమే. కాని అది కేవలము మంత్రివర్గము చేతులలోనే పెట్టుకోవలసినది కాదు. ఆ రీతిగావుంటే, విశ్వవిద్యాలయములలో విద్యాభివృద్ధికొరకు స్వేచ్ఛ లేకుండా ఆటంకము జరుగుతుంది. కాబట్టి యీ Chancellorship అనేది ఒక రాజ్యాధికారాన్ని ప్రతిబింబించేదిగా పెట్టుకుంటున్నామని అనుకున్నప్పుడు వారికి యీ పదవి యివ్వడముకూడా అనవసరమే. ఈ రోజులలో చాలా విశ్వవిద్యాలయాలు ఆ రకంగా చేస్తున్నవి అంటే, దురదృష్టవశాత్తు మన విశ్వవిద్యాలయాలు యీ రూపములో బయలుదేరినవి. ఇవి ఎట్లావున్నవి అంటే వీటిలో, ఎక్కువభాగము బ్రిటిషు సామ్రాజ్యవాదము మనమీద తిష్టవేసుకొని కూర్చున్నప్పుడు ఏరీతిగా గవర్నరును ఛాన్సలరుగాపెట్టి, Education విధానము అంతాకూడా ప్రభుత్వము తన చేతులలో ఒక కీలుబొమ్మగా పెట్టుకొని సాగించారో. అదే సాంప్రదాయము యింకను యీనాడు గూడా జరపాలనే వుద్దేశ్యము ప్రభుత్వమునకు వున్నట్లు కనబడుచున్నది. ఆ సాంప్రదాయము మార్చటానికి ఎవ్వరికినీ ఎట్టి అభ్యంతరము వుండకూడదు. ఈనాడు ఆనాటి పరిస్థితులు లేవు కాబట్టి మన విశ్వవిద్యాలయాలకు కొంతవరకు స్వేచ్ఛయిచ్చి విద్యను ప్రోత్సహించటానికి వీలుగా యీ ఛాన్సలరు పదవిని అసలు తీసివేస్తేనే బాగుంటుందని నా అభిప్రాయము.

ఈ మధ్యన అలహాబాదుకు Universities Re-organization Commission వచ్చినప్పుడు యూనివర్సిటీలకు academic freedom యిచ్చేవిషయము వచ్చినప్పుడు చాలాతర్జన భర్జనలు జరిగాయి. అక్కడ ఛాన్సలరు షిప్పు గవర్నరుగారికి యిచ్చి, executiveకు యీ విశ్వవిద్యాలయాలమీద అధికారము వుండే

దానికన్నా, విశ్వ విద్యాలయానికి స్వేచ్ఛయిచ్చేటట్లుగా కొన్ని సూచనలు చేశారు. ఈ కారణములు అన్నీ చూచుకున్నప్పటికినీ, ఛాన్సలరు పదవి ఏ రకముగా అవసరమో అర్థముకావడము లేదు. ఇవంతా చూస్తే, అన్ని యూనివర్సిటీలకన్నా వెంకటేశ్వర యూనివర్సిటీ చాలా భిన్నముగా వున్నది. ఛాన్సలరు పదవికి ఎవరు వుండాలి, గవర్నరుగారే వుండాలా, యితరులు వుండకూడదా అని అంటే, యీ విషయములో ప్రజాభిప్రాయములోనూ, విద్యావేత్తల అభిప్రాయాలలోనూ చాలా అభిప్రాయభేదాలు వుంటున్నవి. ఈ బిల్లు ప్రభుత్వము ప్రకటించినప్పుడు Times of India వారుకూడా ఒక article వ్రాశారు. కాని Times of India అనేది కమ్యూనిస్టు పత్రిక కాదు.

THE HON. SRI B. GOPALA REDDI.—కాంగ్రెసు పత్రిక కూడా కాదు.

SRI P. SUNDARAYYA:—సామాన్యంగా అది కాంగ్రెసు పార్టీ వారినే బలపరుస్తూ వుంటుంది. కమ్యూనిస్టు పత్రిక కాదని మాత్రము మన ముఖ్యమంత్రిగారు ఒప్పుకుంటున్నారు. అట్లా అయితే అది కాంగ్రెసు పత్రిక కాదు. కమ్యూనిస్టు పత్రిక అంతకన్న కాదు. ఇద్దరికి దూరముగావుండే పత్రికే. ఇటువంటి పత్రికలో వారు యేమి వ్రాశారో చూడండి. అంటే ఛాన్సలరే వుండాలి, అదే మంచిది అనేది ప్రజాభిప్రాయములోగాని, విద్యావేత్తలలోగాని ఏకాభిప్రాయము లేదు. అది ఒక సిద్ధాంతంగా పెట్టుకోవలసిన అవసరము లేనప్పుడు, వారు వ్రాసింది యేమిటో గ్రహించాలి. Chancellorship అలంకార పదవి అంటే, దాన్ని తీసివేయండి. అలంకారప్రాయులవల్ల వుపయోగమేమిటి? లేదా ప్రధాన న్యాయమూర్తిని అక్కడ వుంచినప్పుడు వారిని తీసివేయవలసిన అవసరము ఏమివచ్చింది? గవర్నరుమాత్రము వుండటం అనేది ఏ విధంగా అవసరము అవుతుంది? ఆంధ్ర యూనివర్సిటీకి గవర్నరువుంటే, ప్రధానన్యాయమూర్తి తిరుపతి యూనివర్సిటీకి వుండకూడదా? ఉండకూడదని ఎక్కడవున్నది? అట్లా రెండింటికి ఒకరే వుండాలని అంటే, యీ రెంటికినీ ప్రధాన న్యాయమూర్తినే వుంచండి. ఆ విధంగా ఆంధ్రయూనివర్సిటీయాక్టుకు ఒక Amending Bill ను తీసుకొనిరండి. అప్పుడు రెండు యూనివర్సిటీలకు ఒక విధమైన co-ordination వుంటుంది. అందువల్ల యీ తిరుపతి యూనివర్సిటీ యాక్టుకు Amending Bill తెచ్చేబదులు ఆంధ్రయూనివర్సిటీ యాక్టుకే ఒక Amending Bill ద్వారలో తీసుకొనివచ్చి, దానికికూడా ప్రధానన్యాయమూర్తినే ఛాన్సలరుగావుండే ఏర్పాటు చేసుకుందాము. ఆ విధంగా చేస్తే ప్రజలుకూడా సంతోషిస్తారు గదా.

[22nd September 1955

SRI C. BAPAYYA :—న్యాయమూర్తిని అగౌరవపరచడమనే మాట, యీ ఎసెంబ్లీమీద నింద మోపడము అవుతుంది. కనుక ఆ విధంగా మాట్లాడడము మంచిది కాదని నా అభిప్రాయము.

SRI P. SUNDARAYYA :—తరువాత ఈ బిల్లును ఏ ఉద్దేశ్యముతో తెచ్చినా ఆ రకంగా వారితీసేదానికోసం అవకాశము ఉందని నేను సూచిస్తున్నాను. అటువంటి ఉద్దేశ్యాలు లేనివాళ్లు ఇటువంటి సవరణ చట్టము తీసుకొనిరాకుండా వుంటే బాగుండేది. రెండవ విషయానికివస్తే విశ్వవిద్యాలయాలకు విరాళాలు ఇచ్చేవాళ్లకు సెనేటులోకి ఒక ప్రతినిధిగా రావడముగాని, ప్రతినిధిని నామినేటుచేసే అధికారము ఉన్నది. ఇప్పుడు వున్న బిల్లులో 25 వేలురూపాయిలుపైగా ఇచ్చే దాతలను వాళ్లు యావజ్జీవ సభ్యులుగా వుండేదానికోసం అవకాశం కల్పించింది. యావజ్జీవితంగా అక్కడ ఉండేదానికి పెద్దమొత్తం ఇవ్వాలన్నారు. పెద్దమొత్తము ఇవ్వడము అంటే ఈ విద్యా విజ్ఞానాన్ని పెంపొందింపచేసే దానికోసము ఆదుర్దాతో తనకున్నదాంట్లో ఎక్కువభాగము యిచ్చారనిచెప్పే ఉద్దేశ్యముతో 25 వేలు అని పెట్టారు అనుకోండి. ఇంకెంతయినా పెట్టుకోవచ్చును. ప్రత్యేకంగా డబ్బు యిచ్చారు అనే కాకుండా ప్రత్యేకంగా విద్యావిషయంలో ఆసక్తిని చూపించి ఈ విశ్వవిద్యాలయాన్ని అభివృద్ధి చేసేదానికోసము తన శక్తికొలది పనిచేసేదానికి కొంత విరాళము యిచ్చేదానికోసము పూనుకున్న కొంతమందిని యావజ్జీవిత సభ్యులుగా చేయాలనే ఉద్దేశ్యముతో అక్కడ పెట్టారుగాని, 20 వేలు యిచ్చారు కాబట్టి ఒక సెనేటు యావజ్జీవ సభ్యుని విలువ 25 వేలు అని చెప్పే గీటురాయి పెట్టేదానికోసం లేదని అనుకొంటాను. ఆ రీతిగా పెట్టిన తరువాత ఇప్పుడు ఏమిచేస్తున్నారంటే ప్రతి సంవత్సరము 5 వేల రూపాయిలు ఇచ్చేవాళ్లు ఎన్నిసంవత్సరాలు ఇస్తారో అన్నిసంవత్సరములు ఒకరిని నామినేటుచేసేదానికోసం సెనేటు సభ్యునికి హక్కు ఇవ్వడం అనేది ఒకటి పెట్టుతున్నారు. 10, 25 వేల మధ్య యిచ్చినటువంటి ఒక సంస్థగాని, ఒకవ్యక్తిగాని ఇస్తే 3 యేండ్లకు ఒకరిని నామినేటు చేసేందుకు వీలుంటుంది. విశ్వవిద్యాలయాన్ని ఒక మార్కెటు place గా బేరముఆడేదానిలాగా 5 వేలు ప్రతి సంవత్సరము ఇస్తే ఒక సంవత్సరము సెనేటు సభ్యత్వము యిస్తాము, 10 నుంచి 25 వేలు ఇచ్చినట్లయితే 3 యేండ్లు నామినేటు చేస్తాము, అనేదానికోసం హక్కు ఇస్తాము, 25 వేలుదాటిఇస్తే 5 యేండ్లు నామినేటుచేసేదానికి హక్కుయిస్తాము, ఇలాంటిది విశ్వవిద్యాలయములో మార్కెటుబేరము క్రింద సెనేటు సభ్యత్వమును అమ్మడము తప్పితే ఇంకొక పద్ధతి కాదు. ఈ పద్ధతి చాలా తప్పు. వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి డబ్బు కావాలంటారా. ఇప్పుడు ప్రతిసంవత్సరము ప్రభుత్వము recurring grant క్రింద 3 లక్షలు

ఇవ్వండి. లేదా, 5 లక్షలో, 10 లక్షలో నిర్ణయించి, అలాంటి బిల్లును తీసుకురండి మేము దానిని సంతోషంగా బలపరుస్తాము. అంతేకాని విరాళాలు కోరండి, ఇచ్చిన వాళ్లవద్దనుంచి తీసుకోండి. దీనికోసం శక్తికొలది ప్రయత్నము చేసేదానికోసము కూడా ఎవరికీ అభ్యంతరములేదు కాని ఇది ఒక హక్కు క్రింద ఎవరైనా 5 వేలు ఇస్తే ఒక సంవత్సరానికి ఆయనకు సభ్యత్వము ఇస్తాము అనే రకంగా దానిని మార్కెటుబేరం క్రింద దింపడము ఈ విద్యావిషయంలో చేయాల్సినపని కాదు. దానినిగురించి Radhakrishnan Education Committee ఏమిచెప్పింది అంటే, రెండువేలుగాని, మూడువేలుగాని విరాళాలుగా ఇచ్చిన వారినందరిని డోనార్సులిస్టు క్రిందపెట్టి, వారందరినికూడ దీసి ఒక ప్రతినిధిని ఎన్నుకునేదాని కోసం అవకాశము ఇచ్చారు అనుకోండి. కాని వారు అనుకున్నా ప్రత్యేకంగా దీనిని వ్యతిరేకించరు.

The donor, even of the largest sum should not have the right of an individual seat in the Senate ; still less should he have the right to nominate some one in his seat.

విశ్వవిద్యాలయములు విద్యావిషయంలో అభివృద్ధిచెందాలి అని తన ఆస్తిలో పెద్ద భాగాన్ని 50 వేలో, లక్షో, ఇచ్చినవారిని నామినేటు చేయవచ్చును. ఇది అంతా మర్యాదగా వుండేటట్లు చేసిన చట్టము కాదు. He becomes a member or in his place he can nominate. అని అక్కడ మనము చెప్పకూడదు. తాను మాత్రము సభ్యుడు అయ్యేదానికి వీల్లేదు. కాని తను తననే నామినేటుచేసుకుంటే అప్పుడు సరిపోతుంది. ఇలాంటిది చేయడము అనేది ఒకమార్కెటు బేరంక్రింద దిగుతోంది. ఈహక్కు ఉండకూడదు. ఆఖరుకు వారు సజెస్టుచేసింది ఏమిటంటే Donors of one lakh or more should become honorary fellows of the University అని. దానికి లక్షకాదు ఎంతైనా పెట్టవచ్చును. వారు గౌరవము తెచ్చుకునేటట్లయితే fellows of the University క్రింద ఉండవచ్చు, ఇటువంటి గౌరవపదవులు ఇవ్వడములో అర్థము ఉన్నది. అట్లా డబ్బు యిచ్చేవారికి సెనేటు సభ్యత్వం పనియిచ్చే పద్ధతి పనికిరాదు. ఎందుకు అంటే వారు కారణముకూడా చెప్పారు :

"Without doubt a conspicuously generous donor and friend of a University would be placed on the Senate, either by the donors or by co-option or as a nominee of the Chancellor. But there is danger, if donations of a certain size, carry with them an automatic seat on the Senate, that the balance of the Senate membership may be distorted, or inextreme cases that a group could buy up the control of a University."

22nd September 1955] [Sri P. Sundarayya

అయితే ఇటువంటి ప్రమాదాలు ఇంతవరకు ఏమీ జరుగలేదు. జరగబోవని కాదు. అసలు సిద్ధాంతము ఏమిటి? దానివెనకవున్న సూత్రము ఏమిటి? ఈ సూత్రాన్ని మీరు తృణీకరించిపారేసి ఈరకంగా 5 వేలరూపాయలు ఇచ్చినట్లయితే ఒక సంవత్సరము నామినేటుచేసే పద్ధతి ఆంధ్రా యూనివర్సిటీ బిల్లులోవున్నది. అదిమరీ అధ్వాన్నముగా వున్నది. 3వేల రూపాయలు ఇస్తేచాలు, ఒక మెంబరును నామినేటుచేసేదానికోసం హక్కు ఉన్నది. అక్కడ ఒక చెడ్డపనిచేశాము. ఆ చెడ్డ పనినే ఇక్కడకూడ చేయాలనా? అక్కడ amendment to Andhra University actకు తీసుకురండి. 3 వేలు ఇచ్చినా, 5 వేలుఇచ్చినా ఆటోమాటిక్‌గా సెనేటు సభ్యత్వము రావడము అనేది తీసివేసి విద్యావిషయంలో శ్రద్ధతీసుకొని పనిచేసినంత వరకు దాంట్లో వుండేట్లుగాచేస్తే అందంచందంగా ఉంటుంది. విద్యావిషయంలో ముందుకుతీసుకుపోయే దానికి వీలుంది, ఆంధ్ర యూనివర్సిటీలో ఈరకంగా వున్నది కాబట్టి దీనిని మేము తెస్తున్నాము, అని కారణముకూడా చెబుతున్నారు. 5 వేలనుంచి 25 వేలవరకు యిచ్చేవారికి సెనేటుసభ్యత్వము ఇచ్చే ప్రొవిజను ఇందులో లేదుకాబట్టి ఇది ఒక దురుద్దేశ్యంతోకూడా చేశారు. ఈవిశ్వవిద్యాలయం అభివృద్ధిచెందాలనే కోరికతో చేశారా? అనే అనుమానము నాకు కలుగుతుందని చెప్పి ముఖ్యమంత్రిగారు సెలవిచ్చారు. ఇది చాలా పొరపాటు. నేను విన్నవించాల్సి వుంటుంది. ఎందుకు అంటే విశ్వవిద్యాలయాన్ని అభివృద్ధి లేకుండా చేయాలంటే డొంకతిరుగుడుపద్ధతిని చేయాల్సిన అవసరములేదు. ఈ ప్రభుత్వమునకు డబ్బులేదు. అందువల్ల దానికి కావలసినడబ్బు ఇవ్వలేని పరిస్థితిలో వున్నదని గోపాలరెడ్డిగారు చెబుతున్నారు. నేను ఆమాటను వారికి చెబుతున్నాను. సభ్యత్వము ఇచ్చితేనే విరాళాలు ఇస్తున్నారంటే యూనివర్సిటీలను తనచేతుల్లో కీలుబొమ్మలుగా వుంచుకోవాలనే వారలా ఇస్తున్నారన్నమాట. సెనేటు సభ్యత్వము అంటే ఓటుహక్కు; వారికి ఆ ఓటుహక్కు ఇస్తే సెనేటుమీద నేను పెత్తనము చలాయించగలను, వెంకటేశ్వర యూనివర్సిటీమీద హక్కు చెలాయించే పెత్తనము నాకువుండాలనే ధోరణిలోనే డబ్బు ఇస్తున్నారు, ఆ పరిస్థితులలో, ఇటువంటిడబ్బును మీరు తీసుకోనక్కరలేదు. ప్రభుత్వమే యూనివర్సిటీలకు కావలసినడబ్బును ఇవ్వడము న్యాయముగాని ఆ రకంగా వచ్చే హక్కుకోసం విశ్వవిద్యాలయముమీద పెత్తనము చలాయించేదానికోసం ఏ ధనవంతుడు అయినా నేను డబ్బు ఇస్తున్నాను అన్నట్లయితే ఆ డబ్బు మాకు అక్కరలేదు, మీ దగ్గరే పెట్టుకోండి, ఈ విశ్వవిద్యాలయమును మీ చేతిలో కీలుబొమ్మలాగా చేయము అని చెప్పడము అనేది విశ్వవిద్యాలయముల అభివృద్ధికి దారి తీస్తుంది. కాని ఈ రీతిగా విరాళాలు సేకరించే పద్ధతిలో ఈ బిల్లులోలేదు. ఇది విశ్వ

విద్యాలయాన్ని అమ్మే పద్ధతి. అందుచేత ఈ రెండు ప్రధానమైనవి.

Privileges Committee ఉండాలా లేదా అనే చర్చ అనవసరములేదు. ఈ దృష్టితోనే సవరణ తెచ్చుట అనవసరం అని మా వెంకటేశ్వర్లుగారు పాయింటు రైజు చేశారు అనుకుంటాను. అందుచేత ప్రధానమైన ఈ రెండు సవరణలకు మాత్రం మేము పూర్తిగా వ్యతిరేకం. అందుచేత ఇప్పటికైనా కూడ డోనర్లను సెనేటు సభ్యులను nominate చేసేటటువంటి హక్కు యివ్వము. న్యాయాధిపతి Chancellorship నుండి తొలగించే పద్ధతి సరియైనది కాదు. అందుచేత ప్రభుత్వము మరొక పర్యాయము ఆలోచించి ఈ బిల్లును అంతా తిరిగి పునరాలోచించడము మంచిదని నేను కోరుతున్నాను.

4 p. m.

THE HON. SRI B. GOPALA REDDI :—అధ్యక్షా, సభ్యులు చాలా ఉదాత్తమైన అభిప్రాయాలు వెలిబుచ్చినందుకు చాలా సంతోషం. మాట్లాడిన 8 మందికూడా వెంకటేశ్వర యూనివర్శిటీప్రాంతానికి సంబంధించిన మెంబర్లు కాదు. సుందరయ్యగారు నెల్లూరువారైనా కృష్ణాజిల్లా వారైపోయినారు ఇప్పుడు. అందులో ఏమీ తప్పులేదు—సుబ్బారావుగారు ఒకరున్నారు. మరిచిపోయినాను. అన్ని విషయాలు యోచించి అందరూ మాట్లాడడం మంచిదే. నేను ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. సిండికేటులో కొంతకాలంగా ఉండి, యూనివర్సిటీ సెనేటులో మెంబరుగాఉన్న రమణయ్యనాయుడుగారు, కాశీశ్వరరావుగారు, దాదాపు 10 సంవత్సరాలుగా సెనేటుమెంబరుగా ఉన్న కల్లూరి సుబ్బారావుగారు ఈ విషయంలో ఏమి చెప్పారో మీరు ఆలోచించాలని కోరుచున్నాను. ఎవరినో పదవిలో ఉన్న న్యాయమూర్తిగారిని అవమర్యాద చేయడానికో, తృణీకరించడానికో చేసినారు అని ఇతరులు అనుకుంటారేమోనని భయపడవలసిన అవసరంలేదు. మొదట రంగధామరావుగారు స్పెషల్ ఆఫీసరుగా ఒక రిపోర్టుఇచ్చారు. గోవిందరాజులు నాయుడుగారు కూడా ఉన్నారు. దానిని ఆధారంగా తీసుకునే వెంకటేశ్వర యూనివర్సిటీ బిల్లు తయారైనది. గోవిందరాజులు నాయుడుగారు D. P. I. గా ఉన్నారు. మద్రాసు విశ్వవిద్యాలయ సిండికేట్‌లో ఉన్నారు. కొంతకాలం Acting Vice Chancellor గా ఉన్నారు. రంగధామరావుగారు Principal గా చాలాకాలంగా ఉన్నారు. వారు రాజకీయవేత్తలు కారు. మా పార్టీవారు కారు. వారి రిపోర్టులో ఛాన్సలరు విషయమై ఏమి చెప్పారు? రాధాకృష్ణన్ రిపోర్టుగురించి సుందరయ్యగారు పదే పదే చెప్పారు. రాధాకృష్ణన్ రిపోర్టులో ఎక్కడైనా, పరోక్షంగానైనా—

ప్రధాన న్యాయమూర్తిని ఛాన్సలరుచేయాలని సూచన చేయబడిందేమో చూడండి. గోవిందరాజులు నాయుడుగారు, రంగధామరావుగారు చెప్పింది చూడండి. ఆనాడు గవర్నమెంటువారుకూడా ఈ బిల్లు తయారుచేసినప్పుడు అన్ని యూనివర్సిటీల మాదిరిగానే గవర్నరుగారే దీనికికూడా ఛాన్సలరుగా ఉండాలనిఅన్నారు. సెలక్టుకమిటీలో కూడా ఈవిషయాన్ని ఒప్పుకొన్నారు. అంతా అయినతరువాత ఇక్కడకువచ్చి మార్చవలసిన అవసరం ఏమిటో, ఇది దైవబలమో పశుబలమో పద్మనాభరాజుగారు చెప్పాలి. ఎక్కడా లేనిది - ఏవిద్యావేత్త చెప్పనిది - సెలక్టు కమిటీలో జరిగిన దానికి వ్యతిరేకంగా మీరు ఎందుకు చేయవలసి వచ్చింది ? గవర్నరుగారి మీద మీకు ఏమైనా కోపమా ? ఈనాడు న్యాయమూర్తిగారిని అవమానం చేస్తున్నాము అంటున్నారు. కాదని మేము చెబుతున్నాము. ఆనాడు త్రివేదిగారిని మీరుకూడా అవమానం చేయాలని చూచారని నేను అనను. ఎదో సిద్ధాంతం కోసమే అనుకుంటాము. కాని ఏ సిద్ధాంతం బట్టి చేసారో నాకు తెలియదు. ఎక్కడా లేని విషయాన్ని-ఎదో మురారిపంథా అనట్లు-ఒకాయన amendment తీసుకురావడం, దానిని pass చేయడంలో ఉన్న చిదంబర రహస్యం నాకు అర్థం కావడంలేదు. ఆనాడు ఏ ఉద్దేశ్యంతో చేశారో నాకు తెలియదు. సెలక్టు కమిటీలో పూర్తి అయిన తరువాత, ఏమినష్టం వస్తుందోనని గవర్నరుగారిని మార్చినారో మీరే చెప్పాలి. ఆనాడు విశాఖపట్నం sessions లో ఇంతమంది సలహాలకు వ్యతిరేకంగా ఏ ప్రబలమైన ఆధ్యాత్మికమైన కారణాలు ఉన్నాయని మార్చారో మీరే చెబితే బాగుంటుంది. న్యాయమూర్తిగా ఉన్నవారు చాన్సలరుగా తమ పని సక్రమంగా నిర్వర్తిస్తున్నారు. చాలా సంతోషం, వారు చేసే పనులలో తప్పు ఉందని కాదు. ఏమి మునిగిపోయింది సంవత్సరం లోపలే తీసుకురావడానికి, అని అంటున్నారు వెంకటేశ్వర్లుగారు. నేను సంవత్సరం తరువాత తీసుకువస్తే ఏమంటారు ? ఎదో తప్పుచేసి, మీరు చెప్పిన nominations చేయలేదనే ఉద్దేశంతో తీసుకువస్తున్నారు అంటారు. ఇదే ప్రప్రథముగా బిల్లులు తీసుకువచ్చే సమావేశం. ఇందులోనే ఈబిల్లును మొదటిరోజునే తీసుకువస్తున్నాము. వ్యక్తిగతంగా ఏమీ కాదు. మీరు ఆనాడు ఆవిధంగా చేయడం న్యాయంకాదని చెప్పడానికి, అవసరమయితే-అందరు విద్యావేత్తలు చెప్పిన విధంగా దక్షిణాదిన ఉన్న పద్ధతిలోనే చేస్తున్నాము. క్రొత్త ఏమిలేదు. ఈ రిపోర్టులో ఒకమాట చెప్పినారు. చాలా యూనివర్సిటీలు ఉన్నచోట గవర్నరుగారే చాన్సలరుగా ఉంటే బాగుండదేమోనని. బొంబాయి రాష్ట్రంలో నాలుగు యూనివర్సిటీలు ఉన్నాయి. కర్ణాటక యూనివర్సిటీ, మహారాష్ట్ర యూనివర్సిటీ, బొంబాయి యూనివర్సిటీ, గుజరాత్ యూనివర్సిటీ అని ఈ నాలుగింటికి గవర్నరుగారే

చాన్సలరు బహుశా. అటువంటి సందర్భాలలో నాలుగు యూనివర్సిటీలకు సమానమైన శ్రద్ధ చూపించలేరేమోననే ఉద్దేశంతో వారు చెప్పి ఉండవచ్చును. ఉత్తర ప్రదేశ్‌లో లక్నో, అలహాబాద్‌లో, ఆగ్రాలో ఉన్నాయి. రూర్కీలో ఇంజనీరింగ్ యూనివర్సిటీ ఉన్నది. ఈ నాలుగింటికి గవర్నరు మున్షీగారే చాన్సెలరుగా ఉంటున్నారు. అటువంటి చోట్ల సమానమైన దృష్టి చూపించలేరేమోనని చెప్పారు కాని రెండు యూనివర్సిటీలు ఉంటేనే several అయిపోయా ? అది రెండు యూనివర్సిటీలకే ఉద్దేశించినది కాదు. అషుతోష్ ముఖర్జీగారు కలకత్తాలో వైస్ చాన్సలరుగా ఉన్నారు. రంగూన్‌లో చీఫ్ జస్టిస్ గారు ఉన్నారు. వైస్ చాన్సలరుగా.

SRI PILLALAMARRI VENKATESWARLU:—ఎవరిది ఎక్కువ బాధ్యత ?

THE HON. SRI B. GOPALA REDDI :—Vice-Chancellor కే ఎక్కువ బాధ్యత. చాన్సలరు విషయంవేరు. ఎక్కడా లేని పద్ధతిని ఇక్కడ ఎందుకు తీసుకువచ్చారో నాకు అర్థం కావడంలేదని ఇదివరకే విన్నవించాను. సకాలంలోనే తీసుకువచ్చాము. కొంత కాలం అయిన తరువాత తీసుకు వస్తే అప్పుడు తిరిగి వెంకటేశ్వర్లుగారు ఎందుకు తీసుకు వచ్చారని అడుగుతారు. అందుచే మొదట session లో మొదట రోజునే తీసుకువచ్చాము. పశుబలంవల్ల చేస్తున్నది కాదని పద్మనాభరాజు గారికి చెబుతున్నాను. అన్నింటిని వ్యతిరేకించి మీరు ఆ నాడు చేసినది న్యాయంకాదని చెబుతున్నాను. మేము చేసినదానిలో అన్యాయంలేదు. అన్ని చోట్ల ఉన్నదాని ప్రకారం చేస్తున్నాము, అన్న విషయంలో యూనివర్సిటీవారికి అధికారం ఉన్నది. 3000 యిచ్చినంతమాత్రంచేత తీసుకోవలసిన అవసరం లేదు. సెనేటుకు సిండికేటుకు ప్రత్యేక రూల్సు ఉన్నాయి. పది మంది వచ్చి dominate చేసి ఎలెక్షన్లలో తలకిందులు చేయాలంటే కాదు. వారు యిచ్చేదానికి యూనివర్సిటీ సంసిద్ధత ప్రకటించాలి. Then he gets a right to nominate a person. అంతేకాని table మీద రు. 3000 లు పెట్టగానే nominate చేయడానికి కాదు. ఏవిధమైన దురుద్దేశం ఉన్నా యూనివర్సిటీవాళ్లు అక్కరలేదని చెప్పవచ్చును. కొంతవరకు ప్రోత్సాహం యివ్వడం మంచిదేమో. అందులో తప్పు లేదు. ఉదారంగా ఇస్తున్నప్పుడు, ఏవిధమైన దురుద్దేశం లేనప్పుడు, 2, 3 సంవత్సరాలు members గా చేస్తే తప్పు ఏమి ? ఇప్పుడు హరిశ్చంద్ర ప్రసాద్ గారున్నారు. వారు ఆంధ్ర విశ్వవిద్యాలయానికి 25 వేల రూపాయలు ఇచ్చారు. యావజ్జీవ సభ్యుడుగా ఉన్నారు.

చాలా సంతోషం. ఏదో ఎలెక్షన్లలో తలక్రిందులు చేయాలని కాదు. యువకులైనా వారు యావజ్జీవ సభ్యులుగా ఉన్నారు. 50, 60 సంవత్సరాలు ఆంధ్ర యూనివర్సిటీలో ఉండాలని కోరుతున్నాను. యార్లగడ్డ రామనాథ బాబుగారు కూడా సెనేటు మెంబరుగా ఉన్నారు. అంతమాత్రంచేత దీనిని ఏదో market place చేస్తున్నాము; సెనేటు membership వేలంవేస్తున్నాం అనడం న్యూస్‌లో పరచినట్లు అవుతుంది. ఆంధ్ర, మద్రాసు, అన్నామలై యూనివర్శిటీలలో ఎక్కడా లేనిది ఏమీ లేదు. ఈ విషయంలో యూనివర్సిటీవారికి అధికారం ఉన్నది. ఈరకంగా provision పెట్టుకోడం ఉత్తమం అనుకున్నాము. దీనిని market place చేసేరు, commercialise చేసేరు అనడం న్యాయంకాదు. ఇంక Privileges Committee విషయం సుందరయ్యగారే serious గా తీసుకోలేదు. చాలా సంతోషించవలసిన విషయం. ఇద్దరూ పెద్దపదవుల్లో ఉన్నవారి విషయం కాబట్టి కొంచెం సునిశితంగా మాట్లాడితే బాగుంటుంది. ఇతరులు చెప్పినవాటితో నేను ఏకీభవించినా, మానినా, అన్నిరాష్ట్రాల్లో, అన్ని యూనివర్సిటీలలో ఉండేమాదిరిగా చూసుకోడం అవసరం. Chancellor అంటే కేవలం nominations చేసి గమ్మున ఉండడం కాదు. వెంకటేశ్వర్లుగారి ఉద్దేశం ప్రకారం ఛాన్సలరు అంటే సిండికేటుకు సెనేటుకు మంత్రుల సలహా ప్రకారం నామినేషనులు వేయటంవరకే—అంతమాత్రమే కాదు. యూనివర్సిటీకి కావలసిన అనేకవ్యవహారాలలో హంగుల ప్రోత్సాహముకలిగించాలి. అనేకమందితో మాట్లాడాలి. అనేక మందిని వారు influence చేయవలసి ఉంటుంది. వారి influence Universities కు చాలా అవసరం.

ఈనాడు వెంకటేశ్వర విశ్వవిద్యాలయానికి శ్రీ త్రివేదిగారు ఎంతవరకు సహాయం చేశారంటే, ఆయన చాన్సలరు కాకపోయినా వారియొక్క ప్రోత్సాహమువల్ల నే అక్కడకు Visiting Committee వచ్చింది. అలాగే యూనివర్సిటీ గ్రాంట్సు కమిటీవారు వచ్చారు. వారు ఆగ్రహముగా ఉండేవారు. వారి ఆగ్రహము తగ్గించడానికి గవర్నరుగారు అడగకుండా సహాయపడరని చెప్పడానికి నాకు ఆనందముగా ఉంది. గవర్నరుగా ఉన్న బాధ్యతను పురస్కరించుకొని వారు ఆ సహాయం చేశారని చెప్పడానికి ఆనందించుచున్నాను. అందువల్ల లేనిపోని ఆవేశాలతో చేసినపని కాదు. కమ్యూనిస్టులకు Chief Justice కావలసినప్పుడు ఆయన కాంగ్రెస్‌వారికి Chief Justice కాడు. ఆయన కమ్యూనిస్టులకు Chief Justice కాడు. మీరందరు Chief Justice ను support చేస్తున్నారంటే వీలులేదు. విపరీతఅర్థాలుతీసి ఏమి ప్రయోజనంలేదు. మొత్తంమీద దేశంలో ఏమి జరుగుతున్నది? University కి ఏమి జరుగుతే మంచిదో అది తీసుకోనవలెను. పోయినతడవ మీరు కొంత

తొందరపడి చేసినారనుకొనవచ్చును. ఈ విషయాలు అన్నిఉన్నాయి కాబట్టి ఈ మూడు సవరణలు తప్పకుండా ఇప్పుడైనా Opposition పార్టీ మంజూరు చేస్తుందని విశ్వశిస్తున్నాను.

MR. SPEAKER : The question is :

'That the Sri Venkateswara University (Amendment) Bill, 1955, be taken into consideration.'

The motion was carried.

## CLAUSE 2.

MR. SPEAKER : There are no amendments to this clause. I suppose nobody is going to speak ; for, they will have to say the same thing.

SRI PILLALAMARRI VENKATESWARLU : Yes, but in different language. I wish to say something.

SRI PILLALAMARRI VENKATESWARLU :—Importance నుబట్టి మాట్లాడవలసిఉంది. ఇంతకు భావాలు ఏమీ తలక్రిందులు కావుకదా! Clause by clause discussion ఉంటుందికదా ?

MR. SPEAKER : Clause 2 is to substitute the word 'Governor' for the words 'Chief Justice of the High Court.' On that point, discussion for the last two hours has centred.

SRI PILLALAMARRI VENKATESWARLU :—I am opposing, Sir. గోపాలరెడ్డిగారు చెప్పినదివిన్న తరువాత ఏమీ జరిగేటట్లులేదు. కనీసము కొంతకాలమైనా ఉండవలెనని చెప్పడములో ఉద్దేశము ఒక సంవత్సరం వెనుక ఆయన చేస్తే పోయిందేమిటో కూడా తెలియదు. Administrative inconvenience అనిగాని, Chief Justice గారు నాకు ఇంతబాధ్యత అక్కరలేదని చెప్పేడాఅంటే చెయ్యవచ్చును. ప్రజలకు ఆ విధముగా దురభిప్రాయము కల్గించవచ్చును. ఇప్పుడే అనవసరంగా తొందరపడి ఎందుకు చెయ్యాలి ? ఆనాడు గవర్నరు మీద దురుద్దేశముమీద చేసింది కాదు. ఆయనను అగౌరవ పరచడానికి కాదు. General గా గవర్నరు మంత్రివర్గము చెప్పినట్లుచేస్తారు. Governor is responsible to the Ministry. ఇది సర్వసాధారణముగా జరుగుతూఉంది. పుట్టుకలోనే

రాజకీయాల ప్రభావం ముటాతత్వాలు లేకుండా చేయాలని మా ఉద్దేశము ఆనాడు. ఆనాడు amendment తెచ్చినవారి ఉద్దేశముగాని, బలపరచినవారి ఉద్దేశము కాని మరేమికాదు అని గోపాలరెడ్డిగారికి చెబుతున్నాను. కాని ఈ రోజున గవర్నరు ఫేరు substitute చెయ్యాలని చెప్పడం న్యాయంకాదు. సరిగ్గా సంవత్సరంఅయినా తిరగలేదు. Administrative inconvenience ఏమి కనబడింది? అవసరం వచ్చినప్పుడు గవర్నరుగారే Grants Committeeతో మాట్లాడాలి చాన్సలరునుగా లేకపోయినా ఆయన చెయ్యవచ్చును. దానితో బ్రహ్మాండమైన సిద్ధాంతము ఉన్నదని చెప్పడం, దానితో కొంతమైముపోయినా ఫరవాలేదని గోపాలరెడ్డిగారు ఈ సవరణ తీసుకొనివచ్చే ఉండేవారుకాదని నేను నమ్ముచున్నాను. విద్యావేత్తలు న్యాయవేత్తలేకాని ఆయనకు administrative capacity ఉన్నదా అని కొంతమంది అడిగారు. ఈనాడు రాధాక్రిష్ణనుగారు కేవలము విద్యావేత్త గా మాత్రమేకాక రాజకీయ వేత్తగా Council of States లో వ్యవహరిస్తున్నారు కదా! శాసనసభ్యులుగా ఎన్నికైనవారు మాత్రమే రాజకీయవేత్తలుఅని అనుకొనడము చాలా పొరపాటు. వైసు చాన్సలరుగా Chief Justice వుండలేదా? Chief Justice ఉన్నందువల్ల ఏ విధముగా భంగము కలిగిందో శ్రీ కల్లూరు సుబ్బారావుగారుకూడా చెప్పలేదా? ఇది కేవలము పట్టుదలతో చేస్తున్న పని. ఆనాడు మీ బలముతో ప్యాసుఅయిన బిల్లును గోపాలరెడ్డిగారు చెబుతున్నారు.

Let us take some more time and take a decision on this issue.

MR. SPEAKER : I don't think there is need for a reply from the Minister. So I now put the motion to the vote of the House.

The question is :

"that clause 2 do stand part of the Bill."

The motion was declared carried. Sri P. Sundarayya demanded a poll. The House divided thus :

*Ayes.*

1. The Hon. Sri B. Gopala Reddi.
2. Srimathi C. Ammanna Raja.
3. Srimathi B. Rukmini Devi.

4. Sri Kalluru Subba Rao.
5. Sri G. Bapaiah.
6. Sri P. Bapayya.
7. The Hon. Sri D. Sanjivayya.
8. The Hon. Sri A. B. Nageswara Rao.
9. Sri S. Brahmayya.
10. Sri Marupilla Chitti *alias* Appalaswamy.
11. Sri T. Gopalakrishna Guptha.
12. Sri P. Gunnayya.
13. Sri M. Harischandra Prasad.
14. Sri Gadiraju Jagannadharaju.
15. Sri T. Jalayya.
16. Sri T. Jiyyardas.
17. Sri A. Kaleswara Rao.
18. Sri Pragada Kotaiah.
19. Sri L. Lakshmana Das.
20. Sri N. K. Lingam.
21. Sri Mahaboob Ali Khan.
22. Sri M. Munuswami.
23. Sri M. Nageswara Rao.
24. Sri Sanda Narayanappa.
25. Sri K. Obula Reddi.
26. Sri M. Potha Raju.
27. Sri Kottapalli Punnayya.
28. Sri Rajaram.
29. Sri D. Ramabrahmam.
30. Sri P. Ramacharlu.
31. Sri P. Ramaswami Naidu.
32. Sri N. Ramulu.
33. Sri M. Rangayya.
34. Sri Ratnam.
35. Sri N. C. Seshadri.
36. Sri P. Singarayya.
37. Sri B. Subba Rao.
38. Sri Shaik Moula Saheb.
39. Sri C. P. Thimma Reddi.
40. Sri T. Veeraraghavulu.

41. Sri Nagineni Venkaiah.
42. Sri K. Venkatramanayya.
43. Sri B. P. Sesha Reddi.
44. Sri A. Venkatramaiah.
45. Sri M. Venkataraju.
46. Sri P. Venkataravanappa.
47 Sri G. Venkata Reddi.
48. Sri K. Venkataratnam.
49. Sri P. Venkatasubbaiah.
50. Sri B. Venkata Sivayya.
51. Sri M. Matcharaju.
52. Sri P. Narasimhappa Rao.
53. Sri P. Suryanarayana.
54. Sri T. Papa Rao.

*Noes.*

1. Sri Vavilala Gopalakrishnayya.
2. Sri K. V. S. Padmanabha Raju.
3. Sri B. Adinarayana.
4. Sri A. Yeruku Naidu.
5. Sri P. Sundarayya.
6. Sri Pillalamarri Venkateswarlu.
7. Sri S. Vemayya.
8. Sri B. Sankarayya.
9. Sri V. Visweswara Rao.
10. Sri P. Satyanarayana.
11. Sri G. Bussanna.

MR. SPEAKER : Ayes 54, Noes. 11. The motion is carried.

CLAUSE 3

Sub-clause (i)

4-30 p. m.

MR. SPEAKER: There is one amendment of Sri Vavilala Gopalakrishnayya to this sub-clause. He will move it.

SRI VAVILALA GOPALAKRISHNAYYA : Sir, I beg to move :

*Add* " without a vote in the elections " *after* " three years " in line 7.

SRI P. SUNDARAYYA : I second it.

MR. SPEAKER :—I do not think there is any need for further discussion on this matter. So I am putting the amendment to the vote of the House. The question is :—

'Add the words " without a vote in the elections " after " three years " in line 7.'

The amendment was lost.

Sub-clause (i) was put to vote and carried.

Sub-clause (ii)

MR. SPEAKER : There is an amendment of Sri Vavilala Gopalakrishnayya. Again the same words are to be added.

SRI VAVILALA GOPALAKRISHNAYYA : Sir, I beg to move :

'Add at the end of clause (b) the following : " without a vote in the elections ".'

SRI S. VEMAYYA : I second it.

The amendment was put to vote and lost.

Sub-clause (ii) was put to vote and carried.

Clause 3 was put and carried.

Clause 4 was put and carried.

Clause 5 was put and carried.

Clause 1 was put and carried.

The Preamble was put and carried.

THE HON. SRI B. GOPALA REDDI :—Sir, I beg to move :

'That the Sri Venkateswara University (Amendment) Bill, 1955, be passed into law.'

అధ్యక్షా, ఈబిల్లులోని క్లాజులను సభవారు అంగీకరించినందుకు నాసంతోషం తెలియజేస్తున్నాను. ఆనాడు గవర్నరుమీద దురభిప్రాయం ఏమీలేదు. ఈనాడు Chief Justice మీద దురభిప్రాయంలేదు. వ్యక్తులకు సంబంధించింది కాదు. University శాశ్వతముగ ఉండేది. తాత్కాలికంగా ఏమైనా కొన్ని మాటలు అన్నప్పటికికూడ University ఉంది, అనేకమంది విద్యార్థులు విద్యా సంస్థలద్వారా పెంపొందవలెనని, అది అభివృద్ధికి రావలెనని, మీరందరుకూడ దేశసేవ చేయగలరని నేను ఆశిస్తున్నాను.

SRI P. SUNDARAYYA :—సవరణపోయినప్పటికీకూడ, ముఖ్యమంత్రి గారు చెప్పినట్లు ఈ విశ్వవిద్యాలయాలు శాశ్వతంగా ఉండి మన ఆంధ్ర ప్రజలకు విజ్ఞానాన్ని అభివృద్ధిచేసేదానికికోసం తోడ్పడవలసి ఉంటాయి. దానికోసం అందరు కలసి కృషిచేస్తాము. అదేవిధంగా ఆంధ్రరాష్ట్రానికి రెండు విశ్వవిద్యాలయాలు కాదు. కనీసం మరొక విశ్వవిద్యాలయమైనా కావలసి ఉంటుంది. అది విజయ వాడ, గుంటూరు ప్రాంతమో. గుంటూరుప్రాంతానికి విశ్వవిద్యాలయం ఉన్నట్లయితే అన్ని కళాశాలలు, ఎన్ని విశ్వవిద్యాలయాలు ఉంటే అంత ఎక్కువగ కళాశాలలు కూడ ఉంటాయి. కాబట్టే అందుచేత రెండువిశ్వవిద్యాలయాలతో సంతృప్తి చెందక ఇపుడు ఉన్న ఆంధ్ర స్టేటులో ఇంకొక విశ్వవిద్యాలయము ఆరంభించుతారని కోరుతూ మేము ఈ బిల్లును బలపరుస్తున్నాము.

MR. SPEAKER : The question is :

That the Sri Venkateswara University (Amendment) Bill 1955, be passed into law.

The motion was carried and the Bill passed into law.

## (4) THE MADRAS SALES OF MOTOR SPIRIT TAXATION (Andhra Amendment) Bill, 1955.

THE HON. SRI D. SANJIVAYYA : Mr. Speaker, Sir, I beg to introduce the Madras Sales of Motor Spirit Taxation (Andhra Amendment) Bill, 1955 and move that the Bill be taken into consideration.

Sri D. Sanjivayya] [22nd September 1955

అధ్యక్షా, ఇప్పుడున్న Act ప్రకారం చిన్నచిన్న వ్యాపారస్థులు retail dealers motor spirits అమ్మినప్పుడు ఏమాసంలో అమ్మితారో ఆమాసానికి సంబంధించిన tax ను Treasury లోకట్టి అక్కడనుంచి ఒక Chalan తీసుకొని మరుసటినెలలో 25 వ తారీకులోగా దానికి సంబంధించిన returns, ఈ Treasury Chalan లో చేర్చి assessing authorities కు పంపవలసి ఉంటుంది. అయితే Treasury తో ఆలస్యం జరగడంవల్ల, వారంతా Treasury Receipt గాని లేకపోతే Crossed Cheque కాని Commercial Tax Officer పేరున ఇచ్చినట్లయితే బాగుంటుంది అని వారు కోరినారు. ఆవిధంగాచేస్తే వారికి అనుకూలంగా ఉంటుందనే అభిప్రాయంతో నే ఈబిల్లు ప్రవేశపెట్టబడింది. ఇటువంటి సౌకర్యం Madras General Sales Tax Act క్రిందను, Entertainment Tax Act క్రిందను ఉంది. అటువంటి సౌకర్యాన్నే ఈ Act క్రింద కలిగించాలనే ఉద్దేశంతో ఈబిల్లు ప్రతిపాదించబడ్డది. దీనికి చర్చకూడ అవసరంలేదు అని నేను అనుకొంటూను. ఇది చాలా simple బిల్లు. దీనిని ప్రతిపాదిస్తున్నాను.

MR. SPEAKER : Motion moved :

"That the Madras Sales of Motor Spirit Taxation (Andhra Amendment) Bill, 1955 be taken into consideration".

Sri Vavilala Gopalakrishnayya is not moving his amendment.

SRI PILLALAMARRI VENKATESWARLU :— Money Orders ద్వారా పంపవచ్చునా ?

THE HON. SRI D. SANJIVAYYA:—మిగతా రెండు చట్టములలోను, Treasury Receipt ద్వారాగాని లేక Crossed Cheque ద్వారాగాని చెల్లించ వచ్చునని ఉన్నది. ఆ సౌకర్యమునే ఈ చట్టంలోకూడా కలుగజేయాలని అనుకొంటు న్నాము. Money Orders విషయము ఆలోచనలో ఇదివరకుగాని, ఇప్పుడుగాని లేదు.

MR. SPEAKER :—The question is :—

"That the Madras Sales of Motor Spirit Taxation (Andhra Amendment) Bill, 1955 be taken into consideration".

The motion was carried.

Clause 2 was put and carried.

Clause 1 was put and carried.

The Preamble was put and carried.

"THE HON. SRI D. SANJIVAYYA : Sir, I beg to move that the Madras Sales of Motor Spirit Taxation (Andhra Amendment) Bill, 1955 be passed into law."

MR. SPEAKER : The question is :

"that the Madras Sales of Motor Spirit Taxation (Andhra Amendment) Bill, 1955 be passed into law."

The motion was carried and the Bill was passed into law.

## MESSAGE FROM THE GOVERNOR.

MR. SPEAKER : I have to announce to the House that the following message, dated the 27th August, 1955 has been received from the Governor of Andhra :

"In pursuance of Article 207, Clause (1) of the Constitution of India, I, Chandulal Madhavalal Trivedi, Governor of Andhra, hereby give my recommendation to the introduction in the Legislative Assembly of the Madras General Sales Tax (Andhra Amendment), Bill, 1955."

## (5) THE MADRAS GENERAL SALES TAX (Andhra Amendment) Bill, 1955.

THE HON. SRI D. SANJIVAYYA : Sir, I beg to introduce the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955 and move that the Bill be taken into consideration at once.

MR. SPEAKER : Motion moved :

"That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955 be taken into consideration at once".

SRI VAVILALA GOPALAKRISHNAYYA :—అధ్యక్షా, ఒకే State లో ఒకే సంవత్సరంలో రెండు Bills తీసుకొనివచ్చినట్లయితే ఆ రెండు bills వివరంగా ఉండడానికి Amendment (1) Amendment (2) అని అంటే బాగుంటుంది. "This Act may be called The Madras General sales Andhra Amendment (1) Bill, అని, Andhra Amendment (2) Bill అని వ్రాస్తే clear గా తెలుసుకోవడానికి వీలుంటుంది.

THE HON. SRI B. GOPALA REDDI :—అట్లాగే చేస్తామండి.

MR. SPEAKER :—So we are now taking this Bill.

THE HON. SRI D. SANJIVAYYA :—అధ్యక్షా! ఈ Madras General Sales Tax Act క్రింద advance collect చేయడానికి అవకాశమున్నది. ఆ విధంగా చేస్తున్నారు. అయితే principal Act లో provision లేకుండా, rules లో మాత్రము, Assessment Rules (Rules 7 and 8, క్రింద దానిని వసూలుచేస్తున్నారు. అది High Court కు వెళ్ళగా, principal Act లో లేనిదే, rules లో ఉన్నటువంటి provisions ను utilise చేసుకొని collect చేయడం భావ్యం కాదు, అంతవరకు, ఆ rules invalid అని వారు judgment ఇచ్చినారు. ఆ కారణంచేత, principal Act లోనే అటువంటి provision పెడితే బాగుంటుందనే ఉద్దేశంతో ఈ బిల్లు ప్రతిపాదింపబడినది. ఇదేమి controversial bill కాదు గనుక దీనిమీద ఏమి చర్చలేకుండానే దీనిని ఆమోదిస్తారని అనుకొంటున్నాను.

Mr. SPEAKER :—There are no amendments.

SRI P. SUNDARAYYA :—అధ్యక్షా, మొదటి బిల్లులో అనగా principal Act లో provision లేనిదే, సంవత్సరం పూర్తికాకపోయినా, వర్తకులు పన్నులు వసూలుచేయకపోయినా, ముందుగానే ఇంత వసూలు చేయబోతున్నామని, rules ద్వారా ప్రభుత్వము వారివద్ద వసూలుచేసే అధికారాన్ని తీసుకోవడం చట్టవిరుద్ధము. అది High Court కు వెళ్ళేదాకా తేలలేదు. ఇదివరకు rules లో ఆ విధంగా ముందుగా పన్ను వసూలుచేయుటకు provide చేసి ఆవిధంగా వసూలు చేసుకొంటున్నాము. కాని High court అది చట్టం విరుద్ధమని చెప్పినందువల్ల, చట్టములోనే ఆ provision పెట్టుతాము అని దీన్ని తీసుకువస్తున్నారు. పైగా ఇది చర్చనీయాంశంగా ఉండకూడదు, తేలికగా pass చేయవచ్చునని అంటున్నారు. కాని ఇది taxation principle కు పూర్తిగా విరుద్ధమని మంత్రిగారి దృష్టికి

తీసుకురావలసి యున్నది. ఒకదానికి ఒక పన్ను వసూలుచేసినతరువాత దానివస్తువులు అమ్మాలి, అమ్మినవానిమీద పన్నులు వసూలుచేయాలి అనేది taxation. ఏదో మేము ఇంత అమ్మబోతాము, ఇంత డబ్బు రాబోతుంది కాబట్టి ఈ రకంగా ఇంత అంచనా చేసుకొంటున్నాము అన్నట్లయితే అది healthy taxation principle కు, ఆ సూత్రాలకు ఇది చాలా విరుద్ధమని చెప్పుతున్నాను. రెండవది దీనిలో కొన్ని చిక్కులుకూడా ఏర్పడుతాయి. ఇప్పుడు Sales Tax లో ఉన్న పద్ధతిప్రకారం పదివేల రూపాయలు సంవత్సరానికి turn over ఉన్నటువంటి dealer ల మీద ఈ పన్నులు వేయడం జరుగుతున్నది. అయినప్పుడు, ఈ financial year ఆఖరుకు ఏ వ్యాపారస్తుడైనా ఎంతవ్యాపారం చేయబోతున్నాడు, లేదా ఎంత turn over ఉంటుంది అని అంచనావేస్తే దానిమీదనే ఇప్పుడు పన్ను వసూలుచేయడం జరుగుతున్నది. ఇక్కడ వచ్చిన చిక్కు ఏమిటంటే, ప్రతివర్తకునికిన్ని మొత్తం పదివేలు turn over అయితే, దాని మీద income tax మాదిరిగా వసూలుచేసేటటువంటిది గాదు ఇది. ఇంత ఆదాయము వస్తుంది కాబట్టి ఇంత ఆదాయానికి ఈ slab కాబట్టి ఈ slab నుంచి యింత cut చేయడమనేది, ఒకవేళ ఏమైనా income tax విషయంలో justify అయితే కావచ్చునేమోగాని ఇక్కడమాత్రం కాదు. Turn over సంగతి చెప్పినంత మాత్రాన సరిపోదు. ఏ యే వస్తువు ఎంతకు అమ్మింది చెప్పాలికూడాను. ప్రతివర్తకుడు ప్రతి transaction కు రశీదు ఇస్తున్నాడు. దాంట్లోనే sales tax ఇంత అని వ్రాస్తాడు. ఇది కొనేవాళ్ల మీద పడుతుంది. కొనేవాళ్లదగ్గరనుండి ఈ విధంగా వసూలుచేసినటువంటి ధనం అంతా కూడ వర్తకుడు ప్రభుత్వానికి అప్పచెప్పవలసి యుంటుంది. అటువంటిది, ఇప్పుడు advance collection అంటే అర్థమేమిటి ? వర్తకునికి ఒక concession ఇవ్వడం అన్నమాట. ఇప్పుడు ఆచరణలో జరుగుతున్నదేమిటి ? రెండు రశీదు పుస్తకాలు తయారవుతున్నాయి. Sales tax వసూలుచేయవలెనని ప్రభుత్వ చట్టమున్నది కాబట్టి ప్రజలవద్దనుంచి sales tax తీసుకొని దానికి రశీదుఇస్తూవుంటారు. ఆ విధంగా వ్రాసిన Sales Tax రశీదు పుస్తకము ఉంటుంది. కాని ప్రభుత్వమునకు submit చేసేటప్పుడు, ఈ రశీదు పుస్తకము ఇంకోచోటుకు తీసుకుని పోయి కొత్తపుస్తకములు తయారుచేస్తారు. Sales tax అనేది వసూలు చేసినట్లు లేకుండానే ఇంకొ లెక్కలు తయారుచేస్తారు. అందుచేతనే ఆంధ్రరాష్ట్రంలో దాదాపు ప్రతిసంవత్సరంకూడా కోటి, రెండుకోట్లు రూపాయలు sales tax ద్వారా రావలసింది రాకుండా పోతున్నదని చాలామంది చెప్పిన సంగతి మీకు తెలుసు. ఆ నష్టం చాలక, ఇపుడు advance collection అనేపేరుతో, వర్తకులను మీకు ఎంత అమ్మకము జరుగుతుందని అడగడం, వారు సుమారు ఇంత జరుగుతుందని చెప్పడం,

వారు చెప్పిన దాన్ని base చేసుకొని వసూలు చేస్తాము అని అంటున్నారు. ఏ వర్తకుడైనగాని ఎక్కువ అమ్ముతామని చెప్పడు. అమ్మేదానికంటె తక్కువే చెప్పుతాడు. లేకపోతే అతనికి వర్తకం చేసేదానికి తెలియదు, పనికిరాని మనిషి అని చెప్పవలసి యుంటుంది. అందుచేత తక్కువగా చెప్పుతారు. దాన్ని ప్రభుత్వము ఆధారంగా తీసుకొని, వసూలు చేస్తామని. సంవత్సరం పూర్తి అయిన తరువాత వారి లెక్కలను check చేస్తారని, దీనికి Commercial Tax Officer మొదలగు వారున్నారని అంటున్నారు. కాని వారు చూపే రసీదు పుస్తకాలు వాస్తవమైనవి కావు. ఇదివరకు చెప్పిన అంచనాల ప్రకారమే రసీదు పుస్తకాలు తయారు చేస్తారు. నిజమైన పుస్తకాలు బయట పెట్టరు. కనుక ఈ advance collection అనేది సరియైన principle కాదు. ఖచ్చితంగా వారు sales tax వసూలు చేసిన తరువాత మార్చినెల ఆఖరున వారి accounts అన్నీ check చేసి, వారివద్దనుండి ఎంత రావలసి యుంటుందో అంత రాబట్టడం తప్పితే, previous assessment మీద base చేసి advance collection అనేది వసూలుచేయడం సరైనది కాదు. దానివల్ల ప్రభుత్వానికి నష్టం వస్తుంది. ఎందుచేతనంటే, వారు అమ్మకం తగ్గిందనే చెప్పుతారు.

THE HON. SRI B. GOPALA REDDI :—ఎక్కువైందని మేము చెప్పుతాము.

SRI P. SUNDARAYYA :—అయితే వారు చెప్పినదాన్ని బట్టి వారు లెక్కలు చూపిస్తారు. కనుక ఇంకా మీరు చేయ కలిగితే, మీ ముఖము చూస్తూ ఉంటేనే, మీషాపు చూస్తూ ఉంటేనే మీకు ఇన్ని లక్షల వ్యాపారం అయి ఉంటుందని తెలుస్తున్నదని చెప్పి దాని ప్రకారం వసూలు చేయండి. ఆవిధంగాచేస్తే మీకు డబ్బూ వస్తుంది, ఉపాయమూ ఉంటుంది. కాని ఆ రకంగా చేయడం సాధ్యం కాదని ఈ advance payment సిద్ధాంతాన్ని తీసుకువస్తున్నారు. Advance payment అని ముందుగా ఇచ్చివేస్తే, మీమీద అంత పట్టు పట్టమని ఒక రకంగా వారికి హామీ ఇచ్చినట్లు అవుతుంది. మొత్తానికి ఈ సవరణ సరియైనటువంటిదికాదని దీనిని మేము వ్యతిరేకిస్తున్నాము.

SRI PILLALAMARRI VENKATESWARLU :—అధ్యక్షా! ఈ Sales Tax చట్టానికి amendments ప్రతి session లోను 1,2 వస్తూనే ఉంటాయి. దీనికి కారణమేమో అసలు మంత్రివర్గము ఆలోచించిందా అనే అనుమానం కూడ కలుగుతూ ఉంటుంది. ఎప్పటికప్పుడు difficulties వచ్చినపుడు

సవరణలు తెస్తావని మంత్రిగారు చెబుతున్నారు. ఈవిధంగా ఎప్పుడూ సవరణలు తెస్తూ ఉండడము, High Court అదికాదంటే మళ్ళీ దానికి సవరణ తీసుకు రావడము, ఈవిధంగా ఎంత కాలానికి సవరణలు చేయడముతో సరిపోతూందేగాని మరేమి మార్గం లేదనేటటువంటి స్థితిలో సంజీవయ్యగారు మాట్లాడుతూ ఉన్నారు. అసలు ఈ General Sales Act అంతా re-enact చేయవలసిన అవసరము ఏర్పడుతున్నది. పట్టాభిరామరావుగారు ఒక తడవ ఈ విషయం గురించి చాలా కష్టంగా చెప్పారు. సుమారు రెండు కోట్ల రూపాయలు ఆంధ్ర రాష్ట్రంలో sales tax ఎగవేస్తున్నారని చెప్పారు. కాని ఇన్ని సవరణలు తెచ్చినా ఈ రెండు కోట్ల రూపాయలు, పోయ్యేదాన్ని పట్టుకోడానికి ప్రయత్నం చేస్తారా అంటె అది ఏమి కన్పడంలేదు. అటువంటి సవరణలేవి కన్పడంలేదు. ఈనాడు వారి పార్టీలోనే అట్లాంటివి పెట్టగలిగినటువంటివారు ఉన్నారు. ఆ అవకాశామైనా తీసుకొని ఖచ్చితంగా ఈ రెండు కోట్ల రూపాయలు, మా దగ్గరనుంచి, మీదగ్గరనుంచి, ప్రభుత్వానికి ఇస్తామని ప్రజల దగ్గరనుంచి వసూలుచేసి ఎగవేస్తున్నటువంటి ఈ డబ్బును రాబట్టడానికి ఏమీ మార్గం కన్పడలేదు. వ్యాపారస్థులు చాలా తెలివిగలవారు. మేము ఎన్ని సవరణలు చేసినా, మాకు అందకుండా ఉన్నారు అన్నట్లయితే, ఇప్పుడు ఉన్నటువంటి C. I. D. వర్గాన్నంతా మా మీదనుంచి మరలించి, వారిమీదికి ప్రయోగిస్తే, ఇవన్నీ పట్టుకోడానికి ఉపయోగంగా ఉంటుందంటే ఆ విషయం అసలు ఆలోచించరు. ఆలాంటి పరిస్థితులలో మన ముఖ్యమంత్రిగారు మంత్రివర్గాన్ని నడుపుచున్నారు.

నేను ముఖ్యంగా serious గా వారికి విన్నవించేది యేమిటంటే యీ రకంగా bit by bit గా, ప్రభుత్వానికి యిబ్బంది కలిగినప్పుడల్లా, అవసరము వచ్చినప్పటిలో, ప్రతితడవ ఒక సవరణతెచ్చి యిక్కడ ప్యాసుచేయమని కోరేబదులు, గవర్నరుద్వారా ప్రకటనమూలంగా చేసేదానికన్నా అన్నివిషయాలు చేరేటట్లుగా ఒక సమగ్రమైన, ఖచ్చితమైన బిల్లును తయారుచేయవలసిన అవసరమున్నదని చెబుతున్నాను. ఇప్పుడు కాకపోయినా, వచ్చేశాసనసభ సమావేశమునకయినా అటువంటిబిల్లును ప్రవేశపెట్టుతారని ఆశిస్తున్నాను. ఈపర్యాయము యీబిల్లులో single point మీద, turn over మీద tax వేయడము అనేదాన్ని తీసుకొనివచ్చారు. ఇందులో single point taxation మాత్రమేకాదు. Multiple point taxation విషయము కూడావున్నది. అసలు దీనికి అన్నివిషయాలు చేరేటట్లు ఒక principle settle చేసి ఒక సమగ్రమైన బిల్లును తీసుకొని రావలసిన అవసరము వున్నది. General Sales Tax Act మీద ఎన్నిసవరణలు తెచ్చినను, అసలు మన

ప్రభుత్వానికిరావలసిన ఆదాయము అంతయు ఒకదమ్మిడీకూడా విడవకుండా వసూలు అయ్యే మార్గము కనిపెట్టాలి. ఇంతవరకు అమలులోవున్న general sales tax ను వసూలుచేసే విధానము సరియైనది కాదు. అందువల్లనే మన రాష్ట్రమునకు రావలసిన యీ general sales tax మీద రావలసినపన్ను యితరదేశాలలో లక్షలకొద్ది మిగిలి పోయినదని తెలుస్తున్నది. ఆ డబ్బు వసూలుచేసేమార్గము ప్రభుత్వము కనిపెట్టి వసూలుచేయలేకపోయింది. మనకు సుమారు రెండుకోట్లవరకు వసూలు కావలసి ఉన్నదని అంటున్నారు. ఆ ధనము అంతయు సక్రమంగా వసూలుచేస్తే, ప్రస్తుతము మన ముఖ్యమంత్రి గోపాలరెడ్డిగారు తలపెట్టిన new taxation proposals అన్ని విరమించుకుంటే, విరమించుకోవచ్చు. ఆ మొత్తము అంతా వసూలుచేయుటానికి ప్రభుత్వానిక అవకాశాలు లేకుండా పోతున్నవి. మొట్టమొదట మనకు రావలసిన ఆదాయము సక్రమంగా వసూలుచేయాలి. అదేవిధంగా కేంద్రప్రభుత్వమువారికికూడా income tax సుమారు 160 కోట్లవరకు వ్యాపారస్థులు ఎగరగొట్టుతున్నారని తెలుస్తున్నది. కేంద్రప్రభుత్వమువారు యీ డబ్బుఅంతా వసూలుకాలేదని గోల పెట్టుతున్నారు. మన ప్రభుత్వమునకుగూడా రావలసిన sales tax నుంచి వచ్చే ఆదాయము కాకుండా, ముఖ్యంగా దేశభక్తులనిపించుకొను వారు, ఎగవేయుటం జరుగు తున్నదేగాని, యీ సొమ్ము వసూలుఅయ్యేమార్గము ఎక్కడా కనిపించడము లేదు. ఇందుకుగాను ఖచ్చితమైన చట్టాన్ని ఒకటి తయారుచేయాలి. కాబట్టి ప్రభుత్వము యిప్పటికయినా యీ ఆదాయము వసూలుపరచటానికి సరియైన మార్గాలను అన్వేషించి ఒక ఖచ్చితమైనబిల్లును తెస్తారని ఆశిస్తున్నాను. అంతేకాని, యీ విధంగా tit-bits మాదిరిగా ఎన్ని సవరణలు తెచ్చినా, యిది సమగ్రమైనబిల్లు, సరియైన పద్ధతి అనిపించుకోదు. గనుక యీ సవరణబిల్లువల్ల లాభము లేదని చెబుతున్నాను. మంత్రిగారు యీ సంగతులు పునరాలోచించి ఒక సమగ్రమైనబిల్లును తెస్తారని ఆశిస్తూ విరమిస్తున్నాను.

SRI T. JALAYYA:—అధ్యక్షా, ఈ advance sales-tax ను ముందుగా కట్టేపద్ధతి యింతవరకు రూల్సు రూపములో వసూలుచేస్తున్నారు. కాని యీ పద్ధతి సరియైనది కాదని హైకోర్టువారు, సుప్రీంకోర్టువారు యీ ప్రభుత్వానికి వ్యతిరేకముగా తీర్పుయిచ్చారు. అందువల్ల యీ వసూలురూల్సు రూపములోవుండేది తీసివేసి, చట్టరూపములో తేవాలని, యీనాడు యీ బిల్లును ప్రభుత్వమువారు ప్రవేశపెట్టియున్నారు. అందుకు నేను ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. వ్యాపారస్థులలో ఎగవేయడము అనేది ఎప్పుడు ఏర్పడుతున్నదంటే, వారు కట్టవలసిన మొత్తములు ప్రభుత్వము ఎప్పటి మొత్తము అప్పుడు వసూలుచేయకుండా భాకీ

పెరిగిపోయి, వేలకోలది, లక్షలకోలది పేరిపోయి ఒక్కసారిగా కట్టమని ఆదేశం చేటప్పటికీ, వ్యాపారస్థుడు ఆ డబ్బుఅంతా ఒక్కసారిగా కట్టలేక ఎగగొట్టటానికి ప్రయత్నిస్తున్నాడే కాని, ఎప్పటి tax అప్పుడు వసూలుచేస్తే, యీ ఎగవేతలకు దారితంజేదికాదు. నిజానికి యింతడబ్బ ఒక్కసారిగా కట్టవలెనంటే, వ్యాపారస్థునికి బుద్ధిపుట్టదు. ఈ విషయము నిజమేనని నేను ఒప్పుకుంటున్నాను. ఈ డబ్బు ఎప్పటికప్పుడు వసూలుచేయ ప్రారంభిస్తే, వ్యాపారస్థుడనే ప్రతివ్యక్తీ గూడా మనస్సులో ఏ కల్మషము లేకుండా మనస్ఫూర్తిగా కట్టుతాడని నమ్మవచ్చును. కాని ప్రభుత్వము ఆ విధంగా చేయలేదు. అందువల్ల యీ బాకీ బాకీలు క్రిందపడి పెరిగిపోయింది. కాబట్టి యీ బిల్లును ప్రభుత్వమువారు ప్రవేశపెట్టడమనేది, వ్యాపారస్థుని క్షేమమునకేనని నా అభిప్రాయము. వాస్తవముగా యీ ఎగవేతలు ఎప్పటినుంచి ప్రారంభమైనవంటే, కమ్యూనిస్టుపార్టీ ఏర్పడిన తరువాతనేనని నా అభిప్రాయము. అంతకుముందు వ్యాపారస్థుడు న్యాయముగా కట్టవలసిన డబ్బు కట్టుతూవచ్చాడు. ఆ విధంగా వ్యాపారస్థుడు Tax కట్టడము ఎగగొట్టకుండా దోహదమిచ్చేపద్ధతి, సదుపాయాలు ప్రభుత్వము వ్యాపారస్థులకు కల్పించినట్లైయితే, బాగావుంటుంది. అదిగాకుండా వ్యాపారస్థులను మర్యాదగాచూస్తే, యీ Tax యింకా ఎక్కువ రావటానికి వీలుఅవుతుంది. కాబట్టి యిప్పటికైనా యీ బిల్లు తెచ్చినందులకు మంత్రివర్గాన్ని అభినందిస్తున్నాను. ఇకమీదటనైనను కమ్యూనిస్టుపార్టీవారు వ్యాపారస్థులు ఎగగొట్టేవారనే పదము వుపయోగించకుండా వుంటే బాగావుంటుందని నా కోరిక. ప్రభుత్వమువారు తెచ్చిన యీ బిల్లు వ్యాపారస్థుల క్షేమముకొరకు కాబట్టి, యీ బిల్లును ప్యాసుచేయమని కోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

SRI V. VISWESWARA RAO :—అధ్యక్షా, నేను శ్రీ జాలయ్యగారుచెప్పిన pointను meet చేయటానికి మాట్లాడటముకాదు. నేను ఈGeneral Sales Tax విషయములో ప్రతిశాసనసభా సమావేశములోనూ, లేకపోతే ప్రతి సంవత్సరమూ, యీ Tax విషయములో ఏదో ఒకరకమైన సవరణను ప్రభుత్వమువారు ప్రవేశపెట్టి ప్యాసుచేయించుకుంటూనే వున్నారు. ఇదంతాచూస్తే, co-fusion గా కనబడుతున్నది. అందులో నాకు వ్యాపారస్థులతో ఏలాంటి సంబంధము లేనందువల్ల యీ Tax విషయము మరింత confusion గానే వుంటున్నది. జాలయ్యగారు చెప్పినది ఒక విధంగా నిజమేననుకుంటున్నాను. వ్యాపారస్థులు యివ్వతేలిన అప్పయేదైనాసరే అది పెద్ద అప్పగావుంటే, దాన్ని ఎగగొట్టటానికే వారు ప్రయత్నిస్తారు. ఇది నిజమే. సామాన్యులు ఎవరూ ఎగ

గొట్టారు. పెద్ద వ్యాపారస్థులు అయినందువల్ల వీరు ఎగగొట్టేవారనే చెప్పవలసి
వున్నది. ఈ విధంగా అప్పు ఎగగొట్టకుండా, ఏదైనా పద్ధతి ఒకటి
ప్రభుత్వము ఆలోచించాలి. వీరు అప్పు ఎగగొట్టడమనేది అది కేవలము.
కమ్యూనిస్టుల సలహామీద మాత్రం కాదని నేను చెప్పగలను. అప్పు పెరిగి
పోతే, అది తీర్చటానికి యిష్టము లేకపోతే, ఎగగొట్టటానికి వర్తకులైనవారు
ప్రయత్నిస్తారేగాని, దీనికి కమ్యూనిస్టు సలహా పనిలేదు. ప్రభుత్వమువారు అప్పు
డప్పుడు tit bits లాంటి సవరణలు తేవడమువల్ల యిది అంతా confusin క్రిందకు
వస్తున్నది. ఈ మధ్య Superme Court వారు, Inter-State Taxation మీద
ఒక తీర్పుయిచ్చారు. ఆ తీర్పువల్ల మనరాష్ట్రానికి రావలసిన సుమారు మూడుకోట్ల
రూపాయలు యితర రాష్ట్రములలో మిగిలిపోయిందని ఈ మధ్యనే మన మంత్రి
సంజీవయ్యగారు బెజవాడలో చెప్పారు. ఇక బెజవాడ మార్కెటుకు సంబంధించి
సంతవరకు సుమారు పదిలక్షలరూపాయలవరకు యితరరాష్ట్రములలో వుండిపోయిం
దని అన్నారు. ముఖ్యంగా బొంబాయి వ్యాపారస్థులు మనరాష్ట్రానికి యివ్వవలసిన
డబ్బు యివ్వకుండా, వారియొక్క పెట్టుబడులు వుపసంహరించుకొని, మనకు రావల
సిన డబ్బుతోనే వారు వ్యాపారము చేసుకొంటున్నట్లుగా తెలిసింది. ఈ విషయము
మనకు యిక్కడవున్న whole sale వర్తకులు చెప్పుతున్నారు. ప్రభుత్వమువారు
ఎప్పటికప్పుడు ఒక taxation పెట్టడము, అది వసూలుకాక విసుగులో దిగడము
జరుగుచున్నది. అందువల్ల హైకోర్టువారు, సుప్రీంకోర్టువారు మన ప్రభుత్వానికి
వ్యతిరేకముగా తీర్పుచెప్పడము జరిగింది. దీనివల్ల ఏమి జరిగిందంటే, ప్రజలనుంచి
నిర్బంధముగా ప్రభుత్వము వసూలుచేసిన సొమ్ము అంతా, యీ whole sale వ్యాపా
రస్థులవద్దనుండి పోవడము జరుగుచున్నది. దానిని సక్రమంగా వసూలుచేయటానికి
ప్రభుత్వము యే విధమైన చర్యతీసుకోలేదు. ఆ వసూలుచేయడములోకూడా ప్రభు
త్వము సకాలములో వసూలుచేయవలసివున్నది. ఇంతవరకు ఆ డబ్బు వసూలుకాలేదు.
అందువల్ల general గా రాష్ట్రపరిస్థితుల దృష్ట్యా, అనేక సందర్భములు అనేక విధ
ములుగా జరుగుచున్నవి. కాబట్టి ప్రభుత్వము యీ tax వేసి వసూలుచేసే పద్ధతికూడా
మార్పుచేయవలసి వున్నది. అందుకుగాను యీ సవరణలన్నీ ఒక వైపునపెట్టి, ఒక
సమగ్రమైన బిల్లును తేవాలని కోరుతున్నాను. ఇంతవరకు మనకు రావలసిన tax
మొత్తము ప్రభుత్వము యింతవరకు వసూలుచేయలేకపోతున్నది. వసూలు చేయలేదు.
ఇకమీదటనైనను సమగ్రమైన బిల్లు తెస్తే, ఆ డబ్బు వసూలు అవుతుంది. ఇతర
రాష్ట్రములలోవున్న మనకు రావలసిన డబ్బు విషయములోగూడా Supreme Court
వారు Judgment యిచ్చింది ఈ Judgment చెప్పి యిప్పటికి సుమారు ఒకటిన్నర
రెండు మాసాలు కావచ్చింది, ఇతర రాష్ట్రములలోవున్న మనకు రావలసిన

మూడు కోట్ల రూపాయలు వసూలుచేయటానికి ప్రభుత్వము యేమిచర్య తీసుకోదలచిందిన్నీ తెలియులేదు. కాని వ్యాపారస్థులు కోరేది యేమిటంటే ఆంధ్రరాష్ట్రమునకు రావలసిన మొత్తములు ప్రభుత్వమువారు వసూలుచేయకపోతే ఆడబ్బు మేము refund తీసుకోవచ్చునని ప్రకటిస్తే, దాన్ని మేమే వసూలుచేసుకుంటామని అంటున్నారు. ఆ విధంగాచేస్తే, వ్యాపారస్థులకు వ్యాపారస్థులకు మధ్య లావాదేవీలువున్న కారణము చేత యీ డబ్బు సులభముగా వసూలు చేసుకోగలుగుతామని అంటున్నారు. ఆ విధంగా లేకపోతే, యీ డబ్బంతా లక్షలుకొద్ది పెరిగిపోతుంది. అదంతా కట్టటానికి వారికి యిష్టము లేనందువల్ల, ఎగగొట్టటానికే ప్రయత్నిస్తారు. ఈ డబ్బు విషయములో ప్రభుత్వము యేవిధమైన చర్య తీసుకోకుండావుంటే, ఎక్కడి డబ్బు అక్కడనే వుండిపోతోంది. గనుక ప్రభుత్వము వెంటనే యీ డబ్బు వసూలుచేయుటానికి తగిన చర్య తీసుకోవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

SRI K. SUBBA RAO:—అధ్యక్షా, శ్రీ విశ్వేశ్వరరావుగారు, వెంకటేశ్వర్లుగారు చెప్పినట్లు యీ Sales Tax Bill ను separate గా, మరల ఆలోచించి చక్కగా తీసుకొని వచ్చేటందుకు ఎవరుకూడా అభ్యంతరము పెట్టేవారు లేరు బిల్లులోని సిద్ధాంతము తప్పుఅని చెప్పి ప్రభుత్వము ఒప్పుకోలేదు. రూల్సును చేసుకొని యీ tax ను యింతవరకు వసూలుచేసేపద్ధతి బాగాలేదు కాబట్టి యీ పద్ధతిన వసూలు చేయుటకు ఒక బిల్లురూపములో పెట్టి, ఒక యాక్టుగా తయారుచేయాలన్న కారణముచేత యీ బిల్లును ప్రభుత్వమువారు తీసుకొని వచ్చినారు. ఇది మామూలుగా జరుగుతూన్న విషయమే. ఇందులోని సౌకర్యమునుబట్టే, యీ బిల్లుయొక్క అవసరము వచ్చింది. కొంతమంది సభ్యులు పన్నులు ముందుగా వసూలుచేయడము ధర్మముకాదని చెబుతున్నారు. ఈ వ్యాపారస్థుని వద్దనుంచి యింతపన్ను వసూలు అవుతుందని కొంత తెలిసివుండడము మంచిదా కాదా? భూమిశిస్తుకూడా మూడుసార్లుగా వసూలుచేస్తున్నారు. రైతులనుంచి ఎంతడబ్బు వచ్చేదిన్నీ జమాబందీ అయ్యేవరకు తెలియదు. కాని సౌకర్యార్థము రైతులనుంచి వసూలు చేయుటానికి రైతులకు యిబ్బందిలేకుండా వసూలు చేస్తున్నారు. అట్లాగే యీ Sales Tax వసూలుచేసే విషయములోకూడా జాలయ్యగారు అనుభవజ్ఞులు, వ్యాపారస్థులు గనుక వారు చెప్పారు. ఈ డబ్బుఅంతా ఒక్కసారిగా లెక్కఅంతా జమచేసి, ఒక వ్యాపారస్థునికి మీరు 20 వేల రూపాయలు Sales Tax కట్టాలి అని చెప్పితే, ఆ వ్యాపారస్థుడు డబ్బుఅంతా ఒక్కసారిగాకట్టలేక అప్పటికప్పుడు దగాచేయటానికి ప్రయత్నిస్తాడు. ఆ విధంగా దగాచేయటానికి వీలుంటుంది. ఆ విధంగా కాకుండా యీ Sales Tax ఏ మాసానికి ఆ మాసము నీవు ఒక చెక్కుద్వారా పంపించవలె

సింది అని చెప్పితే, ఆ విధంగా తేలికగా చెల్లించటానికి అవకాశము ఉంటుంది. ఇదివరకుగూడా చెక్కులు పంపడము పద్ధతి ఉన్నది. అయితే ఆ చెక్కు ఎవరికో బిల్లు కలెక్టరుకుయిస్తే ఆడబ్బు ఆయన తినివేసిన కారణముచేత అట్లాకాకుండా ఇప్పుడు వారుపంపించే చెక్కు treasury కే పంపితే, యిటువంటి దగాకు అవకాశము వుండదు. కట్టేవారికిగూడా చాలా సులువుగా వుంటుంది. కాబట్టి యిటువంటి సిద్ధాంతాన్ని చట్టరీత్యా మనము ఒప్పుకుంటే, వ్యాపారముచేసే ప్రతిఒక్కరుకూడా తప్పకుండా మాసానికి ఒకసారి యీడబ్బు కట్టుకుంటూ ఉంటాడు. ఇంకా మాసాంతానికి అతను యింకా ఏదైనా యివ్వవలసిఉంటే, అతను ఆ balance కూడా కట్టుకోటానికి వీలు కలిగించుకుంటాడు. ఇదే ఒక అంచనా ఉంటుంది. లేకపోతే ప్రభుత్వమువారికి అంచనా వేసేటప్పుడు ఏ వ్యాపారస్థుని వద్దనుంచి ఎంత వస్తుందో, యీ Sales Tax మూలంగా ఎంతరాగలదో ప్రభుత్వానికిమటుకు అంచనావేయటానికి ఎట్లా తెలుస్తుంది? ఇది తెలియకపోతే ప్రభుత్వమువారు, మటుకు బడ్జటు అంచనా ఎట్లా వేయగలరు? ఆ అంచనాకొరకు ఒకబడ్జటు సభచేసి డబ్బురానిదే, డబ్బు యింత వస్తుంది అని అంచనా వేసుకొని, లెక్కవేసుకొనిచూస్తే, యీ మనిషినుంచి యింతవస్తుంది, పోయిన సంవత్సరము యీ వ్యాపారస్థుడు యింత వ్యాపారము చేశాడు, యితనివద్దనుంచి యీ సంవత్సరముకూడా యింతడబ్బు మాస మాసానికి రాగలదు, అనే విషయాలుఅన్నీ ఆలోచించి ఒకఅంచనా వేసుకోటానికి సౌకర్యముగా వుంటుంది. గనుక ఇటువంటి సిద్ధాంతము యిదివరకు ప్రభుత్వమువారు ఒప్పుకొని రూల్సు రూపములో వసూలు చేస్తూ వచ్చారు. అటువంటిది రూల్సు రూపములో ఉంటే సౌకర్యము లేదని యిది ఒక చట్టరూపములో తెచ్చి వసూలు చేయటానికి ప్రభుత్వానికి సౌకర్యముకొరకు ఏర్పాటుచేసుకొనే వుద్దేశ్యముతో యీబిల్లు తెచ్చారు. ఈ సిద్ధాంతము యిదివరకు వున్నదేగనుక, యిదివరకురూల్సు రూపములోవున్నది. ఇప్పుడు అది చట్టరూపము లోనికి మార్చుతున్నారు. అంతేకాని యిందులో తేడా ఏమీలేదుగనుక సభ్యులు దీన్ని ఒప్పుకోవలసిందిగా ప్రార్థిస్తున్నాను.

5-00 p.m.

SRI PRAGADA KOTAIAH :—అధ్యక్షా, ఈసవరణను అంగీకరించడమువల్ల వర్తకులకు ఇబ్బందులు కలుగుతాయనే అనుమానము మన సోదరులకు కలిగింది. అది ఎంతమాత్రము లేదని మనవిచేస్తున్నాను. ప్రతినెలవరకు turn over list పంపమని అంటే వారు ఆ జాబితా పంపుతారు. తరువాత వారు ఎంతపన్ను కట్టాలెనో assess చేయవచ్చు. అప్పుడు కట్టవచ్చును. కాని సంవత్సరం ఆఖరు దాకా వేచిఉండాలంటే మార్చి ఆఖరుకు వారువ్యాపారము కట్టివేయడము సంభవిస్తే

ఆపన్న వసూలు చేయడముకూడా సాధ్యముకాదు. అందువల్ల ప్రతినెలా పన్ను వసూలు చేయాలని చెప్పడంలో పెద్దవివాదము ఏమీలేదు. కాని అమ్మకం పన్నుచట్టమును గురించిమాత్రం చాలా వివాదాలు ఉన్నాయి. దీని విషయంలో ప్రభుత్వము హెచ్చుశ్రద్ధ తీసుకోవడము లేదనిపిస్తున్నది.

MR. SPEAKER :—It is not relevant. You are making a general survey of all the provisions.

SRI PRAGADA KOTAIAH :—డబ్బురానడము ఎలా అనేవిషయమై చెబుతున్నాను.

MR. SPEAKER : We are having another Bill of taxation.

ఈబిల్లును సంబంధించినంతవరకు వర్తకులకు ఎలాంటి ఇబ్బందులు లేవు. అందువల్ల దీనిని ఆమోదించడం శ్రేయస్కరమని చెబుతున్నాను.

SRI S. VEMAYYA :—అధ్యక్షా, ఇటువంటి సవరణబిల్లులు తీసుకొని రావడం సాధారణంగా కోర్టుతీర్మానాలను అనుసరించే తీసుకురావడము జరుగుతుంది. సవరణలను మనకు అందజేసినప్పుడే కోర్టువారు తీర్పు కాపీలుకూడా అందచేసినట్లయితే సభ్యులు ఆతీర్పును చూచికొని దానిని దృష్టిలో పెట్టుకొని కోర్టువారితీర్పులకు విరుద్ధంగా ఉండకుండా చట్టం ఏవిధంగాచేస్తే బాగుంటుందో తెలుసుకొనుటకు అవకాశముంటుంది. మంత్రిగారు కోర్టువారి తీర్పు కాపీలను ఇకముందు అయిన అందచేస్తే బాగుంటుందని కోరుతున్నాను. ఒరిజనలు క్లాజు కాపీలు మిగతాబిల్లులకు వున్నాయికాని ఈబిల్లులో లేవు. అవి verify చేసుకోకుండా ఏమైనా చేయబోతే ఏమీ తోచడములేదు. ఇక రాబోయేవాటికయినా ఆవిధంగా చేస్తారని చెప్పి ఆశిస్తున్నాను. కాని ఇప్పుడు కొంతమంది ఈసవరణను వర్తకులకు ఇబ్బందులు ఉన్నవని చెబుతున్నారు. కాని నాదృష్టికి తోచినంతవరకు గవర్నమెంటుకు ఇతరులకుకూడా చాలా ఇబ్బందులు వున్నాయి. నువ్వు ఎంత అమ్మితావో turnover list వేసి పంపమంటే ఆ వర్తకుడు తక్కువవేసి పంపవచ్చును. ప్రభుత్వంవారు వర్తకుడు తప్పులెక్కలు పంపినాడని అనవచ్చు. అందువల్ల ప్రభుత్వానికి చాలా తక్కువ ఆదాయం రావచ్చు. అందువల్ల వివాదము రావచ్చు. ప్రభుత్వానికి, వర్తకునకు వివాదము వస్తుంది కాబట్టి ఈ Tournover అడ్వాన్సుగా ఇవ్వడనుఅనేది లేకుండా మరొక విధానాన్ని అవలంబిస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ఇప్పుడు మాట్లాడిన సభ్యులంతాకూడా ప్రభుత్వానికి

చాలా డబ్బు వసూలు కేకుండా పోతోందని చెబుతున్నారు. నిలబడిపోవడానికి కారణము వసూలు కాకపోవడమా, లేక ఎగడమావేయు, లేక సిబ్బంది తక్కువగా ఉన్నందువల్లనా అని తెలకుండాఉన్నది. ఇందుకు కారణం సిబ్బంది తగుమైనటు వంటి లెక్కలు తయారుచేసి వసూలుచేయలేక పోవడ మేనని నాకు తోస్తోంది. సిబ్బందిని ఎక్కువచేస్తారేమో తెలుసుకోవలసిఉన్నది.

ప్రభుత్వాన్ని ఇంకొక విషయముకూడా అడిగి తెలుసుకోవాలి. పూర్వము Revenue Department క్రిందనే సేల్సుటాక్సు Department కూడా కలిసి వుండేది. ఇప్పుడు రెండూ వేరుచేయడం జరిగింది. అట్లా మీరు విడదీయడమువల్ల.

Mr. SPEAKER :—ఈ విషయం బడ్జెటు సందర్భంలో మాట్లాడితే more appropriate గా వుంటుంది. చిన్న amendment దగ్గర మీరు పాలసీని గురించి అడిగితే బాగుండదు.

SRI S. VEMAYYA :—రెవెన్యూడిపార్టుమెంటుకు సిబ్బంది తక్కువగా వుండటమువల్ల డబ్బు మనకు అక్కడక్కడ వసూలు లేకుండాపోతోంది. కనక రెవిన్యూ డిపార్టుమెంటుకు మొదటవున్నట్లు విస్తరింపజేయడము గాని, స్టాఫ్‌ను అధికము చేయడానికిగాని పూనుకుంటారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

SRI I. RAMACHARYULU :—Advance గా మొత్తము collect చేయడము దానిమీద సరియైన సమాధానం వచ్చినట్లుగా కనపడదు. బహుశః వ్యాపరస్తులదగ్గరనుంచి ఏ నెల కానెల వసూలుచేయడం మంచిదనే ఉద్దేశ్యంతో ఈ విధంగా ప్రభుత్వంవారు చేయదలచి ఉండవచ్చును. రైతులవద్దనుంచి భూమి శిస్తును వాయిదాలలో వసూలు చేస్తున్నట్లే వర్తకులవద్దనుంచికూడా అమ్మకం పన్నును వాయిదాలలో వసూలుచేయడం ఉభయత్రానుంచి దీని ప్రభుత్వంవారు అభిప్రాయపడిఉండవచ్చు. ఈ సవరణవల్ల ఇటు ప్రభుత్వానికి అటువర్తకులకు సౌకర్యం కలుగగలదుగా దీనిని నేను బలపరుస్తున్నాను.

THE HON. Sri D. SANJIVAYYA :—అధ్యక్షా, చాలామంది గౌరవ సభ్యులు ఈ సవరణబిల్లుకు సుముఖంగా మాట్లాడినారు. ముందుగా పన్నువసూలుచేసే పద్ధతితప్పని హైకోర్టుతీర్పులోలేదు. ముందుగా పన్నువసూలుచేసే అవకాశంచట్టంలో లేదు. కనుక ఆ చట్టంలో ఇందుకు నిబంధనలను చేర్చనిదే ముందుగా పన్నువసూలు చేయడము మంచిదికాదన్నారు. కోర్టువారు సుందరయ్యగారు మాట్లాడుతూ ఈ పన్నులను ముందుగా వసూలుచేయడము సరియైనది కాదన్నారు. పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు మాట్లాడుతూ ఈ సేల్సుటాక్సు వసూలు విధానంలో చాలా లోపాలు

ఇబ్బందులు ఉన్నయన్నారు. దానిని కటుదిట్టము చేయడానికి ఎంతో అవకాశము వున్నదన్నారు. మాటిమాటికి ఈ చట్టానికి చిన్న చిన్న సవరణలు తీసుకురావడము బాగుండలేదు, కనుక దీనిని సమగ్రంగా పరిశీలించి, చట్టాన్ని కట్టుదిట్టం చేయాలన్నారు. ఈ చట్టమునకు సమగ్రమైన సవరణబిల్లు మరొకటి తయారై సిద్ధంగా వున్నది. దానినివచ్చే సమావేశంలో తప్పక ప్రవేశపెడతాము. కాబట్టి ఈ బిల్లును సభవారు ఆమోదించాలని కోరుతున్నాను.

MR. SPEAKER : The question is :

"That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955, be taken into consideration."

The motion was carried.

CLAUSE 2.

MR. SPEAKER : There are two amendments under this clause. One is by Sri Vavilala Gopalakrishnayya and the other is a Government amendment.

SRI VAVILALA GOPALAKRISHNAYYA : I am not moving my amendment.

THE HON. SRI D. SANJIVAYYA : Sir, it would be a happy wording if the proviso to clause (2) is amended thus :

"Provided that the tax for each year may be provisionally assessed, levied and collected in advance during the year, in monthly or quarterly instalments on the basis of estimated or actual turnover of the dealer and for that purpose a dealer may be required to submit a return or periodical returns of estimated or actual turnover in such manner as may be prescribed ; and....."

పై సవరణను నేను ప్రతిపాదిస్తున్నాను.

MR. SPEAKER : I take it nobody wants to speak on this. So I put the motion to the vote of the House. The question is :

Substitute the following for the existing proviso :—

"Provided that the tax for each year may be provisionally assessed, levied and collected in advance during the year, in monthly or quarterly instalments on the basis of estimated or actual turnover of the dealer and for that purpose a dealer may be required to submit a return or periodical returns of estimated or actual turnover in such manner as may be prescribed ; and..."

The motion was carried.

Clause 2 as amended was put and carried.

Clause 3 was put and carried.

Clause 4 was put and carried.

Clause 1 was put and carried.

The preamble was put and carried.

THE HON. SRI D. SANJIVAYYA : Sir, I beg to move :

"That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955 be passed into law."

MR. SPEAKER : Motion moved :

"That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955 be passed into law."

Sri S. VEMIAH :—అధ్యక్షా, చాలామంది గౌరవసభ్యులు ఈ బిల్లులో చేయవలసిన సవరణల గురించి చెప్పారు. ముఖ్యంగా శ్రీ జాలయ్యగారు ఎప్పటి కప్పుడు పన్ను చెల్లించడం వర్తకులకు సులభమని సంవత్సరమునకంతకు కలిపి ఒకేపర్యాయం పన్నుకట్టవలెనన్నచో వర్తకులకు అదంతా పెద్ద మొత్తముగా కనపడి ఎగవేయుటకుకూడా కొన్ని సందర్భాలలో వారు ప్రయత్నించవచ్చునని చెప్పినారు. అందుచేత సంవత్సరంలో మొత్తం అమ్మకములకు ముందుగానే అంచనాలను తయారు చేసి వర్తకులు అధికారులకు పంపవలెనని, తరువాత అధికారులు నిర్ణయించిన ప్రకారం వర్తకులు పన్నులు చెల్లించాలని ఉన్నది. ఈ చెల్లింపు అడాన్సుగా ఏనెల కానెలగాని, మూడు మాసములకొక పర్యాయంగాని చెల్లించవచ్చుననికూడా అన్నారు. ఏనెల కానెల అని చెప్పేదానికంటె మూడు మాసములకు ఒకపర్యాయం కట్టవలెనంటేనే బాగుంటుందనుకుంటాను.

MR. SPEAKER : The question is :

That the Madras General Sales Tax (Andhra Amendment) Bill, 1955 be passed into law.

The motion was carried and the Bill passed into law.

MESSAGE FROM THE GOVERNOR.

MR. SPEAKER : I have to announce to the House that the following message, dated the 26th August, 1955 has been received from the Governor :

In pursuance of Article 207, clause (1) of the Constitution of India, I, Chandulal Madhavlal Trivedi, Governor of Andhra, hereby give my recommendation to the introduction in the Legislative Assembly of the Madras Tobacco (Taxation of Sales and Registration) (Andhra Amendment) Bill, 1955.

## (6) THE MADRAS TOBACCO (TAXATION OF SALES AND REGISTRATION) (Andhra Amendment) Bill, 1955.

THE HON. SRI D. SANJIVAYYA : Mr. Speaker, Sir, I beg to introduce the Madras Tobacco (Taxation of Sales and Registration) (Andhra Amendment) Bill, 1955 and move that the Bill be taken into consideration atonce.

MR. SPEAKER : Motion moved :

"The Madras Tobacco (Taxation of sales and Registration) (Andhra Amendment) Bill, 1955 be taken in to Consideration at once

The motion was put and carried.

Clauses 2, 3 and 1 were put to vote and carried.

The Preamble was put and carried.

THE HON. SRI D. SANJIVAYYA : Sir, I move

"that the Madras Tobacco (Taxation of Sales and Registration) (Andhra Amendment) Bill, 1955 be passed into law."

The motion was put and carried, and the Bill was passed into law.

MR. SPEAKER : I now adjourn the House till 11 a.m. to-morrow.

The House then adjourned.

## PAPERS LAID ON THE TABLE OF THE HOUSE.

(1) Motor Vehicles—Taxation—Transport Vehicles plying on inter-State routes between Andhra and Mysore. (G.O. Ms. No. 1379, Public Works and Transport, dated 22nd July 1955.)

(2) Motor Vehicles Rules—Transport Vehicles—Fitness certificate issued by certain neighbouring States—Validity in Andhra State—Amendment to Rule 101 of the Madras Motor Vehicles Rules, 1940. (G.O. Ms. No. 1478, Public Works and Transport, dated 15th July 1955.)

(3) Accounts—Appropriation Accounts of Government of Madras for 1951-52 and Audit Report, 1953, and Finance Accounts of Government of Madras for 1951-52 and Audit Report, 1952.

(4) Motor Vehicles—Taxation—Notifications. (G.O. Ms. Nos. 200 and 201, Public Works and Transport, dated 30th December 1953.)

(5) Cottage Industries—Madras Cottage Industries Loans and Subsidy Rules, 1948—Amendment to Rules. (G.O. Ms. No. 1334, Industries, Co-operation and Labour Department, dated 23rd June 1955.)

# APPENDIX 1

DEPARTMENT OF INDUSTRIES, CO-OPERATION AND LABOUR.

STATEMENT PLACED ON THE TABLE OF THE HOUSE

(*VIDE* ANSWER TO STARRED QUESTION No. 287.) (S. No. 386) printed at page 13 supra.

*Settlement of disputes over the closure of factories in* 1954.

*Andhra Dress Manufacturing Company, Chirala, Guntur district.*—A worker was manhandled in front of the Company by outsiders due to some faction and it is alleged that one cutting maistry instigated the fight as the worker was not willing to join the Union. Fearing further occurrences of a similar nature, the proprietor declared lockout with effect from 20th March 1954. On the intervention of the Labour Officer and the Assistant Commissioner of Labour, the management agreed to lift the lockout and re-open the establishment with effect from 22nd March 1954, and to take back all the workers.

2. *Tungabhadra Industries, Kurnool.*—The President of the Tungabhadra Industries Labour Union, Kurnool made a telegraphic representation on 4th June 1954, that the factory was closed down since 31st May 1954, on the plea of adverse trade conditions and that 500 workers were consequently thrown out of employment. On the intervention of the Labour Officer, Anantapur, the workers resumed work in the factory from 7th June 1954 when it was re.opened. The management was advised to pay the workers lay off compensation for the duration of the closure (i.e.,) from 31st May 1954 to 6th June 1954, as per the provisions of the Industrial Disputes Act, 1947.

3. *Gudlavalleru Rice Mills, Gudlavalleru, Krishna district.*—Employers of certain Rice Mills at Gudlavalleru, Krishna district locked out workmen following the strike on 22nd July 1954, which was organised by workers to express their sympathy in respect of the workman who had been manhandled by a clerk in one of the factories for his refusal to take up work in the early hours on 21st July 1954. After exhaustive discussions with the parties, the Labour Officer and the District Superintendent of Police, Krishna, brought about a settlement between the parties and the workmen resumed work on 1st August 1954.

# APPENDIX II

## STATEMENT PLACED ON THE TABLE OF THE HOUSE.

[VIDE ANDHRA LEGISLATIVE ASSEMBLY (STARRED) QUESTION No. 192.] (S. No. 387) printed at page 14 supra

LIST OF MARKETING SOCIETIES IN ANDHRA STATE.

*Rajahmundry Circle.*

1. Amalapuram Konaseema Loan and Sale Society at Amalapuram.
2. Rajahmundry Konaseema Loan and Sale Society at Rajahmundry.
3. Thatipaka Konaseema Loan and Sale Society at Thatipaka.
4. Manepalli Konaseema Loan and Sale Society at Manepalli.
5. Sakhinetipalle Konaseema Loan and Sale Society at Sakhinetipalle.
6. Mori Konaseema Loan and Sale Society at Mori.
7. Uppalaguptam Konaseema Loan and Sale Society at Uppalaguptam.
8. Pasarlapudi Konaseema Loan and Sale Society at Pasarlapudi.
9. Ambajipet Marketing Society at Ambajipet.
10. Narendrapuram Co-operative Marketing Society at Narendrapuram.
11. Ryali Marketing Society at Ryali.

*Kakinada Circle.*

1. Tapeswaram Loan and Sale Society at Tapeswaram.
2. Alamur Loan and Sale Society at Alamur.
3. Ramachandrapuram Loan and Sale Society at Ramachandrapuram.
4. Parthasarathi Co-operative Marketing Society at Ramachandrapuram.
5. Samalkota Co-operative Marketing Society at Samalkota.

Kakinadu Circle.

6. Kakinada Co-operative Marketing Society at Kakinada.

7. Gollapalem Co-operative Marketing Society at Gollapalem.

8. Azad Co-operative Maketing Society at Pithapuram.

9. Gollaprolu Co-operative Marketing Society at Gollaprolu.

10. Thimmapuram Co-operative Marketing Society at Thimmapuram.

11. Kuthukulur Co-operative Marketing Society at Kuthukulur.

12. Mandapeta Co-operative Marketing Society at Mandapeta.

13. Sachithananda Co-operative Marketing Society at Kakinada.

14. Vetlapalem Co-operative Marketing Society at Vetlapalem.

15. Velangi Co-operative Marketing Society at Velangi.

16. Biccavolu Co-operative Marketing Society at Biccavolu.

17. Anaparthi Co-operative Marketing Society at Anaparthi.

18. Pithapuram Co-operative Marketing Society at Pithapuram.

19. Thallarevu Co-operative Marketing Society at Thallarevu.

20. Kolanka Co-operative Marketing Society at Kolanka.

21. Draksharama Co-operative Marketing Society at Draksharama.

22. Gangavaram Co-operative Marketing Society at Gangavaram.

Kakinada Circle

23. Kapileswarapuram Co-operative Marketing Society at Kapileswarapuram.
24. Dwarapudi Co-operative Marketing Society at Dwarapudi.
25. Chelluru Co-operative Marketing Society at Chelluru.
26. Vella Co-operative Marketing Society at Vella.

*Bhimavaram Circle.*

1. Bhimavaram Loan and Sale Society at Bhimavaram.
2. Narasapur Loan and Sale Society at Narasapur.
3. Penugonda Loan and Sale Society at Penugonda.
4. Achanta Loan and Sale Society at Achanta.
5. Akividu Marketing Society at Akividu.
6. Kopalle Co-operative Marketing Society at Kopalle,
7. Veeravasaram Co-operative Marketing Society at Veeravasaram.
8. Undi Co-operative Marketing Society at Undi.
9. Itampudi Co-operative Marketing Society at Itampudi.
10. Tanuku Co-operative Marketing Society at Tanuku.
11. Attili Co-operative Marketing Society at Attili.
12. Yendagandy Co-operative Marketing Society at Yendagandy.
13. Peravali Co-operative Marketing Society at Peravali.
14. Lankalakoderu Co-operative Marketing Society at Lankalakoderu.
15. Kodamanchili Co-operative Marketing Society at Kodamanchili.
16. Manchili Co-operative Marketing Society at Manchili.
17. Penumantra Co-operative Marketing Society at Penumantra.

### *Eluru Circle.*

1. Eluru Loan and Sale Society, Eluru.
2. Tadepalligudem Co-operative Marketing Society, Tadepalligudem.
3. Chintalapudi Co-operative Marketing Society, Chintalapudi.
4. Pedapadu Co-operative Marketing Society, Pedapadu.
5. Bhimadolu Co-operative Marketing Society, Bhimadolu.
6. Chebrolu Co-operative Marketing Society, Chebrolu.
7. Pentapadu Co-operative Marketing Society, Pentapadu.
8. Pippara Co-operative Marketing Society, Pippara.
9. Nawabpalem Co-operative Marketing Society, Nawabpalem.
10. Nidadavolu Co-operative Marketing Society, Nidadavolu.

### *Bapatla Circle.*

1. Bapatla Co-operative Loan and Sale Society, Bapatla.
2. Nidubrolu Co-operative Loan and Sale Society, Nidubrolu.
3. Ongole Co-operative Loan and Sale Society, Ongole.
4. Tenali Co-operative Loan and Sale Society, Tenali.
5. Repalle Co-operative Marketing Society, Repalle.
6. Appikatla Co-operative Marketing Society, Appikatla.
7. Buddam Co-operative Marketing Society, Buddam.
8. Jammalapalem Co-operative Marketting Society, Jammalapalem.

Bapatla Circle.

9. Munipalle Co-operative Marketing Society, Munipalle.

10. Thirumella Co-operative Marketing Society, Thirumella.

11. T.'Sundur Co-operative Marketing Society, T.'Sundur.

12. Chebrolu Co-operative Marketing Society, Chebrolu.

13. Inturu Co-operative Marketing Society, Inturu.

14. Kolluru Co-operative Marketing Society, Kolluru.

15. Bhattiprolu Co-operative Marketing Society, Bhattiprolu.

16. Kavuru Co-operative Marketing Society, Kavuru.

*Guntur Circle.*

1. Guntur Co-operative Loan and Sale Society, Guntur.

2. Siripuram Co-operative Marketing Society, Siripuram.

3. Narasaraopet Co-operative Marketing Society, Narasaraopet.

4. Mangalagiri Co-operative Marketing Society, Mangalagiri.

5. Piduguralla Co-operative Marketing Society, Piduguralla,

*Machilipatnam Circle.*

1. Krishna Co-operative Crop Loan and Sale Society, Machilipatnam.

2. Gudivada Co-operative Marketing Society, Gudivada.

3. Gudlavalleru Co-operative Marketing Society, Gudlavalleru.

4. Gudur Co-operative Marketing Society, Gudur.

5. Pedanandipadu Co-operative Marketing Society, Pedanandipadu.

*Machilipatnam Circle*—(Contd.)

6. Pedamuktevi Co-operative Marketing Society, Pedamuktevi.
7. Pamarru Co-operative Marketing Society, Pamarru.
8. Angalur Co-operative Marketing Society, Angalur.
9. Tamirisa Co-operative Marketing Society, Tamirisa.
10. Mopidevi Co-operative Marketing Society, Mopidevi.
11. Challapalli Co-operative Marketing Society, Challapalli.
12. Kaikalur Co-operative Marketing Society, Kaikalur.
13. Ghantasala Co-operative Marketing Society, Ghantasala.
14. Kosuru Co-operative Marketing Society, Kosuru.

*Vijayawada Circle.*

1. Jaggaiahpet Co-operative Marketing Society Jaggaiahpet.
2. Vijayawada Co-operative Marketing Society, Vijayawada.
3. Southvallur Co-operative Marketing Society, Southvallur.
4. Godavarru Co-operative Marketing Society, Godavarru.
5. Neppalle Co-operative Marketing Society, Neppalle.
6. Manikonda Co-operative Marketing Society, Manikonda.
7. Arugolanu Co-operative Marketing Society, Arugolanu.
8. Pedavutapalle Co-operative Marketing Society, Pedavutapalle.
9. Atkur Co-operative Marketing Society, Atkur.
10. Madanur Co-operative Marketing Society, Madanur.

*Vijayawada Circle*—(Contd.)

11. Gopuvanipalem Co-operative Marketing Society, Gopuvanipalem.

12. Kolavenu Co-operative Marketing Society, Kolavenu.

13. Indupalle Co-operative Marketing Society, Indupalle.

14. Mustabada Co-operative Marketing Society, Mustabada.

*Nellore (South).*

1. Mypadu Co-operative Loan and Sale Society, Mypadu.

2. Kota Co-operative Loan and Sale Society, Kota.

3. Muthukur Co-operative Loan and Sale Society, Muthukur.

4. Sullurpet Co-operative Loan and Sale Society, Sullurpet.

5. Kanuparthipadu Co-operative Marketing Society, Kanuparthipadu.

6. Kovur Co-operative Marketing Society, Kovur.

*Nellore (North).*

1. Alluru Co-operative Loan and Sale Society, Alluru.

2. Kavali Co-operative Loan and Sale Society, Kavali.

3. Pedaputhedu Co-operative Loan and Sale Society, Pedaputhedu.

4. Kandukur Co-operative Marketing Society, Kandukur.

5. Kovur Co operative Marketing Society, Kovur.

*Srikakulam Circle.*

1. Narasannapet Co-operative Marketing Society, Narasannapet.

2. Hiramandalam Co-operative Marketing Society, Hiramandalam.

*Srikakulam Circle*—(Contd.)

3. Palasa Co-operative Marketing Society, Tokkali.
4. Parvathipuram Co-operative Marketing Society, Parvathipuram.
5. Cheepurupalle Co-operative Marketing Society, Cheepurupalle.
6. Meliaputti Co-operative Marketing Society, Meliaputti.
7. Palaconda Co-operative Marketing Society, Palaconda.

*Visakhapatnam Circle.*

1. Bobbili Co-operative Marketing Society, Bobbili.
2. Anakapalle Co-operative Marketing Society, Anakapalle.
3. Bhimunipatnam Co-operative Marketing Society, Bhimunipatnam.
4. Vijayanagaram Co-operative Marketing Society, Vijayanagaram.
5. Narasapatnam Co-operative Marketing Society, Narasapatnam.

*Kurnool Circle.*

1. Kurnool Co-operative Marketing Society, Kurnool.
2. Maddikera Co-operative Marketing Society, Maddikera.
3. Dhone Co-operative Marketing Society, Dhone.
4. Adoni Co-operative Marketing Society, Adoni.

*Nandyal Circle.*

1. Nandyal Co-operative Marketing Society, Nandyal.
2. Chagalamarri Co-operative Marketing Society, Chagalamarri.

*Nandyal Circle*—(Contd.)

3. Nandikotkur Co-operative Marketing Society, Nandikotkur.
4. Cumbum Co-operative Marketing Society, Cumbum.
5. Koilkuntla Co-operative Loan and Sale Society, Koilkuntla.

*Chittoor Circle.*

1. Baireddipalle Co-operative Marketing Society, Baireddipalle.
2. Chandragiri Co-operative Marketing Society, Pakala.
3. Chittoor Co-operative Marketing Society, Chittoor.
4. Kalikiri Co-operative Marketing Society, Kalikiri.
5. Madanapalle Co-operative Marketing Society, Madanapalle.
6. Nagari Co-operative Marketing Society, Nagari.
7. Palamaner Co-operative Marketing Society, Palamaner.
8. Punganur Co-operative Marketing Society, Punganur.
9. Tiruttani Co-operative Marketing Society, Tiruttani.
10. Vayalpad Co-operative Marketing Society, Vayalpad.

*Cuddapah Circle.*

1. Rajampet Co-operative Loan and Sale Society, Rajampet.
2. Rayachoty Co-operative Marketing Society, Rayachoty.
3. Yeraguntla Co-operative Marketing Society, Kamalapuram.

*Cuddapah Circle*—(Contd.)

4. Pulivendla Co-operative Marketing Society, Pulivendla.

5. Proddatur Co-operative Marketing Society, Proddatur.

6. Cuddapah Co-operative Marketing Society, Cuddapah.

7. Gudipadu Co-operative Marketing Society, Gudipadu.

*Anantapur Circle.*

1. Uravakonda Co-operative Loan and Sale Society, Uravakonda.

2. Hindupur Co-operative Loan and Sale Society, Hindupur.

3. Tadpatri Co-operative Loan and Sale Society, Tadpatri.

4. Dharmavaram Co-operative Loan and Sale Society, Dharmavaram.

5. Kalyandrug Co-operative Loan and Sale Society, Kalyandrug.

6. Kadiri Co-operative Loan and Sale Society Kadiri.

7. Madakasira Co-operative Loan and Sale Society, Madakasira.

8. Guntakal Co-operative Loan and Sale Society, Guntakal.

9. Anantapur Co-operative Loan and Sale Society, Anantapur.

10. Penukonda Co-operative Loan and Sale Society, Penukonda.

11. Rayadrug Co-operative Loan and Sale Society, Rayadrug.

ABSTRACT.

| | | | |
|---|---|---|---|
| 1. Rajahmundry | ... 11 | 10. Nellore (North) | ... 5 |
| 2. Kakinada | ... 26 | 11. Srikakulam | ... 7 |
| 3. Bhimavaram | ... 17 | 12. Visakhapatnam | ... 5 |
| 4. Eluru | ... 10 | 13. Kurnool | ... 4 |
| 5. Bapatla | ... 16 | 14. Nandyal | ... 5 |
| 6. Guntur | ... 5 | 15. Chittoor | ... 10 |
| 7. Machilipatnam | ... 14 | 16. Cuddapah | ... 7 |
| 8. Vijayawada | ... 14 | 17. Anantapur | ... 11 |
| 9. Nellore (South) | ... 6 | | |
| | | Total | ... 173 |

S. G. APPA RAO NAYUDU,
30—6—1955.